మొదటి ముద్రణ 1000 ప్రతులు

1952 ఫిబ్రవరి

సమితి సభ్యులు.

శ్రీ రామకృష్ణ ధూత్ గారు

శ్రీ డా. వైద్యనాథన్ గారు

శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు

శ్రీ బాలకృష్ణ లాహోటీగారు

శ్రీ రామానుజదాసుగారు

వెల రు. 1-8-0 ఐ. జి.

1-0-0

ముద్రకులు:— ది మార్వాడీప్రెస్ లిమిటెడ్
అఫజల్ గంజ్, హైదరాబాద్ (దక్కన్)

# మనవి

హైదరాబాదు రాజ్యంలో సర్వోదయ సాహిత్యాన్ని ప్రచారంచేసి గాంధీజీ ఉపదేశించిన సిద్ధాంతాలను ప్రచారంలోనికి తీసుకొని రావలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఈ అవసరాన్ని గుర్తించి సర్వోదయ సాహిత్య ప్రకాశన సమితిని ఏర్పాటు చేయడమైనది. ఈ సమితిద్వారా గాంధీ సాహిత్యానికి సంబంధించిన గ్రంథాలనూ, కరపత్రాలనూ, పత్రికలనూ ప్రచురించవలెనని మేము ఉద్దేశిస్తున్నాము.

మా సమితి ప్రథమ పుష్పంగా శ్రీ కిశోరీలాల్ మష్రూవాలా రచించిన "గాంధి, సామ్యవాద్" అనే గ్రంథాన్ని తెలుగులో ప్రచురించే అవకాశం కలిగినందులకు ఎంతో సంతోషిస్తున్నాము.

ఈనాడు ప్రపంచంలో గాంధీవాద, సామ్యవాదాలే ప్రధానమైన సిద్ధాంతాలుగా ఏర్పడి ఉన్నవి. విశ్వశాంతిని సాధించుటకు ఈ రెండింటిలో ఏ వాదం ఉపయుక్తమైనదో ఆలోచించి నిర్ణయించుకొనవలసిన పరిస్థితి ఏర్పడి ఉన్నది. ఈ రెండు వాదాలలోని తారతమ్యాన్ని తెలుసుకొనడం అత్యవసరం. ఈ గ్రంథంలో ఈ రెండు వాదాలూ విస్తృతంగా వివరించబడినవి.

మూలగ్రంథం హిందీలో ఉన్నది. నవజీవన మందిరంవారు దానిని ప్రచురించారు. ఈ గ్రంథాన్ని తెలుగులో అనువదించి ప్రచురించుకొనుటకు అనుమతించిన నవజీవన ట్రస్టు వారికి మా అభివందనాలు. గౌరవనీయులైన హైదరాబాదు విద్యాశాఖా మంత్రి శ్రీ బూరుగుల రామకృష్ణారావు గారు దయతో ఈ గ్రంథానికి ప్రస్తావనను వ్రాసియిచ్చారు. వారికి మా అభివందనాలు. ఈ గ్రంథాన్ని తెలుగులోనికి అనువదించడం

ఒక పెద్ద పని. ఈ ఉత్తమ గ్రంథాన్ని తెలుగులోనికి అనువదించిన శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారికి మా నమోవాకాలు. ఈ గ్రంథాన్ని ముద్రించడానికి కావలసిన డబ్బును సమకూర్చి, గ్రంథాన్ని ముద్రించి మాకు ఎంతగానో సహాయపడిన ది మార్వాడీ ప్రెస్ లిమిటెడ్ డైరెక్టర్ల సంఘానికి మా ధన్యవాదాలు. ఆంధ్ర పాఠకలోకం మాకు తగినంతగా చేయూత నొసంగ గలదని ఆశిస్తున్నాము.

ఇట్లు

సర్వోదయ సాహిత్య ప్రకాశన సమితి



# ప్రస్తావన

## శ్రీ బూరుగుల రామకృష్ణారావుగారు.

నేడు ప్రపంచం రాజకీయ సిద్ధాంతాల దృష్ట్యా రెండు పరస్పర విరుద్ధమైన తెగలుగా ఏర్పడి గొప్ప మహాసంఘర్షణ వైపుకు సాగి పోవుచున్నది. రష్యా నాయకత్వంలో కొన్ని దేశాలవారు సమాజవాద సిద్ధాంతాలపై ఆధారపడి తమ సంఘవ్యవస్థను నిర్మించుకొనుటకు ప్రయత్నిస్తున్నారు. సమాజవాదం ఆ దేశాలలో రాను రాను జీర్ణించుకొనిపోయి ఆ దేశప్రజలను సంపూర్ణంగా విలీనం చేసుకొన్నది. కొన్ని దేశాలలో సమాజవాద సిద్ధాంతాలను తమ దేశపరిస్థితుల కనుగుణ్యంగా మార్చుకొనే ప్రయత్నంగూడా జరుగుతున్నది. మనస్సులో ఇష్టం ఉన్నా లేకపోయినా రష్యాదేశపు నాయకత్వాన్ని అంగీకరించడం అనివార్యమైనందువలన కొన్ని దేశాలవారు సమాజవాద సిద్ధాంతాలను యథాతథంగా అంగీకరిస్తున్నారు. ఆ సిద్ధాంతాలను మార్చుకొనలేక పోతున్నారు. ఈ అంతస్సంఘర్షణ గూడా కొంత జరుగుతున్నది. ప్రపంచంయొక్క రెండవభాగంలో అమెరికా నాయకత్వంక్రింద జాతీయతా సిద్ధాంతంపైనఆధారపడిన ప్రజాతంత్ర ప్రసారం జరుగుతున్నది. ఈ ప్రజాతంత్రంలో ధనికవాదం, పూంజీపతిత్వం ముసుగు వేసుకొని దాగుడు మూతలాడుతున్నవి. అయినప్పటికీ ప్రపంచాన్ని సుస్థిరమైన ప్రగతిమార్గంలో తీసుకొని పోవుటకు అసంపూర్ణమూ, దోషభూయిష్ఠమూ అయినప్పటికీ ఈ ప్రజాతంత్రమే ఉపయుక్తమైనదని ఈ దేశాలవారు విశ్వసిస్తున్నారు. ఈ ఇరుతెగలవారూ తమతమ సిద్ధాంతాలను ఇతర దేశాలపైనా, ప్రజలపైనా "ఏనకేన ప్రకారేణ" బలవంతంగా రుద్దడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ ప్రయత్నంలోనే తొందరలో తాము ఏర్పరచుకొన్న లక్ష్యాన్ని చేరుటకు ఇరుతెగలవారూ భౌతిక

శాస్త్ర విజ్ఞానాన్ని ఉపయోగిస్తూ వినాశకరమగు ఆయుధముల ఉత్పత్తిలో నిమగ్నులై ఉన్నారు. ఈ తరుణంలో భౌతికవాదాలపై ఎదురావగా ఆధార పడి ఉన్న ఈ శస్త్రలు ప్రపంచ కళ్యాణమునకు ఉపయుక్తం కావనీ, చిరస్థాయియైన మానవ కల్యాణం ప్రేమ, శాంతి అను సుస్థిరమైన పునా దుల పైననే ఏర్పడగలదనీ నిరూపించు ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రసా దించే భాగ్యం మన భారత దేశానికే కలిగింది. చిరకాల బానిసత్వం క్రింద మ్రగ్గిపోయిననూ, అజ్ఞాన దారిద్ర్యాది మహాదుఃఖములలో మునిగిఉన్ననూ ప్రపంచమునకు మార్గదర్శకులుగా ఉండే మహాపురుషులను ప్రసాదించే శక్తిని మన భారతమాత కోల్పోలేదు. గాంధీయుగం కేవల రాజకీయ స్వాతంత్ర్య సముపార్జన దృష్ట్యానే గాక అనేక ఇతర విధాలుగా ఒక మహాయుగమని పరిగణింప దగినది. గాంధీ తత్వజ్ఞానం ఏకముఖమైనదికాదు. అది సర్వతోముఖమైన ఒక స్రవంతి. సంపూర్ణ మానవత్వవికాసమునకు దోహదమొనర్చు ఒక నవీనమార్గం. కొందరు దీనిని ఒక దర్శనమని పరిగణించు టకు శంకింతురు. కాని, ఈ తత్వజ్ఞానంలో ఇమిడిఉన్న వివిధ సిద్ధాం తాలనూ, దృక్పథాలనూ పరిశీలించినచో ఇది ఒక విశిష్ట దర్శనమని అంగీకరించక తప్పదు. ఈదర్శనమునకు మూలాధారమగు ఒక గ్రంథముగానీ, ఒక అధికృతమైన శాస్త్రముగానీ లేదు. ఇది గాంధీగారు తమ జీవితంలో వివిధ ఘటనల సందర్భంలో నిరూపించిన సత్యమునుండీ, అనుసరించిన విధా నములనుండీ గళితమై తేలుతూ ఉన్నది. ఈ విజ్ఞానం కేవలం సూత్ర ప్రాయంగా ఉన్నది. ఈ సూత్రాలకు నాకు తెలిసినంతవరకు ముగ్గురు వ్యాఖ్యాతలు కలరు. ఆముగ్గురూ శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, శ్రీ ఆచార్య వినోబాభావేగారు, శ్రీ కిశోరీలాల్ మష్రువాలా గారలు. శ్రీ కుమారప్పగారిని నాలుగో వ్యాఖ్యాతగా అంగీ కరించవచ్చును. మష్రువాలాగారు నిశితమైన విమర్శనాశక్తిగల తత్వజ్ఞాని. గాంధీజీని మార్క్సుతో పోల్చి పరస్పర సామ్యములనూ, వానితోపాటు

వైషమ్యములనూ సంపూర్ణంగా విశదీకరించి గాంధి, మార్క్సు అనే గ్రంధములో తమ అమూల్యమైన అభిప్రాయములను వెల్లడించినారు. సామాన్యంగా స్థూలదృష్టిచే ఈ సిద్ధాంతాలను అవగతం చేసుకొని విమర్శించువారు వీనిలోగల పరస్పర వైషమ్యములకు ఎక్కువ ప్రాముఖ్యత నివ్వక అహింసాతత్వం ఒక్కటే ఈ రెండింటిలో ఉండు తారతమ్యమని భావిస్తూ ఉంటారు. ఈ రెండు సిద్ధాంతాలలో ఉండే ప్రధానమైన తారతమ్యం ఈ గ్రంధంలో బాగుగా విశదీకరింపబడినది. ఈ గ్రంధం ఇంతవరకు తెలుగులోనికి అనువదింప బడలేదు. శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారు మంచి సులభమైన, స్పష్టమైన భాషలో అనువదించి ఈ గ్రంధమును సర్వోదయ సాహిత్య ప్రకాశన సమితి ద్వారా ఆంధ్రలోకానికి అందజేస్తున్నారు శ్రీ శర్మగారి ప్రయత్నం సర్వదా ప్రశంసనీయం. ఆంధ్రదేశంలో ఇలాంటి గ్రంధం వెలువడడం నేడు ప్రత్యేకంగా అవసరమని కూడా చెప్పవచ్చును. యువకులలో ముఖ్యంగా క్షుణ్ణమైన పరిజ్ఞానం లేనందువలన గొప్ప బుద్ధిభేదం జనించినది. మార్క్సు సిద్ధాంతాలు ఆంధ్రయువకులను అత్యంతంగా ఆకర్షించడం చూస్తూ ఉన్నాము. అట్టి ఆకర్షణకు గల కారణములను నిరూపించుటకు ప్రయత్నించినచో ఈ ప్రస్తావన యొక్క ఉద్దేశ్యాలను అతిక్రమించిన వాడనగుదును. గాంధీగారి సిద్ధాంతాలను అమలులో పెట్టుటయందు ఇతర ప్రాంతములకంటే అనేకరెట్లు ఉత్సాహంతో ముందంజవేసిన ఆంధ్రదేశం నేడు మార్క్సువాద సిద్ధాంతాలకు ఆలవాలమై చెలరేగి పోతూ ఉన్నది. నేడు ఆంధ్రపౌరుషమంతా వర్గ, మత వైషమ్యాలలో వమ్మై పోవుచున్నది. ఆంధ్రవీరుల ఆయుధములు ఒకరి కుత్తుకలనొకరు తెంచుకొనుటకు ఉపయోగపడుచున్నవి. ఈ వాతావరణం అనేక కారణాల వలన కలిగినదనీ, ఇది శాశ్వతంగా ఉండబోదనీ విశ్వసించేవారిలో నేనొకణ్ణి. అట్టి శుభకరమైన మార్పును తీసుకొని రావడానికి అనేక గొప్ప ప్రయత్నాలు జరుగవలసి ఉన్నవి.

కేవలం భౌతికవాదంపై నిర్ధారితమైన సమాజవాదం భారతీయసంస్కృతికినీ, భారతదేశ పరిస్థితులకునూ ఎన్నటికీ ఉపయుక్తం కాదనీ, ఎన్నడైనా సమాజవాదం భారతదేశ ప్రజానీకాన్ని సంపూర్ణంగా విలీనం చేసుకొనగలిగినచో ఆ సమాజవాదం మార్క్సు సమాజవాదం గాక సంపూర్ణంగా రూపాంతరం పొందిన ఒక కొత్త భారతీయ సమాజవాదంగా ఉంటుందనీ నేను భావిస్తాను. కనుక ఈ గ్రంథం జిజ్ఞాసువులగు ఆంధ్ర పాఠకులకు అత్యంతంగా ఉపకరించునని విశ్వసిస్తున్నాను. గాంధీ దర్శన గ్రంథాలను ప్రకటింప దలచి కొత్తగా ఏర్పడిన సర్వోదయ సాహిత్య ప్రకాశన సమితిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. గాంధీ సిద్ధాంతత్రియమును అనగా వర్ణవ్యవస్థ, ధర్మకర్తృత్వ సిద్ధాంతము. వికేంద్రీకరణము, అను ఈ మూడు సిద్ధాంతములను విపులంగా స్పష్టపరచి ఈ మూడింటి సమీకృత రూపమైన గాంధీదర్శనాన్ని శ్రీ మష్రువాలాగారు వ్యాఖ్యానించారు. కనుక అతి శ్రద్ధతో ఈ గ్రంథమునకు స్వాగత మివ్వవలెనని ఆంధ్రపాఠక లోకానికి మనవి చేసుకుంటున్నాను.

---

# భూమిక

## వర్తమానము—దాని ప్రాముఖ్యత.

సృష్టి అనాది అనే విషయం అందరూ అంగీకరించినదే, కాని ప్రస్తుతం మనం నివసిస్తున్న భూమి సుమారు రెండు వందల కోట్ల సంవత్సరాల వయస్సు గలది అని పౌరాణికులూ, ఆధునికులూ ఇద్దరూ అభిప్రాయ పడుతున్నారు. మొదట భూమి జంతురహితంగా అంటే ప్రాణిరహితంగా సూర్యుని వలెనే మండుతూ ఉండే ఒక అగ్నిగోళంగా ఉండేది. అది నెమ్మదిని నెమ్మదిగా చల్లబడి జీవులు నివసించడానికి తగిన స్థితిలోనికి వచ్చింది. తరువాత జీవసృష్టి ప్రారంభమయింది. సూక్ష్మజీవులు మారి మారి, వృద్ధి పొంది పొంది చివరకు మానవశరీరం ఏర్పడింది. ఇది జరిగి పది పన్నెండు లక్షల సంవత్సరాలయిందని వైజ్ఞానికులు అంటున్నారు. ఇలాంటి ఈ మానవజీవిత ప్రవాహంలో వంద రెండు వందల సంవత్సరాలు అంటే లెక్క ఏముంటుంది? కాని, గడచిన వంద రెండు వందల సంవత్సరాలూ చరిత్రలో ఎంతో ప్రాముఖ్యతను సంపాదించుకొన్నవి. ఎందువల్లనంటే దాదాపు సగం మానవచరిత్ర ఈ కాలంలోనే నిర్మాణమైనట్లు కన పడుతున్నది.

వర్తమానకాలానికి ప్రాముఖ్యత ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. వర్తమానకాలం భూతకాలానికి ఫలమై భవిష్యత్కాలానికి బీజ రూపంలో ఉంటుంది, కనుక భవిష్యత్కాలం దృష్టితో ఆలోచించినా వర్తమానకాలం ఎంతో మహత్తరమైనదే. భూత భవిష్యత్కాలాలకు సంధిస్థానంలో ఉండడం వలన అది స్వాభావికంగానే విప్లవమయమైన కాలమయి వుంటుంది. ఆ విప్లవం, ఆ క్రాంతి జన్మదాయకమూ, మరణదాయకమూ, అభివృద్ధి

దాయకమూ, వినాశదాయకమూ అనేది వేరే విషయం. వర్తమానకాలం ఎల్లప్పుడూ విప్లవాత్మకంగానే ఉంటుంది. అది అసలు "నభూతో న భవిష్యతి" గా ఉంటుంది. కాంగ్రెసుసమావేశాలు అరవై అరవైఐదు సంవత్సరాల నుండి జరుగుతూనే ఉన్నవి ప్రతి సంవత్సరమూ ఈ సారి జరిగే కాంగ్రెసు సమావేశం చాలా ముఖ్యమైనదని మనం అనుకోడం లేదా? అంత దూరమెందుకు? ఒక చిన్న ఉదాహరణను చూడండి. ఒక తల్లికి ఒక శిశువు జన్మించాడనుకోండి. ఆ తల్లి ఏ మనుకుంటున్నది? ఇలాంటి శిశువు ఇంకా ఎవ్వరికీ జన్మించలేదని అనుకోదూ? ఇంతవరకూ ఏ పిల్లవానికీ ఎవ్వరూ పెట్టని పేరును సూచించమని అనేకమంది తల్లులు నన్ను అడుగుతూ ఉంటారు.

సారాంశమేమంటే వర్తమానకాలం నిజంగా విప్లవకాలమే. ఆ విప్లవం సామాన్యమైన విప్లవం కాదు. అపూర్వమైన విప్లవం. ఆ మధ్య ఒక మహానుభావుడు "నీ శాంతి శ్శాంతి శ్శాంతిః అనేది మాకు పనికిరాదు, క్రాంతిః కాంతిః క్రాంతిః అనగా విప్లవం, విప్లవం, విప్లవం అనే నినాదం కావలె నన్నాడు. "ఒక సారి క్రాంతి అంటే చాలు, మూడు సార్లు క్రాంతి క్రాంతి అని అన్నారంటే అసలు స్థానాన్నుండి గూడా మీరు చ్యుతులై పోతారు, శాంతికి అలాంటి భయమేమీ లేదు, అది ఎప్పుడూ పురాతనంగానే ఉంటుంది, కాని క్రాంతి పురాతనమైనదైపోతే పనికి రాకుండా పోతుంది, అందువలన క్రాంతి శబ్దాన్ని ఒకసారి మాత్రమే నినాదంగా ఉపయోగించవచ్చునని నేను అతనికి సమాధానం చెప్పాను.

వర్తమానకాలానికున్న ప్రాముఖ్యత భూతకాలానికి ఎలా వస్తుంది? ఈ భూతకాలం వర్తమానకాలంగా ఉన్నప్పుడు మహత్తరంగా ఉండేదిగాదా అంటే ఉండవచ్చును, ఇక ఆ వర్తమానకాలం దుఃఖంలో

గడిస్తే దాని ప్రాముఖ్యత మరీ పెరుగుతుంది. అది అమూల్యమై పోతుంది. దుఃఖసమయం ఎప్పుడూ దీర్ఘంగా కనపడుతూ ఉంటుంది. ఒకటీ దుఃఖదాయకమైన ఘటన అనేక సుఖకరమైన ఘటనలను తనలో జీర్ణం చేసుకుంటుంది. అనేక సుఖస్మృతులు విస్మృతిగర్భంలో లీనమై పోతవి. మొదటి దుఃఖం అంతకంటే ఎక్కువైన ఇంకొక దుఃఖం సంప్రాప్తమైతేనేగాని మరుపుకు రాదు. దుఃఖాన్ని పోగొట్టే శక్తి సుఖంలో లేదు. అంతేగాక సుఖంవల్ల దుఃఖస్మరణ ఇంకా అధికంగా బాధిస్తుంది. దుఃఖాన్ని నశింపుచేయడం అంతకంటే తీవ్రమైనదుఃఖం వల్లనే సంభవమవుతుంది. గడచిన వంద రెండువందల సంవత్సరాలూ మనకు వర్తమాన కాలంగా ఉన్నవి. అందులో అవి దుఃఖపు సంవత్సరాలు. అందువలన మనదృష్టిలో ఆ కాలం మానవ చరిత్రనంతా గ్రసించిందంటే అందులో ఆశ్చర్యమేమీ లేదు.

## జైలు విద్యాలయాలు

ఈ యుగాన్ని దుఃఖయుగమంటున్నాము గదా? అలాంటి సంఘటన ఏమి జరిగింది? అని ప్రశ్న. సుఖసాధనాలు ఈ యుగంలో ఎక్కువగా పెరిగినవి. అందువల్లనే మనదుఃఖాలు ఎక్కువైనట్లున్నవి. సుఖదుఃఖాలు రెండూ పరస్పరం ఒక దానికింకొకటి విరుద్ధంగా ఉంటవి. కాని వాటి రెండింటికీ జన్యజనకభావం ఉంటుంది. సుఖం దుఃఖాన్ని జనింపచేస్తే దుఃఖం సుఖాన్ని జనింపచేస్తుంది. రెండో జన్మ ఎప్పుడు ఏర్పడవలెనో అప్పుడే ఏర్పడుతుంది, కాని ప్రస్తుతం మొదటి జన్మోత్సవమే ఇంకా జరుగుతూ ఉన్నది. ఈ సుఖానికి వెనుక ఎన్ని వ్యవహారాలున్నవో? సుఖం అనగానే దానిని ఎలా పంచుకోవాలి అనేది ఎంత జటిలమైన సమస్యగా మనముందుకు వస్తుంది? దుఃఖం విషయంలో ఇలాంటి సమస్య ఏమీ లేదు-గదా? యావత్తు దుఃఖాన్నీ ఒకడే అనుభవించినా, ఒకడే తన అధీనంలో

పెట్టుకున్నా ఎవ్వరికీ పట్టదుగదా! ! ఏ మహాత్ముడైనా, లేక ఏ మహామూర్ఖుడైనా ఆ విషయాన్ని పట్టించుకుంటే అది ఏదో "మినహాయింపు" అనుకోవాలి. "స మహాత్మా సుదుర్లభః" అటువంటి మహాత్ముడు లభించడం దుర్లభం. ఈ నాటి మన యుగం సుఖ సాధనాలను నిర్మించింది, నిజమే. కాని ఆ సాధనాల, సుఖరాశుల బరువుక్రింద సామాన్య జనం నలిగిపోతున్నది. చక్కెర బస్తాలు ఎద్దులనడుముల మీదకు ఎక్కినవి. యజమానుల పొట్టలలోనికి పోయినవి. వాటిని తిని తిని యజమానుల పొట్టలు చెడితే మోసి మోసి ఎద్దుల నడుములు విరిగినవి. ఎంతో తియ్యగా ఉండే చక్కెర చూడండి, ఏమి పనిచేసిందో!!! సుఖాన్ని పంచుకోడంలో ఒకరు సింహం భాగాన్ని తీసుకుంటా నంటే ఇంకొకరు నక్క భాగాన్ని తీసుకుంటామంటున్నారు. పాపం గొర్రె పిల్ల భాగానికి ఏమీ వచ్చేటట్లు కనపడడం లేదు. అంతేగాదు, చివరకు ఆ గొర్రెపిల్లయే ఆ రెండింటికీ ఆహారమయ్యే పరిస్థితి సంభవించింది. ఈ నాడు జనసామాన్యం ఇలాంటి ప్రశ్నను—సమస్యను ఎదుర్కొనవలసివచ్చింది. దీనిలో నుండి విముక్తిని పొందేది ఎలా? ఇదే ఈ నాడు మన ముందున్న పెద్ద సమస్య. ఈ సమస్యాపరిష్కారానికే అనేక గందరగోళాలు బయలుదేరి ఉన్నవి.

1930, 32 సంవత్సరాలలో సత్యాగ్రహులతో జైళ్ళన్నీ నిండి పోయినవి. ఆవేశవంతులైన కొందరు, ఒక దొంగను విడిపించి ఏసుక్రీస్తును సిలువమీద కెక్కించారని బైబిలులో కథ ఉన్నది. అదేవిధంగా ఆరోజుల్లో ప్రభుత్వంవారు దొంగలనందరినీ విడిపించి సత్యాగ్రహులతో జైళ్ళను నింపి వేశారు. నిండిపోయిన ఆజైలుగదులలో ఏమేమి జరిగినదో, ఏమేమి జరగ లేదో అన్నిధ్వనులనూ తనలో ఇముడ్చుకునే ఆ ఆకాశాన్ని అడగవలసిందే! కొంతమంది జోతిష్యం లోకి దిగారు. భవిష్యవాణులన్నీ అసత్యమై పోతూ ఉన్నా నిరాశపడకుండా ఎప్పుడు తాము విడుదల అవుతారో కొందరు చెప్పుతూ ఉండేవారు. అది నిరాశా సూచకం. నిరాశ అనేది దాగే వస్తువు కాదు. వందసంత్సరాల యుద్ధసంగతి మనం చరిత్రలో చదివియే ఉన్నాము. కాని జైళ్లో

లో ప్రతి నెలా ఎంతో బరువుగానే గడచేది. అకూడ కొంతమంది ధర్మానుష్ఠానం లో మగ్నులైనారు. కొంతమంది శాకశాస్త్రంలో ప్రావీణ్యాన్ని సంపాదించారు. కొంతమంది రెండు పనులలోనూ సమన్వయాన్ని కలగజేశారు. ఇలాంటివి ఎన్నో వృత్తులు ఆనాడు అవలంబించ బడినవి. అయినా అందరికీ పనులు పూర్తిగా లభించలేదు. పని లేని వారందరూ ప్రపంచంలోనూ, భారత దేశంలోనూ వ్యాపించి ఉన్న దుఃఖాన్ని ఎలా పోగొట్టాలి అని బుద్ధునివలె మార్గాన్వేషణం చేయటం ఆరంభించారు.

గాంధీజీ చెప్పిన మార్గాన్ని అనుసరిస్తేనే ఈ సమస్య పరిష్కారమవుతుందని స్పష్టగా నమ్మేవారు తమలోని దోషాలను గురించి ఆలోచించడం ఆరంభించారు. గాంధీగారి మార్గం మంచిదే, కాని మనవాళ్ళు ఆమార్గంలో సరిగా నడవడంలేదు. మనం సత్యాగ్రహులమను పేరుతో జైలులోకి వచ్చాము దొంగలద్వారా బయటికి వార్తలు పంపుతున్నాము. అవసరమైన వస్తువులన్నింటినీ దొంగతనంగా తెప్పించుకొంటున్నాము, ఇక మనలో సంయమం ఏమాత్రం ఉన్నదని ఆలోచిస్తే రెండు నెలలే మనకు సంవత్సరాలుగా కనబడుతున్నవి. మనం పేరుకు సత్యాగ్రహుల మన్నమాట. మన సాధనాలు సరిగా లేకపోతే మనకు సిద్ధి లభించేదెలా ? కనుక ఏకాంతంలో ఉన్న మనం అందుకు తగిన గుణాలను మనలో వికసింప జేసుకోవాలి అని భావించి కొంతమంది జైలుపనిపూర్తికాగానే వడకడమో, పాకీపని చేయడమో ప్రారంభించారు.

మరి కొంతమందికి ఇదేమీ నచ్చలేదు. రాజకీయ రణరంగంలోగూడా సత్యమనీ, అహింసఅనీ మీరు అంటారు. ప్రపంచంలో అనేక రాజకీయ యుద్ధాలు జరిగినవి, మనం చూపిస్తున్న దాని కంటె ఎక్కువ సంయమాన్ని

చూపించిన యుద్ధాన్ని ఒకదానినైనా చూపించగలరా ? అహింసాపూరిత యుద్ధసాఫల్యం కొరకు మానవ స్వభావాన్నే మార్చడానికి ప్రయత్నంచేస్తే ఆ సాఫల్యం ఎండమావుల వలె అవుతుంది. సద్గుణాలను పెంచుకుంటూ పెంచుకుంటూ జనసామాన్యంఅంతా త్యాగమయమైన పాఠాన్ని నేర్చుకోనవలెనంటే ఆ పాఠాన్ని ఎంతకాలమని నేర్పుతాము? దుర్జనులకు హృదయపరివర్తనం కలిగేదెప్పుడు ? ప్రజలదుఃఖాలు దూరమయ్యే దెప్పుడు ? అసలు ఇదిఅంతా జరిగేదేనా ? ఇంకొక మార్గం కనబడక పోవడం వలన మేము గాంధీగారి మార్గాన్ని అవలబించాము, మార్గం మంచిదే, కాని లక్ష్యానికి ఆ మార్గం మమ్మల్ని చేర్చక పోతే, మంచిదని ఆ మార్గాన్ని మేము అనుసరిస్తామా? అటు రష్యా వైపుకు చూడండి, చూస్తూ చూస్తూ ఉండగానే అక్కడ ఎలాంటి విప్లవం జరిగిందో! దేశస్వరూపాన్నే ఆ విప్లవం మార్చివేసింది, వారిప్పుడు ప్రపంచాన్ని అంతా తమవలె చేయవలెనని ప్రయత్నం చేస్తున్నారు. ఇక మనమో, సత్యమనీ, అహింస అనీ జైలు క్రమశిక్షణకు లోబడి ఉన్నాము. ఇలాగైతే జరిగేదెలా? దేశంలోని కార్యకర్తలందరూ నెలల తరబడిగా జైళ్లలో ఉండడం సామాన్యమైన విషయమా ? బయటనైనా కొంత ఆందోళన ఉంటే, పోనీ సంతోషించవచ్చును, అదీలేదాయె. బయటఅంతా శూన్యంగా ఉన్నది, ఇక్కడ మనం సంయమాన్ని పాలిస్తున్నాము. బయటి శూన్యత్వమూ ఈ మన సంయమమూ ఈ రెండూ కలిస్తే స్వరాజ్యం వస్తుందా? కనుక మనం అనుసరించిన మార్గం తప్పు మార్గం, అందువలన ఆత్మసంశోధనకంటే మార్గసంశోధన చేసుకోవడం మనకు అవసరం. మన ఆత్మ ఎలాఉండాలో అలాగే సరిగానే ఉన్నది" అని కొంతమంది నవయువకులు సోషలిస్టు, కమ్యూనిస్టు సాహిత్యాన్ని చదువడం ఆరంభించారు. ప్రళయకాలంలో భూమి జలమగ్నం అయిపోయినప్పుడు ఒంటరిగా అగాధమైన సముద్రంలో ఈదుతూవున్న

మార్కండేయునిలాగా ఈ నవయువకులు ఆ ఏకాంత జైలు జీవితంలో సామ్య
వాద సాహిత్యసాగరంలో ఈదులాడారు. మునకలు వేశారు.

నిజానికి సామ్యవాదసాహిత్యం కొన్ని చోట్ల గంభీరంగానూ, కొన్ని
చోట్ల సారహీనంగానూ ఉన్నా మొత్తం మీద సముద్రంలాగా అగాధమైనదే.
కొంత మంది మార్క్సు వ్రాసిన "కాపిటల్" అనే అగాధసముద్రంలో
స్నానం చేశారు. కొంతమంది రష్యానుండి బయలు దేరిన, లోతులులేని ప్రచార
సాహిత్యాన్ని అధ్యయనం చేయడం ప్రారంభించారు. ప్రాచీనకాలం నాటి
పురాణ యుగాన్ని వదలిపెడితే ఎన్ని పునరుక్తులున్నా వాటిని లెక్క చేయ
కుండా సాహిత్యాన్ని అధిక ప్రచారంలోనికి తీసికొని వచ్చిన అద్భుతమైన
ఉత్సాహం కమ్యూనిస్టులలోనే కనపడుతుంది. వినేవాడూ చదివేవాడూ ఎంత
మరచి పోదామన్నా ఆసాహిత్యం ఎంతో కొంత జ్ఞాపకం ఉంటూనే ఉంటుంది.
అలాంటి సాహిత్యం నిర్మాణమవుతున్నది. అంత శ్రద్ధతో పూర్వకాలపు
ఋషులలాగా ఈ నాటి కమ్యూనిస్టులు సాహిత్యప్రచారం చేస్తున్నారు.
మరణించిన తరువాత స్వర్గాన్ని పొందవచ్చుననే కల్పనతో పౌరాణికులు
ప్రచారం చేస్తే, రష్యాలో స్వర్గం నిర్మితమైనదనే కల్పనతో ఈ మన
అనుచరులు విస్తృతమైన సామ్యవాద సాహిత్యాన్ని ప్రచారం చేశారు.
చేస్తున్నారు. 1940 సంవత్సరంలో వ్యక్తిగత సత్యాగ్రహపు రోజుల్లో ఒక
మిత్రుడు "మీరు కమ్యూనిస్టుసాహిత్యం చదవలేదు, అది తప్పక చదవ
వలసిందే నని నాకు సలహా చెప్పాడు. వడికే సమయంలో నాకు చదివి వినిపించ
వలసిందని ఆ మిత్రుణ్ణి నేను కోరాను. ఆ మిత్రుడు తన దృష్టిలో మంచిదను
కొన్న సాహిత్యాన్ని నాకుచదివి వినిపించాడు. అంతకుముందే జైలుబయటనే
కాపిటల్ అనే పుస్తకాన్ని నేను చదివిఉన్నాను. కాపిటల్ కమ్యూనిస్టు

సంహితలాంటి గ్రంథం. అందువలన ఆ మిత్రుడు చదివిన దానిని అర్థం చేసుకో డానికి నాకేమీ కష్టం కలుగలేదు. రోజూ గంటగంటన్నర సేపు ఇలా శ్రవణం జరిగింది. కొన్ని నెలలు అలా జరిగింది. అందులో పునరుక్తులు విప రీతంగా ఉన్నా ఆ సాహిత్యం నా మనస్సుమీద ఎంతో ప్రభావాన్ని హత్తు కొనేటట్లు చేసింది. నా స్థితి యే అలా అయినప్పుడు మన నవయువకులు ఆ సాహిత్యాన్ని చదివి మంత్రముగ్ధులై పోతున్నారంటే ఆశ్చర్య పడవలసిన దేమీ లేదు.

## రెండు విధానాలు, నిష్ఠలు.

గుణవికాసమూ, సమాజనిర్మాణమూ ఈ రెండునిష్ఠలూ ఆదికాలం నుండి ఇప్పటివరకూ అమలులో ఉన్నవి. గుణాలవల్లనే జగత్తు నడుస్తున్నది. మనుష్య జీవితం గుణ ప్రేరితమే. గుణాలు వికసించినకొద్దీ సమాజనిర్మాణం కూడా మారుతూ ఉంటుంది. కనుక సజ్జనులు ఎల్లప్పుడూ గుణవికాసది వైపు నకే తమదృష్టిని కేంద్రీకరించి ఉంచవలెను. సమాజ నిర్మాణానికి సంబంధిం చిన గందరగోళంలో పడడం అనవసరంగా ఆదిహాకారావరణలోనికి పోవడమే. “జగద్వ్యాపార వర్జ్యం” అనేది భక్తులకు గల వాద్దు. (భక్తునికి జగత్సృష్టి పాలన, సంహారక్రియలు తప్ప మిగతావన్నీ లభ్యం కాగలవు) అని దానికి అర్థం. సత్యము, అహింస, యమనియమాదుల విషయంలో నిష్ఠావంతులమై, నిత్య వ్యవహారాలలో ఆ గుణాలు ప్రతిబింబించేటట్లు చూచుకుంటూ ఉండటమే మనపని. ఇది జరిగితే మిగిలిన పని తనంతట అదే జరుగుతుంది పిల్లవాడికి పాలివ్వు అని తల్లికి చెప్ప నక్కర్లేదు. కష్టం కలిగితే ఏడువుము అని పిల్లవాడికి మనం నేర్పవలసిన అవసరంలేదు. వాత్సల్యం కలిగితే పాలు వాటంతట అవే తాగించబడతవి. కష్టం కలిగితే సహజంగానే ఏడవడం సంభవిస్తుంది అని గుణవికాసవాదులు అంటారు

ఇది ఒక పద్ధతి. ఈ పద్ధతి సత్పురుషులకు సహజంగానే స్ఫురించే పద్ధతి. గీతలో వర్ణింపబడిన దైవీ సంపత్తునూ, జ్ఞానలక్షణాలనమానిత్వాదులలోని ఒక్కొక్క గుణాన్ని గురించి అంతగా విచారించిన జ్ఞానదేవుడు కూడా ఇదే పద్ధతిని అనుసరించాడు.

కమ్యూనిస్టులు చెప్పే వేదాంతం సరిగ్గా ఇందుకు వ్యతిరేకంగా ఉంటున్నది. గుణవికాసమనేది చిత్తంలోనే జరిగినా చిత్తంవల్ల నిర్మింపబడినది కాదు. పరిస్థితులవల్ల నిర్మింపబడినది. అసలు చిత్తమే పరిస్థితులవల్ల నిర్మించబడుతున్నది. "భౌతికం చిత్తం" చిత్తం పంచభూతాత్మకమైనది. చిన్న పిల్లవానికి గడ్డాలు మీసాలవాళ్ళని చూస్తే భయం కలుగుతున్నది. దానికి కారణం అతని తల్లికి అవి లేకపోవడమే. తల్లికి మీసాలూ గడ్డాలూ ఉండి ఉంటే అవి లేనివారిని చూస్తే ఆపిల్లవానికి భయం కలిగేది. బాధ కలిగినప్పుడు ఏడుపు సహజంగా వస్తుందని మీరు అంటున్నారు. మరి గుర్తుకుంటే బాధ కూడా సహజంగానే కలుగుతుంది. చిత్తమనే స్వతంత్ర పదార్థం ఏదైనా ఉన్నదా? నిజానికి అది సృష్టికి ఒక ప్రతిబింబం మాత్రమే. ఛాయ మాత్రమే. ఛాయను సంయమిస్తే వస్తువు సంయమితమవుతుందా, లేక వస్తువును సంయమిస్తే ఛాయ సంయమితమవుతుందా? రాత్రి బాగా నిద్రపోతే చిత్తం ప్రసన్నమవుతున్నది. సత్వగుణం ప్రకటితమవుతున్నది. కొంతసేపైన తరువాత ఆకలివేస్తే రజోగుణం కలుగుతున్నది. భోజనం చేసిన తరువాత తమోగుణం వృద్ధి పొందుతున్నది. మీరు ఈ గుణాలను గురించి గొప్పగా చెప్పుతారా? సౌభాగ్యమైన పరిస్థితిని నిర్మిస్తే సౌభాగ్యమైన గుణోదయం కలుగుతుంది, కనుక పరిస్థితులను మార్చాలి. [illegible] తొందరగా మార్చాలి. మనః ప్రవృత్తులు అనేవి అల్లుకుంటూ పోతాయి. మనుష్యుని లోపల అనేది ఉన్నదేదో ఉన్నది. అది పశువులన్నిటి మాత్రం కాదు, కాబోదు. కాల్పనిక దేవతా స్వరూపం కూడా దానికి కాదు. అది

తన హద్దులోనే ఉంటుంది. పరిస్థితులు బాగుపడితే అదిగూడా బాగు పడుతుంది. చెడిపోతే చెడిపోతుంది. అది మీరు ఆలోచించకండి, సమాజ పునర్నిర్మాణంకొరకు ఒకవేళ హింసను ఆశ్రయించ వలసివచ్చినా సద్గుణాలు చచ్చిపోతున్నవని మీరు అనవద్దు. చెడుసృష్టి నశించి పోయిందని సంతోషించండి. అందుకు ఉపయోగింపబడిన హింసగూడా సామాన్యమైన హింస కాదు. ఉత్తమకోటికిచెందిన హింస అవుతుంది. అదిగూడా ఒక సద్గుణమే. ఈ విషయాన్ని మీరు గుర్తిస్తే గుణవికాసం సరిగా ఏర్పడుతుంది" అని కమ్యూనిష్టులు అంటున్నారు.

ఇవి రెండు కొనలు. ఈ రెండు కొనలకూ మధ్య అందరూ చేరిపోవాలి. ప్రతివాడూ తనకు వసతిగా ఉన్న చోటు చూచుకొని చేరిపోతాడు. కొంతమంది "సమాజాన్ని మార్చవలసిందే, అందులో ఎవ్వరికీ భేదాభిప్రాయం లేదు, కాని కొన్ని విశిష్టగుణాల వికాస సహాయంతో ఆ మార్పు జరగాలి. సమాజంలో కొన్ని స్థిరమైన విలువలున్నవి. వాటిని పోగొట్టుకొని ఏదో ఒక రకమైన సమాజనిర్మాణానికి పూనుకుంటే అసలు మూలసూత్రాన్నే మనం పోగొట్టుకొంటాము. సమాజ నిర్మాణం ఒక శాశ్వతమైన వస్తువుకాదు. దేశకాలాల ననుసరించి అది మారుతుంది. అలా మారాలి గూడాను. సర్వకాలసర్వావస్థలకూ సరిపోయే టట్లుగా సమాజాన్ని నిర్మించి నిద్రపోదామంటే అది జరిగేపని కాదు. సమాజనిర్మాణాన్నే ఒక దేవతనుగా చేసి కూర్చోబెట్టడానికి వీలులేదు. అయినా చివరకు సమాజాన్ని నిర్మించేదెవరు? మనుష్యుడేగదా? మనుష్యుడెలా ఉంటే ఆ నిర్మాణంగూడా అలాగే ఉంటుంది, కనుక సౌజన్యపు హద్దులను గుర్తించి, ఉత్తమమైన సౌజన్యభావంతో, సౌజన్యబలంతో సమాజ నిర్మాణంలో పరివర్తనం తీసుకొని రావాలి. ఇలాంటి పరివర్తనం నెమ్మదిని నెమ్మదిగా జరిగినా బాధ లేదు. నెమ్మది నెమ్మదిగా

నమలి మ్రింగితే జీర్ణం బాగా అవుతుంది. ఈ మందగతియే చివర-చివరకు శీఘ్రగతిగా మారి ఉత్తమమైన కార్యసాధకపద్ధతి అవుతుంది. సౌజన్యాన్ని పెంపొందించుకోమంటే దేవతలు కావలసిందని అర్థంకాదు. అటువంటి అహంకారం మాకు లేదు. మేము మనుష్యులమే, గనుక మాలో ఎంతగా సౌజన్యం పెంపొందినా మేము దేవతలం మాత్రం కాలేము. అటువంటి ప్రమాదమేమీ లేదు. కనుక సద్గుణాలను మనం ఎంతగా అభివృద్ధి పరచుకొన గలిగితే అంతగా అభివృద్ధి పరచుకుందాము. సమాజనిర్మాణం ఉత్తమంగా ఉంటే సద్గుణవృద్ధికి దోహదం కలుగుతుందిఅనేది అసత్యంకాదు. చాలా ముఖ్యమైన విషయం. సద్గుణనిష్ఠ పునాదిలాంటిది. సమాజనిర్మాణం పైనున్న కట్టడం. పునాదులనే పెకలిస్తే కట్టడం బలంగా ఉండేదెట్లు ? " అని అంటున్నారు.

ఇంకా కొంతమంది ఏమంటున్నారు ? "సమాజనిర్మాణాన్ని మార్చే టప్పుడు జీవితపుశాశ్వతమూల్యాలను పోగొట్టుకోగూడదు. సద్గుణనిష్ఠను చలించనీయగూడదు. ఇది మాకుగూడా ఇష్టమే. కాని నైమిత్తిక కర్మ కొరకు నిత్యకర్మను వదలవలసి వస్తుంది అనే విషయాన్ని మరచిపోగూడదు. ప్రార్థన నిత్యకర్మ. ప్రార్థన సమయంలోనే ఇంటికి నిప్పు అంటుకుంటే ప్రార్థనను వదలి నిప్పును ఆర్పడానికి పోతామా పోమా ? నిప్పు ఆర్ప బడిన తరువాత హాయిగా ప్రార్థన చేసుకుంటాము. దీనినే నిత్య నైమిత్తిక కర్మవివేక మంటారు. ఈ వివేకాన్ని అన్నిచోట్లా ఉపయోగించాలి. విప్లవం కొరకు హింసాపూరితాలైన సాధనాలను ఉపయోగించవలసిందే. హింసలేనిది అసలు విప్లవమే రాదు అని కమ్యూనిష్టులు అభిప్రాయ పడుతున్నారు. మేము అలా అనుకోడం లేదు. భారతదేశంలాంటిదానిలో ప్రజాసత్తాక రాజ్యంలో హింసను అవలంబించకుండానే వోట్ల పెట్టెల బలంమీద విప్లవాన్ని సాధించవచ్చును. అందుకుగాను ప్రజాభిప్రాయాన్ని తగిన స్థితిలోనికి తీసికొని రావడానికి పాతికసంవత్సరాలు పట్టవచ్చును.

అయినా బాధలేదు. ధైర్యంగా మేము ప్రజాభిప్రాయాన్ని మారుస్తాం. అధికారంలో ఉన్న పక్షంవారు ఎన్నికల పవిత్రతను సంరక్షించకుండా తమ అధికారాన్ని దుర్వినియోగం చేస్తే సాధనశుద్ధికొరకై ప్రయత్నించడం తెలివి తక్కువతనమవుతుంది. దానివలన దెబ్బ తినవలసి వస్తుంది. అలాంటి స్థితిలో విధిలేక ప్రత్యేకపరిస్థితిలో ఇతర సాధనాలను అవలంబించడం అనుచితంకాదు. దానిని మేము నైమిత్తికధర్మమంటాము. దానిని మీరు ఆపద్ధర్మమంటే అనండి, కాని అధర్మమని అనవద్దు. అంతే మా ప్రార్థన. ఇంతమాత్రంచేతనే జీవితపు శాశ్వతవిలువలు పడిపోవు. అధికారం మారగానే ఆ విలువలను ఎంతో ఉత్తమస్థాయిలోనికి తీసుకొని రావచ్చును. కదిలించగా కదిలించగా మేకు బాగా పాతుకుంటుంది. ఇది కూడా అంతే. అహింసను స్థాపించడానికే కొద్దికాలం హింసను ఆశ్రయిస్తాము, లేకపోతే అహింస స్థాపించడమే అసంభవమవుతుంది. చెట్టు తొందరగా పెరగడానికి దానిని కత్తిరిస్తున్నాముగదా? చెట్టు మొదలు నరకడం వేరువిషయం, కొమ్మలను కత్తిరించడం వేరు విషయం గదా? ధనికవాదము, సామ్రాజ్యవాదము, జాతివంశవాదము అనేటి చెట్టును నరకడానికే ప్రయత్నిస్తున్నవి. అహింసను కూకటివ్రేళ్లతో పెరకడానికి ప్రయత్నిస్తున్నవి. కమ్యూనిస్టులు అవలంబిస్తున్న హింసకూడా అహింస మీద దెబ్బకొడుతున్నది. వారికి అలాంటి ఉద్దేశ్యం లేకపోయినా ఫలితం అదే అవుతున్నది, కనుక మేము దానికి సమ్మతించము, కాని విశిష్టగుణనిష్ఠ అనే పేరుతో సమాజాభివృద్ధిని ఆపి ఉంచడంలోనూ, పేదలను చిరకాలం వరకు పీడించనీయడంలోనూ, ఆ గుణనిష్ఠను భగ్నంచేయడమే మాకు కనబడుతున్నది. అదిగాక ఇతర రాజ్యాలవారు చేసే దండయాత్రను అడ్డగించడానికి, ఆతతాయిద్ధాలను ఆపుచేయడానికి శస్త్రాస్త్రాలను వినియోగించవలసి వస్తే అది హింసలోనికి రాదు. ఇలాంటి స్థితులలో తప్ప మిగతా వాటిలో

అహింసను అవలంబించడం, తత్సాధనాలను అమలుపరచడానికి గట్టి ప్రయత్నం చేయడం అవసరమని మా అభిప్రాయం.

సత్పురుషులూ, కమ్యూనిస్టులూ ఈ ఇద్దరూ చెప్పేదానికి నైష్ఠిక భూమికలున్నవి. మొదటిదానిని ఈ దేశంలో గౌతమబుద్ధుడు, గాంధీ మహాత్ముడు అమలు పరచినారు. కొంతమంది ధర్మసంస్థాపకులుగూడా ఈ మార్గాన్ని అనుసరించినారు. స్మృతులు దానిని అంగీకరించినవి. ప్రస్తుతం భారతదేశంలో కాంగ్రెసువారూ, కాంగ్రెసుఉపపక్షాలవారూ, జాతీయతాభిమానులూ అందరూ మొదటిభూమికమీద ఆధార పడుతున్నారు. గాంధీవాదులని అనిపించుకోనే వారుగూడా చాలామంది అటుతిరిగి ఇటు తిరిగి ఈ భూమికమీదికే చేరుకుంటున్నారు.

ఈ విశ్లేషణాన్ని అనుసరించి కిశోరీలాల్ భాయి వ్రాసిన ఈ పుస్తకంలో ఈ రెండుభూమికలూ పోల్చబడినట్లు అర్థమవుతున్నది.

## మార్క్స్, గాంధీ

మహాత్మగాంధీ, మహాముని మార్క్సు వీరిద్దరి సిద్ధాంతాలనూ పోల్చిచూడడంకంటే ఆకర్షకమైనవిషయం ఇంకొకటి ఉంటుందనుకోను. గడచిన వంద రెండు వందల సంవత్సరాల మనుష్యసమాజజీవితాన్ని అవలోకనంచేసి చూస్తే, ఈ రెండు పేర్లే మనకు చేతికి చిక్కుతున్నవి. లేనిన్ మార్క్సులోనే లీనమైపోతాడు. గాంధీజీ వెనుక టాలుస్టాయి ఛాయ ఉన్నది. ఈ రెండు సిద్ధాంతాలూ ఒకదానిని ఇంకొకటి తనలో కలుపుకోడానికే ఎదురుబొదురుగా నిలబడిఉన్నవి. ఈ నాడు పైకి రష్యానాయకత్వంలో కమ్యూనిస్టులూ ప్రజాతంత్రమనే ముసుగులో ధనికవాదులూ నిలబడినట్లు కనపడుతున్నారు. కాని గంభీరంగా ఆలోచిస్తే ఈ రెండో పక్షంలో బలి

తగ్గిపోయినది. అందువలన సైనికశక్తి మీద అది ఎంతగా ఆధారపడ్డా కమ్యూనిస్టులను వ్యతిరేకంగా అది నిలబడిందని నేను అనుకోటం లేదు. ఈ నాడు సంఘటితరూపంలో ఎక్కడా లేకపోయినా, బలంకలిగినది గనుక కమ్యూనిజానికి ఎదురుగా నిలబడేది గాంధీపక్షమే. ఈ పక్షాన్నే కమ్యూనిజం ఎదుర్కోవలసి వస్తుంది. గాంధీ, కమ్యూనిస్టు సిద్ధాంతాలు రెండూ చాలా బలమైన సిద్ధాంతాలు. ఈ రెండింటినీ పోల్చి చూపించడానికి కిశోరీలాల్ ఈ పుస్తకంలో ప్రయత్నం చేశాడు. కిశోరీలాల్ భాయి అనుసరించిన "నీరస విశద వివేచన" శైలిలో ఉన్నా ఈ పుస్తకం ఎంతో రసవత్తరంగా ఉన్నది. కిశోరీలాల్ "గాంధీ విచార్ దోహన్" అనే పుస్తకాన్ని రచించి ఉండడం వలన గాంధీసిద్ధాంతాల విషయంలో ఈ పుస్తకం ప్రామాణికమైనదే. మార్క్సువాదంవిషయంలో ఈ పుస్తకం ప్రామాణికమైనదని అనుకోకపోయినా ఇందులో ఎంతో జాగ్రత్తగా మార్క్సువాదం వివరింపబడినది. మార్క్సుసిద్ధాంత చిత్రీణంలో ఏవిధమైన అన్యాయమూ జరుగలేదు.

ప్రపంచ విషయం వదలివేసినా, మన దేశంలో ఈ నాడు గాంధీవాద, సామ్యవాదాలను పోల్చి చూడడం ఒక నిత్యకృత్యంగా ఏర్పడిన చర్చా విషయం అయిపోయింది. ప్రతి వ్యక్తీ తన తన దృష్టితో ఈ రెండింటినీ సరిపోల్చడానికి ప్రయత్నిస్తున్నాడు. గాంధీవాదానికి నలువైపులా ఆధ్యాత్మిక తేజోవలయం కనిపిస్తున్నది. సామ్యవాదానికి వెనుక బలవత్తరమైన శాస్త్రీయ వైజ్ఞానిక బలం దృష్టిగోచర మవుతున్నది. భారతదేశానికి స్వరాజ్యాన్ని సంపాదించడం వలన గాంధీవాదం వ్యావహారికంగా పనికిరానిది అనడానికి అవకాశం లేకుండా పోయింది. చీనాదేశపు పురాణ పురుషునికి తారుణ్యాన్ని ప్రసాదించి సామ్యవాదం తాత్కాలికశక్తిని చూపించి ఉన్నది. అందువలన ఈ రెండు వాదాలనూ సమన్వయించేస్తే బాగా ఉండునని కొంత మందికి కోరిక కలుగుతున్నది. గాంధీవాదమంటే హింసలేని సామ్యవాదమని కొన్ని

సూత్రాలు గూడా బయలు వెడలినవి. నిజానికి ఈ రెండు వాదాలకూ పోలికగానీ, సమన్వయంగానీ లేదు. ఈ రెండింటికీ పునాదులలోనే ఎంతో విభేదం ఉన్నది. ఈ వాదాలు రెండూ ఒక దాని కొకటి ప్రాణ శత్రువులు. ఈ పుస్తకంలో అదే విషయం స్పష్టంగా వివరించబడినది.

ఒకసారి ఒకచోట గాంధీవాదానికీ, సామ్యవాదానికీ అహింస విషయంలోనే అభిప్రాయభేధం అని చర్చ జరుగుతున్నది. "ఇద్దరు మనుష్యులు ఉన్నారు, వారిద్దరూ కన్ను, ముకుగు, చెవుల పోలికలలో ఒకటిగానే ఉన్నారు. వారిద్దరూ ఎంతగా ఒకటిగా ఉన్నారంటే రాజకీయంగా ఒకరికి బదలు ఇంకొకరిని చూపించిగూడా పనిని నిర్వహించుకోవచ్చును, కాని వారిద్దరికి ఒకటే భేదం ఉన్నది. ఒకరికి శ్వాస ఆడుతున్నది, ఇంకొకరికి లేదు. దానికి పరిణామంగా ఒకరికొరకు భోజనం తయారవుతుంటే ఇంకొకరి కోసం శవయాత్రాప్రక్రియత్నాలు చేయుబడుతున్నవి. అహింస ఉండడం, ఉండకపోవడం అనేది ఇలాంటి భేదమే" నని అప్పుడు నేనన్నాను. కిశోరీలాల్ భాయి, కన్ను ముకుగులలో గూడా పోలికలేదని అంటున్నాడు. శ్వాస ఆడేవానికీ, ఆడనివానికీ పైకి ఒకటిగానే కనపడ్డా ముకుగు, కన్నుపోలికలలో గూడా విభేదం ఉండక తప్పుతుందా ?

సామ్యవాదం అసక్తికి సంబంధించిన (రాగద్వేష భరితమైన) సిద్ధాంతం కావడం వలన దానిని గురించిన తత్వవిచారణ చేయవలసిన ఆవసరమే నాకు కనపడడం లేదు. సామ్యవాదులు ఆవాదం చుట్టూ కావలసినంత వేదాంతాన్ని సృష్టించి పెట్టినా ఆవేదాంతంలో నిజమైన తాత్వికసారమేమీ కనపడడం లేదు. ఎందువల్లనంటే అది శిల్పానికి చెందినది కాదు, ఇంద్రజాలానికి సంబంధించినది. దానిది కామెర్ల రోగపుదృష్టి. ఉదాహరణకు సంఘర్షణ అనే విషయాన్ని తీసికోండి. అది వారికి ఒక పరమ తత్వం. సంఘర్షణ తప్ప ప్రపంచంలో ఇంకా ఏమీ లేదంటారు వారు.

సంఘర్షణ తప్ప నాన్యదస్తి, ఇది వారి మంత్రం. వెనుక పరమాణువాదియైన
**కణాదుడు** పీలవః పీలవః (పరమాణువులు, పరమాణువులు) అంటూ మరి
ణించాడట, వీరుగూడా అంతే. సంఘర్షణ ఇది వారి ఆరాధ్య దైవతం.
తల్లి స్తనంలో నుండి చిన్న పిల్లవానికి పాలు లభిస్తున్నవి. ఈ
చమత్కారం ఎలా జరుగుతున్నది? ఇదిగూడా సామ్యవాదుల దృష్టిలో
ఒక సంఘర్షణే. ఇక్కడ సంఘర్షణ ఎవరెవరికి? పిల్లవాడినోటికీ తల్లి స్తనా
నికీని. వినోదానికి నేను ఇలాంటి ఉదాహరణను ఇస్తున్నాను. కాని వారు
దీనిని గూడా గంభీరంగానే గ్రహిస్తున్నారు. దేనిని మనం సహకార మంటా
మో అదీ, దేనిని సంఘర్షణ అంటామో అదీ అంతా వారికి సంఘర్షణే. దీనినే
డాక్టరు రఘువీర్ భాషలో "ప్రసంఘర్షణ" అన వచ్చును. అంత మంత్ర
ముగ్ధులై ఉన్న వారితో చర్చించేది మాత్రం ఎలా? వారి మాటలను
తమాషాగా వినవలసిందే. అంతే. సామ్యవాద వేదాంతంలో తత్వజ్ఞానాన్ని
అనుసరించి ఆచరణ ఏర్పడదు. ఆచరణ ననుసరించియే తత్వజ్ఞానం
ఏర్పడుతుంది.

సృష్టి వలన మనస్సు ఏర్పడినదా. లేక మనస్సు నుండి సృష్టి ఏర్ప
డినదా అని గూడా వారు వాదం చేస్తారు. సృష్టివలన మనస్సు ఏర్పడినదని
అందరూ అంగీకరిస్తారు. తెలివి తక్కువవానికి ఈ విషయంలో సందేహం
కలుగవలసిందే. మనస్సువల్లనే సృష్టి ఏర్పడితే సృష్టి కర్త అయిన
ఈశ్వరుని అవసరమేమున్నది? అయినా, సృష్టి వల్లనే మనస్సు ఏర్పడినా,
సృష్టి. మనస్సుల కంటే భిన్నమైన ఆత్మ వేరుగా నున్నది. ఆత్మను వారు
అంగీకరించరు. ఎవ్వరైనా గుర్తు చెప్పుతామంటే వినరు. శంకరాచార్యులు
ఇలాంటి వారి విషయంలో "సోదరుడా! నీతో నాకు వాదమే లేదు.
ఆత్మను అంగీకరించని నీవు స్వయంగా ఆత్మవే. దానిని నీవు అంగీకరిస్తే
అంగీకరించావు గనుక అది ఉంటుంది. అంగీకరించక పోతే అంగీకరించలేదు

గనుక ఉంటుంది" అన్నారు. నేను మేలుకొని ఉన్నాననే వాడు మేలుకొని ఉండడం ఎంత సత్యమో, నేను నిద్రపోతున్నానని చెప్పే వాడు మేలుకొనివుండడం గూడా అంత సత్యమే. సృష్టి. మనస్సు ఈ రెండింటికీ ఆకారాన్నిచ్చే ఆ మూడో వస్తువు ఆత్మనుగురించి ఆలోచించ కుండానే సమాజనిర్మాణపు గందరగోళంలో పడిపోవడం వలన సద్గుణాలకు ప్రాముఖ్యత లేకుండా పోతున్నది. వేనిని మనం ఆధ్యాత్మిక సద్గుణాలని అంటున్నామో, అవన్నీ వీరి దృష్టిలో ఆర్థిక సూత్రోత్పన్నాలు మాత్రమే

ఆత్మకే స్థానం లేని వాదంలో వ్యక్తిస్వాతంత్ర్యమనే ప్రశ్నకు ఆస్కారమే వుండదు. క్షవరం చేయించుకొన్నప్పుడు ఎన్ని వెంట్రుకలు తెగిపోతున్నవో ఎవడు లెక్క పెడతాడు. వ్యక్తులు వస్తుంటారు. పోతుంటారు. సమాజం తన్యంగా నడుస్తూనే ఉంటుంది. కనుక సమాజానికే అస్తిత్వం గాని వ్యక్తిత్వానికి అస్తిత్వం శూన్యమే నని తెలుసుకోవాలి.

సగరపుత్రుడు గంగానది మూలస్థానాన్ని వెదికి పట్టుకొన్నట్లు సామ్యవాద తత్వవేత్తలు యావత్తు మానవచరిత్ర మూలస్థానాన్నీ వెదికిపట్టుకొన్నారు. ధనస్సును వదలిన బాణం ఎలా నిశ్చిత దిశవైపునకే పోతుందో, ఆ దిశను మార్చడానికి వీలులేదో, అదే విధంగా మన స్థితిగూడా ఉన్నదని సామ్యవాదులు నిర్ణయంచేశారు. పూర్వపు చరిత్ర ఈ నాటి మన కార్యపద్ధతినీ, జీవితప్రవాహాన్నీ నిర్ణయించివేసింది. మనకు క్రియాస్వాతంత్ర్యం గూడా లేదు, ముందు రక్తపు నదులు ప్రవహిస్తవి. తరువాత పాల నదులూ తేనె నదులూ ప్రవహించి ఆతరువాత అందరి ఇండ్ల ముందరగా శీతలజలప్రవాహాలు ప్రవహిస్తవి, దానితో అందరి దాహాలూ తీరుతవి. ఇదంతా ఇదివరకే నిర్ణయమై ఉన్నది అనివారంటారు. యూక్లిడ్‌కు భూమితి శాస్త్రంలాగా, సామ్యవాదులకు చరిత్ర నుసరీక్షించడం వల్లా, తరచడంవల్లా వ్యవస్థితమైన విప్లవశాస్త్రం ఒకటి చేతికిచిక్కింది. అసలు

విప్లవాలు ఎక్కడెక్కడ వస్తాయో గూడా మార్క్సు భవిష్యవాణి రూపం లో నిర్ధారణ చేసివేశాడు. కాని, అది నిజం కాలేదనుకోండి, దానికి కారణం జ్యోతిషంలో జరిగిన లెఖ పొరపాటే. అంతమాత్రంచేత జ్యోతిష శాస్త్రాన్ని ఫలరహితమనడానికి వీలు లేదు. యమునిపిలుపును ఎలా అతి క్రమించడానికి వీలులేదో, విప్లవాన్ని గూడా ఆపడానికి అలా వీలు లేదు, కనుక ఆ విప్లవానికి ద్రోహం చేయడమే మన పని, అని వారి ఉద్దేశ్యం ఇలాంటి సామ్యవాద సిద్ధాంతానికీ గాంధీజానికీ పోలికేలేదు అని చూపించ డానికే కిశోరీలాల్ ఈ పుస్తకాన్ని వ్రాశాడు.

## నిశ్చిత శాస్త్రము, ఉన్మత్త భావాలు

వాల్మీకి మొదటనే రామాయణం వ్రాశాడనిన్నీ, రాముడు ఆ రామాయణంలో వ్రాసినట్లుగా తుచ తప్పకుండా నడిచాడనిన్నీ కొంత మంది అంటుంటారు, పాపం, రామునికి ఆలోచించవలసిన అవసరం గూడా లేకపోయింది. పుస్తకందగ్గర పెట్టుకొన్నాడు. దాని ప్రకారం నడిచాడు. పరిణామంగూడా ఏమి కానున్నదో ఆ పుస్తకం లోనే ఉన్నదాయె. అందువలన పరిణామాన్ని గురించి ఆలోచించవలసిన అవసరం గూడా రాముడికి లేకపోయింది సామ్యవాదుల స్థితి గూడా ఇలాగే ఉన్నది. మార్క్సు వ్రాసిన దానిని లెనిన్ అమలుచేసి చూపించాడు. మనం గూడా లెనిన్ వెంట బయలుదేరి మకాముకు చేరుకోవాలి. మార్క్సు వ్రాసిన దానికీ, లెనిన్ చేసిన దానికీ రెండింటికీ అక్కడక్కడా భేదాభాస లేకపోలేదు. అయితే మాత్రం ఏమి? ఆ రెండింటిలో ఏకవాక్యత తీసు కొని రావడానికి కొంత ప్రయాసపడవలసిందే. అది గూడా అంత కష్టం కాదు. ఎందువల్లనంటే శృతి చెప్పినట్లే, స్మృతి గూడా చెప్పాలిగదా! ఒకవేళ స్మృతి వచనమే స్పష్టంగా ఉంటే శృతికి గూడా అల్లాంటి

అర్థమే చెప్పుకోవచ్చును. ఈమాత్రం పని చేస్తే ఇక లైన్ క్లియరే. మార్గం సరిగా ఉన్నట్లే.

గాంధీ సిద్ధాంతాల పద్ధతి సరిగ్గా ఇందుకు విరుద్ధంగా ఉన్నది. సామ్యవాదం పక్కా భవనంగా ఉంటే, గాంధీవాదమంతా మారుతూ ఉండే కుటీరంవలె ఉన్నది. గాంధీజీ చెప్పిన మాటలు రాను రాను వికాసాన్ని పొందుతూ మారుతూ వచ్చినవి. ఆయన చెప్పిన మొదటి వాక్యాలకూ తరువాతి వాక్యాలకూ సమన్వయంచేసే ప్రయత్నంగూడా వ్యర్థ ప్రయత్నమే. తరువాతి మాటను స్వీకరించు, మొదటి మాటను వదలివెయ్యి. సరిపోతుంది. ఆయన చేసిన పెద్ద పెద్ద యుద్ధాలన్నింటిలో పర్వాలుగానీ, తంత్రాలుగానీ, నిర్మాణంగానీ ఉండే వేగావు. "ఒకటే అడుగు చాలు" అనే వాడికి భగవంతుడు రెండు అడుగులు ఎందుకు చూపించాలి ? నీ చివరి వాక్యాలమీద మాత్రం విశ్వాసం ఎలా ఉంచాలి? అని అడిగితే గాంధీజీ ఏమని జవాబు చెప్పారు! అసలు నా మాటలమీద మీకు విశ్వాసమే వద్దు. మీ బుద్ధికి మీరు ఆలోచించుకోండి, నేనున్నంత కాలం నన్ను సలహా అడుగుతున్నారు. నా అనంతరం మీరందరూ సర్వతంత్ర స్వతంత్రులే. ఇది వారిచ్చిన జవాబు. అందువలన గాంధీజీ అనుయాయులలో గూడా ఒకరికీ ఇంకొకరికీ సామ్యం లేకుండాపోయింది. "గాంధీజీ గీతాభక్తులు కనుక ఆయన శిష్యులందరూ గీతాభక్తులైనారు. గాంధీజీ గీతమీద భాష్యం వ్రాస్తే ఆయన శిష్యులందరూ తలావొక భాష్యం వ్రాసి పారేశారు, కాని విశేషమేమంటే ఏ ఇద్దరి భాష్యాలూ ఒకటిగా కలవడం లేదు" అని ఒక మిత్రుడు ఆ మధ్య తమాషాగా అన్నాడు. గీత గొప్ప గ్రంథం గనుక గీత విషయంలో వేరు వేరు అర్థాలు స్ఫురించడానికి అవకాశం ఉన్నదనుకోండి. గీత విషయం వదలినా, జీవితసారభూతాలైన ఇతర విషయాలలో గూడా, సర్వోదయ సిద్ధాంతానికి ప్రధానభూతమైన ఖద్దరు

విషయంలోగూడా గాంధీవాదులందరూ ఒకే రకమైన భావం కలిగి ఉంటారని అనడానికి గూడా అవకాశం లేదు. గాంధీసిద్ధాంతాలను శాస్త్రీయ పరిభాషలోనికి చేర్చి సూత్ర గ్రంథాలను నిర్మించవలె నని అభిప్రాయపడ్డ మిత్రులతో గాంధీజీ ఏమన్నారో తెలుసునా? "నా భావాలు ఇంకా పరిపక్వం కాలేదు, నేనింకా వాటిని అమలులో పెట్టి చూస్తున్నాను, అదిగాక శాస్త్రీయ పరిభాషలో నా భావాలను వ్యక్తం చేయడానికి తగినంత అవకాశం గూడా నాకు లేదు, శాస్త్రం అవసరమైనప్పుడేర్పడుతుంది" అన్నారు. వారన్న మాట అక్షరాలా నిజం. అంతేగాక వారన్నమాట సత్యమని అనడానికి నాకు ఇంకొక కారణంగూడా స్ఫురిస్తున్నది. శాస్త్రీయ పరిభాషను ఏర్పాటు చేసినందువల్ల జరిగేదేమిటి? తద్విరుద్ధమైన శాస్త్రీయపరిభాషకు జవాబు లభించడమేగదా! కాని, అందువల్ల జరిగేదేమిటి? శస్త్రబలంవల్ల ఏవిధంగా శస్త్రబలం క్షీణంకాదో, పైపెచ్చు వృద్ధి పొందుతుందో, అనేక రకాలైన కొత్త సమస్యలు సృష్టించబడతవో, అదే విధంగా ఒక పరిభాషతో ఇంకొక పరిభాషకు సంఘర్షణ తెచ్చిపెడితే, లేనిపోని చిక్కులు ఎక్కువై స్పష్టీకరణానికి బదులు అస్పష్టతే ఎక్కువవుతుంది. కనుక ఇలాంటి భావాలను ఉన్ముక్తంగా వదలి పెట్టడమే మంచిది. పరిభాషల అధిక్యతవలన వేరువేరు రూపాలు ఎక్కువై బుద్ధుని అనుయాయులకు సంప్రాప్తించిన స్థితి ఏర్పడుతుంది నలుగురు శిష్యులూ నాలుగు మార్గాలు అవలంబించారు. అదే విధంగా ఇక్కడ పదిమంది శిష్యులూ పది మార్గాలను అనుసరిస్తున్నారు. అందువలన గాంధీగారన్నట్లు వారిని తమ తమ బుద్ధి బలంమీద నడవనివ్వడమే మంచి ఉపాయము.

## గాంధీ సిద్ధాంత త్రయము.

గాంధీ సిద్ధాంతాలలో ఉన్న ముఖ్య గుణాలను సంరక్షిస్తూనే దానికి ఒక కట్టుబట్టమైన స్వరూపాన్నివ్వడానికి మష్రువాలా ప్రయత్నం చేశాడు. వర్ణ

వ్యవస్థ, ధర్మకర్తృత్వ సిద్ధాంతము. వికేంద్రీకరణము ఈ మూడింటినీ కలిపి ఒక రూపాన్ని నిర్మించాడు. ఆ విషయం కొద్దిగా తెలుసుకొందాము.

వర్ణవ్యవస్థకు కొత్త అర్థాన్ని కల్పించి, లేక అసలు ఆ శబ్దానికి మూలంలో ఏర్పడిఉన్న అర్థాన్ని గ్రహించి గాంధీజీ ఆశబ్దాన్ని స్వీకరించారు ఇది వారు చేసిన ఒక అహింసా ప్రయోగమని నా అభిప్రాయం. ఒక సంఘంలో శతాబ్దాలుగా ఒక అర్థంలో ఎంతో ఆదరంతో వాడబడే శబ్దాలను వ్యర్థపరచకుండా ఆ శబ్దాలకు గల అర్థాలను వికసింపజేసి, ఆ శబ్దార్థాలలో ఒక నవజీవితాన్ని నింపడం ఒక రకపు అహింసాత్మక ప్రక్రియ. పురాతన శబ్దాల అర్థాన్ని పూర్తిగా మార్చివేయడం ఈ ప్రక్రియ లక్షణంకాదు. కొత్త అర్థాలను చెప్పడంవలన పాతఅర్థాలకు నూతన తేజస్సు వస్తుంది. అంతే, భారతీయసంప్రదాయంలో నిండి ఉన్న సమన్వయభావాన్ని ఈ ప్రక్రియ అమలులోనికి తెస్తున్నది. గీత యజ్ఞాది శబ్దాలకు విస్తృతార్థాలను కల్పించి ఈ పేధానాన్ని మనముందు పెట్టినది. అయితే ఈ ప్రక్రియలో శబ్దార్థాలను చెప్పుకోడంలో "డొంకతిరుగుడు" పద్ధతి ఏర్పడడానికి అవకాశం ఎక్కువగా ఉంటున్నది. డొంక తిరుగుడు అర్థాలు ఏర్పడితే అహింసాప్రయోగం అసత్య ప్రయోగంగా మారి కూర్చుంటుంది. డొంక తిరుగుడు అర్థాలజోలికి పోకుండా ఉన్న అర్థాన్ని కొద్దిగా వికసింపజేయడాన్ని అహింసాప్రయోగమని అనవలసి ఉంటుంది. గాంధీజీ భారతీయ సంస్కృతిలోనే జన్మించి, పెరిగి, పెద్దవారైనారు. ఆ సంస్కృతిలోనే రమించిన జనసామాన్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఆయన ఎక్కువగా మాట్లాడినారు. అందువల్లనే ఆయన వర్ణవ్యవస్థ అనే శబ్దాన్ని స్వీకరించారని నా అభిప్రాయం. ఇంకొక రకంగా మాట్లాడదలచుకొంటే— ఆయన ఇంకొక సమాజంలో జన్మించి, ఆ సమాజం కొరకే మాట్లాడి ఉన్నట్లయితే అహింసాత్మక సమాజనిర్మాణానికి ముఖ్యాంగరూపంలో వర్ణ వ్యవస్థ శబ్దం తప్పక ఆయనకు తోచి ఉండేదే అని అనడానికి అవకాశం లేదు. అయినా

ఆశబ్దంద్వారా ఆయన ఏ అర్థాన్ని — ఏ సారాంశాన్ని — గ్రహిస్తున్నారో, ఆ అర్థాన్నీ — ఆ సారాంశాన్నీ — బోధించే ఏదో ఇంకొక శబ్దాన్ని ఆయన తప్పక స్వీకరించి ఉండేవారే. అని దృఢంగా చెప్పవచ్చును. నేను చెప్ప దలచుకొన్న దేమిటంటే — వర్ణాలన్నా — వర్ణవ్యవస్థలన్నా — ఏ మాత్రం ఇష్టం లేని వారు గూడా ఈ శబ్దప్రయోగం వలన గాభరాపడవలసిన అవసరం లేదు. ఇక్కడ శబ్దాలుగాదు ప్రధానం, వాటి అర్థం. వాటి సారం ప్రధానం. (1) అన్ని పనులకూ సమానమైన కూలి (2) పోటీ లేక పోవడం (3) వంశపారంపర్యంగా ఏర్పడిన సంస్కారాలవలన ప్రయోజనం పొందే విద్యావిధానము, ఇవే వర్ణవ్యవస్థకు ముఖ్యమైన విషయాలు. నా ఉద్దేశ్యంలో అహింసాత్మక సమాజనిర్మాణానికి కావలసినవి ఇవిమాత్రమే.

ధర్మకర్తృత్వ సిద్ధాంతంగూడా వర్ణవ్యవస్థలాంటి శబ్దమే. చాలా మందికి ఈమాటఅంటేనే తలనొప్పి. "వర్ణ ధర్మము" అనే శబ్దం నిజంగా మూలంలో ఒకానొక సదభిప్రాయాన్నీ, సద్విధానాన్నీ స్ఫురింప జేసే శబ్దం. ధర్మకర్తృత్వము అనే దానిని గురించి అంత నిశ్చయపూర్వకంగా ఆలోచించడానికి అవకాశం లేదనుకొంటాను. ఈ శబ్దం పుట్టిననాటినుండీ దానిదురుపయోగం గూడా ప్రారంభమయింది. కాని చట్టసమ్మతమైన భాషలో ఆ శబ్దానికి మంచి అర్థం ఉన్నది. గాంధీజీ చట్టాన్ని బాగా అధ్యయనంచేసిన వ్యక్తిగావడం వలన ఆయనకు ఆ శబ్దం బాగా నచ్చింది. ఆయన సత్యోపాసకుడు అందువలన ఆ శబ్దానికి గల మూలార్థాన్ని హృదయంలో పెట్టుకొన్నాడు. నాకు చట్టభాషతో పరిచయంలేదు. అందు వలన నాకు ఆ శబ్దం అంతగా నచ్చలేదు. నన్ను ఆశబ్దం అంతగా ఆకర్షించలేదు. అయినా ఏ అర్థాన్ని దృష్టిలో పెట్టుకొని గాంధీజీ ఆ శబ్దాన్ని ప్రయోగించారో, ఆ అర్థాన్ని నేను మరచిపోలేదు. ఆ అర్థాన్ని తెలుసుకొనడంలో నేను పొరపాటు పడలేదు. గీతలోని అపరిగ్రహము, సమభావము ఇలాంటి చాలా

శబ్దాలు గాంధీజీని ఆకర్షించినవి. ఈఅపరిగ్రహాదులను వ్యావహారికజీవితంలోనికి ఎలా తీసుకొని రావలెననే విషయాన్ని గురించి ఆలోచించినప్పుడు ఆయనకు ఈ ధర్మకర్తృత్వమనే శబ్దం చేతికి చిక్కింది. "గీతాధ్యయనం వలన ట్రస్టీ శబ్దార్థం నాకు బాగా బోధపడింది. ఈ శబ్దంవలన అపరిగ్రహ సమస్య తీరిపోయిందని తన ఆత్మకథలో గాంధీజీ వ్రాసుకొన్నారు. గాంధీజీ దృష్టిలో ఈనాడే గాక, ఎల్లప్పుడూ అపరిగ్రహతత్వాన్ని సిద్ధింపజేసుకొనడానికి మనుష్యునికి తన శక్తులను ట్రస్టీగా ఉపయోగించుకోడంతప్ప రెండో ప్రయోజనకరమైన, వ్యావహారికమైన ఉపాయం లేదు. కిశోరీలాల్ ఈ విషయాన్ని బహు సూక్ష్మంగా వ్యక్తపరచినాడు. దానిని ప్రతి పిల్లవాడు గూడా తెలుసుకొనగలడని నా ఉద్దేశ్యం. అందులో భ్రమకు గానీ, గూఢంగా ఉన్నదని అనుకోడానికి గానీ అవకాశం లేకుండా చేశాడు.

కృత్రిమవ్యవస్థవలన ఆర్థికమైన హెచ్చుతగ్గులు ఏర్పడ్డవి. ఆ హెచ్చుతగ్గులను మనం సరిదిద్దగలిగినా, మానవుని బౌద్ధిక, శారీరక శక్తులలో గల అసమానతను పోగొట్టలేము. చదువువలనా, సంయమాదుల వలనా కొంతవరకు ఆ అసమానతను పోగొట్టగలమని అనుకుందాము, కాని అవర్మస్థితిలోగూడా ఈ అసమానతను పూర్తిగా పోగొట్ట గలగడం సంభవంకాదు. కనుక బుద్ధి, శారీరకశక్తి, సంపత్తు ఈ మూడింటిలో ఏది కలిగినవాడైనా అది అందరి ఉపయోగంకొరకు తనకు లభ్యమైనదని భావించాలి. దీనినే ట్రస్టీషిప్ అంటారు. కాని ఈ శబ్దం దర్జనుల పాలబడి తనకున్న గొప్పఅర్థాన్ని పోగొట్టుకొన్నది. అందువలన దానికి నేను 'విశ్వస్త వృత్తి' అని నామకరణం చేశాను. ఇది భావవాచక సంజ్ఞాపదము. ఎవ్వరూ ఎవ్వరిమీదా ఆధారపడి జీవించకూడదు అనే తత్వాన్ని సామాన్యంగా మనం స్వావలంబనతత్వమంటాము. కాని ఎవ్వడూ ఎవ్వరిమీదా ఆధారపడనిస్థితి అసలు సంప్రాప్తమైతే అది మహానరకస్థితి అయి

ఊరుకుంటుంది. తల్లిదండ్రులు తమబిడ్డలమీదా, బిడ్డలు తల్లిదండ్రుల మీదా, ఇరుగు పొరుగువారూ, భిన్న భిన్న దేశాలవారూ పరస్పరం ఒకరు ఇంకొకరిమీదా విశ్వాసంకలిగి ఉండడం అవసరం. అసలు విశ్వాసంకలిగి ఉండడం అనేదానిలోనే మనం సందేహపడుతున్నామంటే, భయపడు తున్నామంటే మనం మానవత్వశూన్యులమై ఎకరూడో క్రింద ఉన్నామన్న మాట. ఇలాంటి విశ్వస్తవృత్తిని విద్యవలన పరిపుష్టం చేయవచ్చును. ఇవన్నీ చేయడం మానివేసి అందుకుబదులు యావత్తు సమాజాన్నీ ఒకే మూసలో పోసి యంత్రంలాగా తయారు చేయవలెనని ప్రయత్నం చేస్తే, అలాంటి విశ్వాసాన్ని కనపరిస్తే— అది బౌద్ధికంగా సోమరితనమవుతుంది.

పరస్పరవిశ్వాసంమీద ఆధారపడిన సమాజాన్ని నిర్మించడమంటే అర్థం అందరి తాలూకు అన్ని శక్తులనూ సమన్వయం చేయడమన్న మాట. లోకసంగ్రహమనే శబ్దానికి ఇదే అర్థం. వ్యక్తిగతమైన అపరిగ్రహము అంటే విశ్వస్తవృత్తితో తనశక్తిని అందరిమేలుకొరకూ ఉపయోగించడమని అర్థం. ఇది లోకసంగ్రహానికి సంబంధించిన మూల తత్వం. ట్రస్టీ-షిప్, అనే శబ్దాన్ని బాగుండకపోతే వదలి వేయండి, కాని ఈ తత్వాన్ని వదలకండి. అంతే నేనుచెప్పేది.

ఇక వికేంద్రీకరణం విషయం ఆలోచిద్దాము. ఆ శబ్దం కొత్తది కావడం వలన మంచి చెడుభావాలూ, సంస్కారాలూ అనేకం దానికి తగులుకొనిఉన్నవి. ఈ శబ్దం ఎలా కొత్తదో, అదే విధంగా దాని అర్థం అనగా దాని వెనుకనున్న కల్పన గూడా అలా కొత్తదే. యంత్రయుగం రాక పూర్వం అంతా వికేంద్రీకరణంగానే ఉండేది, ఇక దీనిలో కొత్తదనమేమున్నదని కొంత మంది ప్రశ్నించవచ్చును. యంత్రయుగానికి పూర్వం వికేంద్రీకరణసిద్ధాంతంలేదు. కాని అంతా వికేంద్రితంగా ఉండేది. గ్రామాలలో పరిశ్రమలన్నీ వికేంద్రీకృతంగా జరిగినంతమాత్రాన,

చేత వికేంద్రీకరణ ఏర్పడిందని అనుకోడానికి వీలులేదు. వికేంద్రీకరణంలో వికేంద్రీకృతమైన పరిశ్రమలతోబాటు సమగ్ర దృష్టితో కూడిన ఒక వ్యాపకమైన ప్రణాళికగూడా ఉంటుంది. అది లేని నాడు వికేంద్రీకృత పరిశ్రమలు అంటే అటుఇటు చెదురుగా పడిఉన్న పరిశ్రమలని అర్థమవుతుంది. స్వాభావికంగానే యంత్రయుగపు మొదటి దెబ్బతగలడంతోనే అపరిశ్రమలన్నీ ఛిన్నాభిన్నంకా నారంభించినవి. వికేంద్రీకరణ వ్యవస్థ అసలు ఛిన్నాభిన్నమయ్యేది కాదు. అది యంత్రయుగాన్నే పనికిరానిదానినిగా చేయగలదు. నేటి యంత్రయుగం పేరుకు యంత్రయుగమేగాని నిజానికి అనియంత్రితంగానే ఉన్నది. ఇందుకు బదులుగా సామ్యవాదులు పూనియంత్రితమైన యంత్రయుగాన్ని కోరుతున్నారు. కాని ఆయుధాలకు వలెనే, యంత్రాలుగూడా నిజానికి మానవ నిర్మితాలే అయినా మానవత్వవిహీనాలే వాటిలో మానవత్వాన్ని తీసుకొని రావడానికి చేసే ప్రయత్నం కొంత వరకే ఫలిస్తుంది. అవి మానవునే ఆటబొమ్మనుగా తయారు చేయగలవు. ఇక్కడ ఆయుధమంటే మానవ సంహారకమైనదని అర్థం. డాక్టర్ల దగ్గర ఉండే ఆయుధాలని అర్థంకాదు. అదే విధంగా యంత్రమంటే మనుష్యుని నిరుద్యోగినిగానూ, సోమరిపోతునుగానూ తయారు చేసే యంత్రమని అర్థం. మనుష్యునికి సహాయంచేసే, ఉపకరణరూపంగా మానవుని చేతిలో ఉండడంవలన శోభించే, మానవత్వస్పర్శ పొందిన యంత్రమని అర్థం కాదు. ఉదాహరణకు "వీల్ బరో" (Whed-barrow) ను తీసుకోండి. మనం త్రవ్వే బావిలో నుండి మట్టినంతా తీసివేయడానికి అది ఎంతగానో ఉపయోగపడుతున్నది! దానిని చూచినప్పుడు నాకు సేనాపతి బాపట్ వ్రాసిన ధన్యధన్య యహీ ఔజార్" అనే గీతం జ్ఞాపకానికి వస్తుంది. అందువలన వికేంద్రీకరణం వల్ల యంత్రయుగాన్ని భగ్నంచేస్తున్నామంటే యంత్రయుగంవలన మనం ఉపయోగాన్ని పొంది దానిని భగ్నం చేస్తామని అర్థమవుతుంది. ఈ విధంగా ఉపయోగాన్ని పొందకుండా యంత్ర

యుగాన్ని భగ్నం చేయడానికి గూడా వీలులేదు. ఇలాంటి శక్తి; యంత్ర యుగాన్ని జీర్ణం చేసికొనగలిగిన సామర్థ్యమూ పురాతనమైన వికేంద్రిత పరిశ్రమలలో ఉండేదికాదు. ఇదే వికేంద్రిత పరిశ్రమలలోనూ, వికేంద్రీకృత పరిశ్రమలలోనూ ఉన్న శక్తి భేదం, కనుక వికేంద్రీకరణ శబ్దమూ, దాని వలన ఏర్పడుతున్న కల్పనా రెండూ క్రొత్తవే. కనుక ఈపైన చెప్పబడిన విషయంమీద దృష్టిని ఉంచితే వికేంద్రీకరణానికి వ్యతిరేకంగా చెప్పే ఆక్షేపణలన్నీ వ్యర్థమైనవే.

ఈ వికేంద్రీకరణ సిద్ధాంతాన్ని కేవలం పరిశ్రమలవరకు మాత్రమే సీమితం చేయగూడదు. రాజ్యాధికారం విషయంలో గూడా ఈ వికేంద్రీకరణ ప్రవృత్తి పనికి వస్తుంది. అహింసాత్మక సమాజనిర్మాణకాముకులు గూడా ఈ విషయంపైన దృష్టిని ఉంచడంలేదు. వారు పరిశ్రమల వికేంద్రీకరణాన్ని మాత్రమే సమర్థించి, తద్రక్షణకై బలమైన కేంద్ర ప్రభుత్వం కావలెనని అప్పుడప్పుడు కోరుతున్నారు. కమ్యూనిస్టులుగూడా రాజ్యసత్తా ఏ నాటికైనా నిప్పుమీది నెయ్యిలాగా కరిగిపోయేదేనని అంటారు. కాని అంతవరకూ ఆ నెయ్యి చలికాలంలో పేరుకొన్న నెయ్యిలాగా కొత్త ట్రాటస్కీ నెత్తిమీదపడిన ఇనుప సమ్మెటలాగా గట్టిగా ఉండవలెనంటారు. మధ్యకాలానికి మాత్రం అది పనికి వస్తుంది, తరువాత రాజ్యశక్తితో అవసరమే ఉండదని వారి అభిప్రాయం. కాని గాంధీజీ భావం అదికాదు. ఆది, మధ్య, అంతిమ కాలాలన్నింటిలోనూ వికేంద్రీకృత రాజ్య శక్తి ఉండవలెను. మధ్యకాలం కొరకు- కొంతకాలంవరకు- గూడా కేంద్రీకృత రాజ్య శక్తిని ఆయన అంగీకరించరు. దానిని మీరు రామరాజ్యమని త్రేతాయుగం లోనికి నెట్టినా, సర్వోదయ ప్రణాళిక అని భవిష్యత్కాలంలోనికి నెట్టినా గాంధీజీ ఆశించినదిదే.

# ( 27 )

## హింసా సిద్ధాంతము

గాంధీ సిద్ధాంతాలకూ, కమ్యూనిష్టు సిద్ధాంతాలకూ అనేక విషయాలలో వ్యత్యాసం ఉన్నా కొన్ని విషయాలలో సమానత్వం గూడా లేకపోలేదు. ఆ సమానత్వం చాలా ముఖ్యమైన సమానత్వమే. రామ రావణులలో కవికి రకారసామ్యం దొరికింది. గాంధీభావాలూ, కమ్యూనిష్టు భావాలూ రెండూ నిజానికి లోక కళ్యాణాన్ని దృష్టిలో పెట్టుకొన్నవే. అయినప్పుడు వానిలో సమానాంశాలు ఎందుకుండవు? ఈ రెండువాదాలూ బీదల పక్షాన్ని గ్రహిస్తున్నవి. అనేకమైన మంచి గుణాలు ఉన్నచోట ఒకటే దోషం కనిపించదు. ఒకొక్కప్పుడు ఆ దోషం వలన గూడా ఆ గుణసమూహానికి ప్రకాశం హెచ్చడం కద్దు. ఒకొక్కసారి ఒకటే గుణంలోనే దోషసమూహమంతా విలీనం కావడంగూడా సంభవమే. ఉత్కృష్టతలో ఆ గొప్పదనమున్నది. ఈ నాడు ప్రపంచమంతటా బీదలు మహాదైన్యస్థితిలో ఉన్నారు తల్లివలె ఆ బీదలను సంభావించి, సంభావించడమే కాదు, వారి సర్వాంగీణౌన్నత్యానికి పాటుబడే ఉత్సాహం, సాహసం కల వారందరూ సర్వదోషాలనూ నివారింపజేసే హరినామంతో సమానమైన మహద్గుణాన్ని సంపాదించినట్లేనని భావించాలి.

గాంధీ సిద్ధాంతాలూ కమ్యూనిజమూ రెండూ తల్లిప్రేమతో బీదలను ఉద్ధరించవలెనని కోరుతున్నవి. కాని చాలాసార్లు పిచ్చిదైన తల్లిప్రేమ తాత్కాలిక ప్రయోజనాన్ని మాత్రమే ఆశించి స్థిరమైన ప్రయోజనాన్ని గుర్తించదు. ఈ నాడు కమ్యూనిజం స్థితిగూడా అలాగే ఉన్నది. కేవలం తల్లి పడే ఆరాటం వల్లనే కష్టాలు దూరంకావు. ఆ ఆరాటంతో బాటు తల్లిలో గురువులు చూపించే కార్యకుశలత గూడా ఉండాలి.

తన స్వతంత్రమైన ఆలోచనా శక్తిని పోగొట్టుకొనని ఒక ప్రముఖ కమ్యూనిష్టును కలుసుకొన్నాను. అతనితో ఈ విషయం కొంత వరకు చర్చిం

చాను. "హింస సామాన్యజనానికి సంబంధించిన శక్తి అనడానికి వీలుం
టుందా? అని అతనిని ప్రశ్నించాను. సామాన్యంగా అలా అనడానికి వీలు
లేదు. కాని విశేష పరిస్థితులలో, ప్రత్యేకించిన ఉపాయాలద్వారా
జనాన్ని హింసకుగాను తయారు చేయవచ్చును" అని అతడు అన్నాడు.
ప్రత్యేకమైన పరిస్థితికి గాను అలా తయారు చేస్తాము, సరే. దాని వలన
ప్రయోజనమేమిటి? ఒకటేసారి సంపాదిద్దాము, తిందాము అన్నట్లే అవు
తుందిగదా? మన స్వభావంలోనే లేని శక్తి మనలో ఉన్నదన్నట్లుగా
నటిస్తే చివరికి ఎవరిదగ్గర ఆ శక్తి ఉన్నదో, వారి చేతిలోకే రాజ్యాధికారం
పోతుందిగదా? లేక మనుష్య స్వభావాన్నే హింసాపూరితంగా మార్చ
వలెనని మనం ప్రయత్నిస్తే అది అసలు అసంభవమవుతుందిగదా? ఒక
వేళ సంభవమయినా అలాంటి సమాజం వలన లోకక్షేమం కలుగుతుందా?
అది ఒక భయానకమైన ఘటన అయిపోదా? ఆ ఘటన వలన కలిగే
పరిణామాలు ఎంత ఘోరంగా ఉంటవో ఆలోచించారా?" అన్నాను.

"కావచ్చును, పరిణామం ఎలాంటిది కలిగినా నేటి స్థితి మారిపోవాలి,
అదిచాలు" అన్నాడతడు.

"నేటి స్థితి మారి పోయిందని మనకు కొద్దికాలం భ్రమకలిగినా తిరిగి
అదే స్థితి కొద్ది రోజుల్లోనే మొదటి కంటె రెండు రెట్లు ఎక్కువగా మళ్లీ
ప్రత్యక్ష మవుతుంది" అన్నాను.

"ప్రత్యక్షం కానివ్వండి. ముందు విషయం ముందు చూసుకో
వచ్చును" అన్నాడు.

"ఇది వైజ్ఞానికులు అనవలసిన మాటకాదు, కమ్యూనిస్టులు వైజ్ఞా
నికులుకదా? మేము వైజ్ఞానికంగా ఆలోచిస్తామని అంటారు గదా?"
అని ప్రశ్నించాను.

"అవును, నిజమే, ఒకసారి ప్రభుత్వం చేతిలోనికి వస్తే సర్వకాల సర్వావస్థలకూ తగినట్లుగా రాజ్యాంగ వ్యవస్థను ఏర్పాటు చేస్తామని మా వారంటున్నారు. సర్వకాలాలకూ వ్యవస్థ అనేది నాకు గూడా నచ్చడం లేదు. ప్రపంచంలో సర్వకాలాలకూ అని ఏముంటుంది? అయినా ప్రస్తుత వ్యవస్థను మార్చవలెగదా? అది తప్పదు. ముందు విషయం ముందు చూసుకొంటాము" అన్నాడతడు.

కమ్యూనిష్టులు ఈ సోదరుని పరిణత ప్రజ్ఞగల కమ్యూనిష్టుని భావించరు. "భ్రాంత స్థితిలో ఉన్నా తెలివి గల వాడని నేను అనుకున్నాను. సర్వకాలాలకూ తగిన వ్యవస్థను నిర్మించడమనేది కమ్యూనిజం తయార్యారు చేసిన ఒక నల్లమందు మాత్రమాత్రమే" దానం చేయంగానే పుణ్యం లభించాలి" అని సర్వ సామాన్యంగా కమ్యూనిష్టులు అనుకుంటున్నారు. ప్రస్తుతస్థితిని మార్చడమే వారికి చాలును, అంటే తాత్కాలిక ప్రయోజనాన్ని ఆశించే తల్లిగానే వారుంటున్నారు గాని, కార్యకుశలత గలిగిన గురుత్వభారభూషితమైన మాతృహృదయం వారిది కాదు.

## రెండు సాధనాలు

ఏమైనా, స్వరాజ్యం ప్రాప్తించిన తరువాత గూడా భారతదేశం లోని జనసామాన్యం అజ్ఞానంగా శోచనీయమైన స్థితిలోనే ఉన్నది. ఆ స్థితినుండి బయటపడవలెనని అది కోరుతున్నది. భిన్న భిన్న వాదాలను గురించి తార్కికంగా ఆలోచించే శక్తి వారికి లేదు. అందుకు వారికి అవకాశం గూడా లేదు. ఎవరు వారి కష్టాలను తీరుస్తారో, వారే వారికి దేవతలు, కనుక చివరిలో మహాత్ముని వాలా చేసిన హెచ్చరికను మరచిపోతే ప్రయోజనం లేదు. కమ్యూనిజాన్ని వ్యతిరేకించినా, తార్కికశైలిలో దానికి జవాబు చెప్పినా, లేక రాజ్యబలంతో దానిని అణచివేయడానికి

ప్రయత్నంచేసినా ఏమీ ప్రయోజనం లేదు. వర్షాకాలంలో నదులూ, కాలవలూ అన్నీ ఏ విధంగా ఉప్పొంగి సముద్రం వైపునకు పరుగెత్తుతవో అదే విధంగా జనసేవకుల సేవ యావత్తూ కష్టాలలో ఉన్న గ్రామీణజన సమూహం వైపుకు పరుగెత్తాలి.

ఇన్ని ఆపదలలో ఉన్నా భగవంతుని దయవలన ఇంకా జనుల హృదయాలు మలినమైపోలేదు. గాంధీజీ మార్గం ద్వారానే మనం ఉద్ధరించబడగలమనే విశ్వాసం ఇంకా గ్రామాలలో దృఢంగానే ఉన్నది. నేటి ప్రభుత్వం గాంధీజీ సహచరుల, అనుచరుల ప్రభుత్వం. దేశంలో గొప్ప సంస్థ, దృఢమైన సంస్థ కాంగ్రెస్సు. అది గాంధీజీ చేతుల్లో పెరిగింది. సర్వోదయ భావాలు గలిగిన నిర్మాణ కార్యకర్తలందరూ గాంధీ జెండానే ఎగురవేస్తున్నారు. భారత దేశంలోని సామ్యవాదులు గూడా గాంధీజీ సంతానమే. ఈ దేశంలో సత్యాగ్రహ సామ్యవాదాన్ని స్థాపిస్తామని వారంటున్నారు. ఈ ఇద్దరూ, ముగ్గురూ లేక నలుగురూ— అందరూ కలిసి తమ తమ శక్తి ననుసరించి తమ తమ ప్రవృత్తులననుసరించి— పరస్పర సహకారంతో— జనసేవలో మగ్నులైతే, ఈ దారిద్ర్యమూ, దైన్యస్థితీ, దుఃఖాలూ ఉండగలవా? కాని ఈ నలుగురూ ఈ రోజున నాలుగు మార్గాల పయనిస్తున్నారు. ఐదోది పరుగెత్తుకొని వస్తున్నది— ఆ ఐదోది ఏమిటి? — ఉపనిషద్భాషలో మృత్యుర్ధావతి పంచమః— మృత్యువు.

అన్నంలేక చచ్చిపోతున్నారని ఒకరంటే అన్నం లేక కాదు, జబ్బుల వల్ల చచ్చిపోతున్నారని ఇంకొకరంటున్నారు. ఆకలిచేత చనిపోయేవారికి గూడా ముందు ఏదో ఒక జబ్బు రానేవస్తుంది.

స్వామీ రామదాసు రచించిన గీతం చదవండి:—

కాహేఁ మిళేనా మిళేనా ఖాయాలా

తావ నాహీంరే, నాహీంరే, నాహీంరే జాయాలా
హశాన్ కైచీరే, కైచీరే, కైచీరే, గాయాలా
కోఠేం జావేంరే, జావేంరే జావే, మాగాయాలా ?

తినడానికి ఏమీ దొరకడం లేదు. దొరకడం లేదు, దొరకడం లేదు. వెళ్ల డానికి స్థానంలేదు, స్థానంలేదు, స్థానంలేదు. గీతాగానం చేయవలెననే కోరిక ఎలా కలుగుతుంది ? ఎలా కలగుతుంది ? ఎలా కలుగుతుంది ? ఆడX డానికి ఎక్కడకు పోవాలి ? ఎక్కడకు పోవాలి ? ఎక్కడకు పోవాలి ? ఇదీ మన స్థితి.

ఇందుకు తప్పు ఫలానావారిదని నేననను. నేను నిరాశపడను. దేశం పెద్దది. దేశ సమస్యలు గూడా పెద్దవి. గనుక తప్పు ఎవరిమీదా పెట్టడం లేదు. అభిప్రాయ భేదాలు గూడా ఉండడంలో దేశం పెద్దది గనుక ఆశ్చ ర్యమేమీ లేదు. నా చేతిలో పార ఉన్నంతసేపూ నేను నిరాశపడవలసిన అవసరంగూడా లేదు. ప్రతిచోటా బావులు త్రవ్వితే పంటలు బాగా పండు తవని అనుకొన్నాము. ప్రభుత్వంవారు ఈ విషయం ఆలోచించవలెనని ఒకడన్నాడు. ప్రభుత్వంతో పని ఏమిటి ? ప్రభుత్వమంటే ఎవరు ? మనమే. కనుక బావులను మనమే త్రవ్వుదామన్నాను. బావిత్రవ్వడు ప్రారంభమయింది. బావి త్రవ్వేవారికి ఎలా త్రవ్వాలో అనుభవం ఏమీ లేదు, అయినా పారాపలుగూ తమ పనిని చేసినవి. తవ్వేవారికి నీటిజాడా గూడా తెలియదు. పారకు తెలుసును. అది తవ్వుతూపోయింది. జలదర్శన మయింది. చుట్టుపట్ల ఉన్నవారు తీర్థజలంలాగా ఆ నీటిని తాగారు. ఆ ఊరి పటేల్ 80 సంవత్సరాల వయస్సున్న కోశీబాబాయే పని చేస్తుంటే మనం ఎందుకు చేయగూడదు అనుకున్నాడు. సురగాంవ్‌లో బావి త్రవ్వడం ప్రారంభించాడు. ఆ గ్రామంలోని నవయువులందరూ పూనుకొన్నారు. మాకు తెలియకుండానే ఆ నవయువకులు మా బావుల దగ్గరకు వచ్చారు.

నాలుగు గంటలు శరీరపరిశ్రమను దానంచేసి వెళ్ళిపోయినారు. ఆడంబరం లేదు, ప్రచారంలేదు. ఈశ్వరుడు జన హృదయంలో ఇలాంటి దివ్య ప్రేరణ ను కలుగజేస్తూ ఉంటే మనం ఎందుకు నిరాశపడాలి? రామదాసు— అడగ డానికి ఎక్కడకుపోదాం? ఎక్కడకుపోదాం? అంటున్నాడు. అమెరికా దగ్గరకు పోదామా? స్వరాజ్యం అనుభవిస్తున్న మనం ఇతరులదగ్గర బిచ్చ మెత్తుతామా? శ్రమ దేవతను ఉపాసించి ఆమెనే అడుగుదాము. అడిగితే దొరకుతుంది, వెదికితే దొరుకుతుంది అని ఆమె చెప్పుతూనేఉన్నది.

కాంచన మోహముక్తి, శరీరపరిశ్రమ ఈ రెండింటిలోనే భారత దేశోద్ధరణ నిండిఉన్నట్లు నాకు తోస్తున్నది. దీనిలోనే గాంధీ సిద్ధాంత సారమంతా నిహితమై ఉన్నట్లు కనపడుతున్నది. అదియే నిజమైన సామ్య వాదంతో కలిసేదిగా కనపడుతున్నది. దానిలోనే సామ్యవాదమూ, ధనిక వాదమూ సమన్వయమయ్యేటట్లు కనపడుతున్నది.

పరంధామం<br>
25-11-50

వినోబా

# గాంధి మార్క్సు.

## ప్రయోజనము.

హింసను తీసివేస్తే కమ్యూనిజమూ, గాంధీవాదమూ రెండూ ఒకటేననీ, గాంధీజీ అహింసా వ్రతధారియైన కమ్యూనిష్టు అనీ, కమ్యూనిష్టులకూ గాంధీజీకీ లక్ష్యం విషయంలో ఎలాంటి భేదమూ లేదనీ, సాధనం విషయంలోనే, లక్ష్యాన్ని సాధించే ఉపకరణాల విషయంలోనే అభిప్రాయ భేదమనీ తరచు అంటూ ఉంటారు. సాధన శుద్ధి అనగా సత్యాహింసలకు గాంధీజీ ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. కమ్యూనిజం ఈ ప్రాధాన్యతను గుర్తిస్తే కమ్యూనిజమూ గాంధీవాదమూ రెండూ ఒక్కటే అయిపోతవి అని వారి అభిప్రాయం.

ఇలాంటి మాటలకు గాంధీగారు అప్పుడప్పుడు అన్న కొన్ని మాటలుగూడా ఆధార మవుతున్నవి. * తమ సిద్ధాంత ప్రచారానికి ఉపయోగిస్తుందని మాత్రమే గాంధీజీ సిద్ధాంతాలు

---

* మిత్రులైన కమ్యూనిష్టులతోనూ, సోషలిష్టులతోనూ మాట్లాడుతూ వారికంటే తానే సరియైన సామ్యవాదినని గాంధిగారు అన్నారు. అందరి ధ్యేయమూ ఒకటే. అందుకుగాను అనుసరించే మార్గాలలోనే భేదమున్నది.

(గాంధీజీ సామ్యవాదం—ప్యారేలాల్ హ. సేవక్ 31-8-46

నన్ను నేను కమ్యూనిష్టు అని గూడా అనుకుంటాను.

(నాలుగేళ్ల తరువాత—ప్యారేలాల్ హ. సేవక్ 4-8-46

ఫలాని సిద్ధాంతాలతో సమానమని పోల్చి చూపిస్తే అలాం టప్పుడు ఆ పోలికలను అంగీకరించడానికి అభ్యంతరమేమీ ఉండదు. గాంధీజీ ధనవంతులకూ, జమీందారులకూ, మహారాజు లకూ, ఇంగ్లీషు వారికీ మిత్రుడు అని అంటే గాంధీజీ అంగీక రిస్తూ ఉండేవారు. అందుకు భిన్నంగా ఈయన దరిద్రనారాయణ సేవకుడు, సరియైన సామ్యవాది అన్నా ఆయన కేమీ అభ్యం తరం ఉండేది కాదు. సనాతనధర్మావలంబకుడైన వైష్ణవుడన్నా, శుద్ధ వైశ్యుడన్నా, సంఘసంస్కర్తయైన హిందువన్నా, నిజమైన బ్రాహ్మణుడన్నా, క్షత్రియుడు, శూద్రుడన్నా ఆయన కన్నీ అంగీకార యోగ్యాలుగానే ఉండేవి. జైనులు సంతోషంతో గాంధీజీ నిజమైన జైనుడనేవారు. క్రైస్తవులు క్రైస్తవుడనీ, మహమ్మదీయులు మహమ్మదీయుడనీ అనేవారు. ఆయన అన్నింటినీ అంగీకరించేవారు. ఈ మాటలన్నీ తన సిద్ధాంతాలను బోధపరచడానికి ఆయనకు ఉపయోగించేవి.

పైపైన ఇలాంటి పోలికలు చెప్పినా,
వాదాలతో ఆయనకు సంబంధం కల్పించినా అంత ప్రమాదం లేదు. కాని సరియైనపద్ధతిలో సిద్ధాంతాలను విశ్లేషించ వలసివచ్చి నప్పుడు ఇలాంటి మాటలూ, ఇలాంటి పోలికలూ పాఠకులకు భ్రమను కలుగజేస్తవి. ఇలాంటి పోలికలు అసలు రెండు సిద్ధాం తాలలోనూ ప్రధానంగా ఉన్న విభేదాలను మరుగుపరచగలవు.

దానివల్ల ఏ సిద్ధాంతమూ స్పష్టంగా అర్థం కాదు. గాంధీవాద మనగా హింసలేని కమ్యూనిజమనగానే కమ్యూనిజంలోని హింస అనే మురికిని తీసివేస్తే గాంధీవాదమూ, కమ్యూనిజమూ రెండూ ఒక్కటేనని పాఠకులు అనుకోడం సంభవిస్తుంది. పైకి ఇది ఎంతో తేలికగా కనపడినా "హింసలేని" అనేది పెద్ద పర్వతమంత విభేదమే. అహింస అనే షరతులో ఉన్న విశాలమైన అర్థాన్ని గమనిస్తే ఈ పోలిక ఎంత వేలవమైనదో బోధపడుతుంది. పురుగు అంటే విషంలేని సర్పము అని చెప్పితే ఎలా ఉంటుందో ఈ పోలికగూడా అలాగే ఉంటుంది.

ప్రస్తుతం సామాన్యజనానికి మార్క్సువాదపు భాష అంటే ఇష్టమనీ, మనుష్యుని దుఃఖాలన్నీ ఆ వాద ప్రచారంతో తొలగి పోతవనీ విశ్వసించడం వలన ఇలాంటి పోలికల వైపుకు మనం ఆకర్షితుల మవుతున్నాము. అందువలన గాంధీవాదం సర్వజనానికీ ఇష్టమైనది కావలెను అంటే: దానిని కమ్యూనిష్టు భాషలో బోధపరచడం అవసరమని భావించ బడుతున్నది. ఒక్కసారి కమ్యూనిజం రావలెనంటే దాని గమనంలో తీవ్రత ఉంటుంది గనుక ఆ కమ్యూనిజాన్ని సాధించడానికి మొదటి మజిలీ గాంధీవాదమనీ, ఈ గాంధీవాదాన్ని మధ్యలో ప్రవేశ పెడితే ప్రయోజనకరమనీ వారి ఊహ. ఎందువల్లనంటే గాంధీ

వాదంలో గమన తీవ్రత లేదు. మందగమనం ఉన్నది. కనుక గాంధీవాదాన్ని మార్క్సిజానికి సాధనంగా తయారు చేయవలెననే మనోవృత్తి ఏర్పడింది.

నా ఉద్దేశ్యంలో ఈ రకపు మనోవృత్తి ఏర్పడడం మంచిది కాదు, సరికాదు. అందువలన ధార్మిక, ఆధ్యాత్మిక, నైతిక సిద్ధాంతాలలోనూ, ఆచార వ్యవహారాలలోనూ తీసుకొని రావలసిన విప్లవాల మీద నుండి సామాన్యజనం దృష్టి మారి పోతుంది. ప్రతి వ్యక్తి యొక్క జీవితంలోనూ తీసుకొని రాబడే మార్పులకు సంబంధించినదే మహత్వపూర్ణమైన గొప్ప విప్లవము. చివరకు ఆపునాదులకు సంబంధించిన విప్లవం వల్లనే సామాన్య జనం తాలూకు సాంఘిక, రాజనైతిక, ఆర్థికవ్యవస్థలలో తీసుకొని రావలసిన పరివర్తనాలన్నీ ఉత్పన్న మవుతవి. ఈ పునాదిసిద్ధాంతాలపై జనసామాన్యపు దృష్టిని కేంద్రీకరించడం అవసరం. ఆ దృష్టితో ఆలోచిస్తే గాంధీ మార్క్సు లిద్దరూ ఎరుపు, ఆకుపచ్చరంగులలాగా వేరు వేరే. కాని కళ్లకు ఒక రోగం వస్తే అప్పుడు మనకు ఈ రంగుల భేదం తెలియకుండా పోతుంది. అన్నీ ఒకే రంగుగా కనపడ తవి. ఎరుపు ఆకుపచ్చ రంగులలో ఉన్న సామ్యం లాంటి సామ్యమే గాంధి మార్క్సులలో ఉన్నది.

ఈ విషయాన్ని గురించి ఇంకొక దృష్టితో గూడా ఆలోచించవచ్చును. గాంధీ మార్క్సుల మధ్య కేవలం

"అహింసలో" మాత్రమే భేదం ఉండి, కాంగ్రెస్సు, గాంధేయుల ధ్యేయం సమాజవాద వ్యవస్థను స్థాపించడమే అయితే అహింసా విధానంలో దానిని సాధించడానికి అనువైన సమయం ఇదే. ఎందువల్లనంటే ఈ నాడు భారతరాజకీయ నాయకత్వం అంతా— ప్రభుత్వ యంత్రమంతా— గాంధీజీని రాష్ట్రపిత అంటూ, గాంధీజీని గురించీ, గాంధీజీ సిద్ధాంతాలను గురించీ ప్రశంసించే వారి చేతుల్లోనే ఉన్నది. కనుక తమ చేతుల లోనికి అధికారం వస్తే సమాజవాదులు ఏమేమిచేయదలచు కొన్నారో వానినన్నింటినీ గాంధీవాదులే పూర్తి చేసి ఆ ఆందోళనను వ్యర్థపరచగలరు. ఆ ఆందోళనకు సంబంధించిన పునాదులనే కదలించి వేయగలరు. ప్రభుత్వయంత్రం సామ్యవాదుల సిద్ధాంతాలను అంగీకరించకపోతే, చట్టబద్ధమైన ఆందోళన ద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకోలేకపోతేనే గదా, హింసాత్మక విప్లవాన్ని ఆశ్రయించాలి? అసలు గాంధీవాదం లోనూ సామ్యవాదంలోనూ భేదం లేనప్పుడు ప్రస్తుతమున్న ప్రభుత్వం సామ్యవాద ప్రభుత్వమే అవుతుంది. అందువలన ప్రభుత్వంవారూ సామ్యవాదులూ అందరూ ఒకరికొకరు అనుచరులన్న మాట. వైయక్తికాధికారం 'క' దగ్గర ఉండాలా, 'ఖ' దగ్గర ఉండాలా అని తగాదా ఉంటే ఉండవచ్చుగాక. ఆ స్థితిలో మీరు స్థాపించదలచుకొన్న ఆర్థిక వ్యవస్థ ఏర్పడింది గనుక, మీ విధానాలతో మాకు పనిలేదని జనసామాన్యమే చెప్పవచ్చును.

కాని అలాంటిది ఏమీ జరగడంలేదు. గాంధీజీ మార్క్సు లలో ఉన్న భేదం చాలా విస్తృతమైనది, గంభీరమైనది.

ఈ విషయాన్ని లోతులకు పోయి తెలుసుకోవడం అవసరం. అదే ఈ పుస్తకానికి ప్రయోజనం.

## ఒక్కటే చైతన్య శక్తి

జీవితాన్నీ, జగత్తునూ చూచేదృష్టిలోనే గాంధీజీకీ మార్క్సుకూ మధ్య అమితమైన విభేదమున్నది. సాధన సాధ్యాలలోనూ, రాజనైతిక, సాంఘిక, ఆర్థిక, ధార్మిక నిర్మాణాలలోనూ ఇద్దరి మధ్యా కనిపించే భేదం పై విభేదకారణంగా ఏర్పడినదే. నిజానికి ఒక మార్క్సుతోనే గాక గాంధీజీకి ధనిక వాదుల, యంత్రవాదుల విషయంలో గూడా ఇలాంటి దృష్టి విభేదం ఉండనే ఉన్నది. ధనికవాద, సామ్యవాదులలో ఎంత సంఘర్షణా, ఎంత సిద్ధాంతవిభేదమూ ఉన్నా కొన్ని ప్రధాన మైన విషయాలలో రెండింటి దృష్టికోణమూ ఒక్కటిగానే ఉన్నది. ఉదాహరణకు చూడండి. ఈ రెండు వాదాలూ సంపత్తి మీదా, భూమిమీదా కేంద్రీకృత నియంత్రణం ఉండాలి అనే కోరుతున్నవి. ఈ రెండు వాదాలకూ భారీ ఎత్తున నడుపబడే పరిశ్రమలమీదా, అలాంటి వ్యవసాయంమీదా విశ్వాస మున్నది. ఈ రెండు వాదాలూ ధనానికి సంబంధించిన ఆర్థిక వ్యవస్థను అంగీకరిస్తున్నవి. ఇవి యంత్రవాదాన్నీ, సంపత్తినీ

పూజిస్తున్నవి. పూంజీమీదా, యంత్రాలమీదా ఎవరికి అధికారం ఉండాలి, వాటివలన వచ్చే లాభాలను ఎలా పంచుకోవాలి అనే వాటి మీదనే ఈ రెండు వాదాలకూ వివాదమున్నది. తమ అధికారాలనూ, తమ భాగాలనూ పెంచుకోవలెనని రెండూ గట్టి ప్రయత్నం చేస్తున్నవి.

ఒక మార్గం రెండుగా చీలితే, ఆ చీలిన చోట ఆ రెండు చీలికలకూ మధ్యనున్న విభేదం తక్కువగా ఉన్నా, పోను పోను ఆ రెండింటికీ మధ్యగల దూరం కొన్ని మైళ్ల వరకూ పెరిగి పోతుంది. భారత చిత్రపటంలో కన్యాకుమారి దగ్గర గురుతును వ్రాసి ఆ గురుతు పైన రెండు గీతలనుగీసి, వాటిని పొడవుగా చేసుకుంటూ పోతే ఒక గీత పెషావరు దగ్గరకు చేరితే ఇంకొక గీత నేపాళ దేశం దగ్గరకు చేరుతుంది. అదే విధంగా జీవితమూ, జగత్తూ మనుష్యునిచేతనా జనితములకొన్నా, లేక ప్రకృతి పొందిన వికాసములనుకొన్నా వ్యవహారంలో ఈ రెండింటికీ మధ్యనున్న భేదం మనకు అంతగా గోచరంకాదు. ఒక అణాకు నాలుగు కానులు అన్నట్లుగానే ఉంటుంది. ♦ ఈ కారణం వలన కొన్ని బయటి విషయాలలో గాంధీ మార్క్సులు ఇద్దరూ ఒకే రకపు ఫలితాల మీదకు వచ్చినట్లు కనపడినా అసలు విషయం అది కాదు. ఈ ఇద్దరి సిద్ధాంతాలనూ హృదయంగమం చేసుకొని

---

♦ పరిశిష్టం నాలుగును చూడండి.

వాటిని అమలులో పెట్టడానికి ప్రారంభించినప్పుడు మాత్రమే, ఉన్న విభేదం మనకు దృష్టి గోచరమవుతుంది.

గాంధీజీ మార్క్సులలో ఒక్క విషయంలో మాత్రమే సామ్యమున్నది. ఇద్దరికీ పీడిత ప్రజానీకమంటే, జంతువులలాగా పీడింపబడుతున్న, చంపివేయబడుతున్న నోరు లేని మానవ కోటి అంటే ఎంతో సానుభూతీ, ప్రేమా ఉన్నవి. అది ఒక్కటే సామ్యం. × ప్రస్తుతమున్న మానవకోటిలో ఎక్కువ మంది జనం ఆ వర్గానికే చెంది ఉన్నారు. ప్రపంచంలో సుఖసాధనాలు తక్కువ కావడం వలన వారికి ఆ స్థితి సంప్రాప్తం కాలేదు, ప్రతి జీవీ సుఖంగా, విశ్రాంతిగా జీవితం గడపడానికి కావలసినంత సంపద దేశంలో ఉన్నది. ఇంతేగాక ఉత్తమకోటికి చెందిన సాహిత్యాన్నీ, కళలనూ, భవనాలనూ, యంత్రాలనూ, విజ్ఞా

---

× మొదటివాని కంటే రెండోవానికి గల అవసరాలు ఎక్కువ అనుకొని బీదవానికీ జమీందారునకూ భేదం ఉండడం ఉచితమని అనుకోగూడదు. అలాంటిది పనికిరాని తరహామని నా అభిప్రాయం. ఈ నాటి ధనిక బీద విభేదాన్ని చూస్తూ ఉంటే నాకెంతో కష్టం కలుగుతున్నది. విదేశపు ప్రభుత్వమూ, పట్టణాలలో ఉండేవారూ బీదలను పీల్చి పిప్పిచేస్తున్నారు. గ్రామీణులు ధాన్యాన్ని పండించి ఆకలికి మాడి చస్తున్నారు. వారు పాల సంపదను పెంపొదిస్తున్నారు. కాని వారి పిల్లలకు పాలు లభించడం లేదు. ఇది ఎంత సిగ్గుచేటు అయిన విషయము? ప్రతి వ్యక్తికీ బలకరమైన ఆహారమూ, మంచి ఇల్లూ, పిల్లలకు చదువు చెప్పించే వసతీ, మందూ మాకులూ లభించవలెను.
( గాంధీజీ సామ్యవాదము, ప్యారేలాల్ హారిజనసేవక్ 31-8-46 )

నాన్నీ, సంస్థలనూ సృష్టించినటువంటివన్నీ, ప్రకృతి రహస్యాలను కనుగొని, ఆత్మజ్ఞాన రహస్యాలను వెలువరించినటువంటివన్నీ, అరేబియన్ నైట్సులాంటి కథలలో మాత్రమే వర్ణింపతగిన, అసంభవమైన విషయాలను వాస్తవిక ప్రపంచంలో సంభవంగా చేసినటువంటివన్నీ మహానాగరికతలు గూడా ఈ ప్రపంచంలో ప్రబలినవి, ప్రబలుతున్నవి. గాంధీ మార్క్సు లిద్దరూ ప్రకృతీ, మానవుని మేధస్సూ రెండూ కలిసి ప్రసాదించిన ప్రసాదంలో అందరికీ సమాన భాగం లభించేటట్లుగా సాంఘిక వ్యవస్థను నిర్మాణం చేయవలెనని ఆశించారు.

కాని గాంధీజీ ఈ తన కోరిక సిద్ధించడానికి సత్యాహింస లకు ప్రాధాన్యాన్నిస్తే, మార్క్సు సాధనగత గుణ దోషాలకు అంత ప్రాధాన్యత నివ్వలేదు. (గాంధీజీకీ, గాంధీ అనుయాయుల కూ మధ్య భేదమున్నట్లుగానే మార్క్సుకూ మార్క్సు అనుయా యులకూ మధ్య గూడా అలాంటి భేదమే ఉన్నదని అంటున్నా రు) తొందరగా ఫలసిద్ధి కలగడానికి ఏ సాధనాన్నైనా అవలం బించడంలో మార్క్సుకు అభ్యంతరం లేదు.

ఇక్కడ ఒక ప్రశ్న బయలుదేరవచ్చును. వీరిద్దరూ ప్రసిద్ధులూ, ఉదార హృదయులూ, పవిత్ర ఉద్దేశ్యం కలవారూ అయినప్పుడు వీరిలో మానవ జీవితానికి సంబంధించిన ప్రధాన సమస్య మీద ఇలాంటి అభిప్రాయ భేదం ఎలా ఏర్పడింది;

అనేది ఆ ప్రశ్న. ఈ అభిప్రాయ భేదానికి గల కారణాన్ని మనం వెదకగలిగినా లేకపోయినా ఒకరి యొక్క గానీ, లేక ఇద్దరి యొక్కగానీ, తర్కంలో ఏదో దోషమున్నదనిగానీ, లేక ఏ వస్తువులను వారు సత్యాలని నమ్మినారో అవి సత్యంకావడంలో సందేహమున్నదని గానీ అనుకోవలసివస్తున్నది.

ఈ జడచేతన భరితమైన ప్రపంచం అసలు ఏమిటి? అనే విషయాన్ని గురించి వందలకొలది సంవత్సరాల నుండి ప్రపంచంలోని ప్రఖ్యాత తత్వవేత్తలందరూ, వైజ్ఞానికులందరూ చర్చిస్తూనే ఉన్నారు. దానిలో గల మూలతత్వం ఒక్కటేనా? రెండా లేక అంతకంటె ఎక్కువగా ఉన్నవా? చైతన్యంలో నుండి జడం ఉత్పన్నమయినదా? జడంలో నుండి చైతన్యం ఉత్పన్నమైనదా? ఒకవేళ చైతన్యాన్ని అంగీకరించినా ఆత్మ ఒక్కటా లేక అనేకమా? ఇలా చర్చ మొదలు పెడితే దానికి అంతు ఉంటుందనడం గూడా కష్టమే. ప్రతి యుగంలోనూ ఈ విషయంమీద రకరకాల అభిప్రాయాలను వ్యక్తీకరించే వారు దొరుకుతూనే ఉంటారు. "కావ్యశాస్త్ర వినోదేన కాలో గచ్ఛతి ధీమతాం" అనే సామెత ప్రకారం ఏదో పొద్దుపోని వాళ్లు మనోవినోదం కొరకు చేసుకొనే చర్చల్లో ఇది చేరి పోయినా అది ఒక రకంగా ఉండేది, అదీకాదు. మనుష్యుల దైనందిన వ్యవహారాలన్నింటిమీదా ఈ చర్చ తాలూకు

పరిష్కారం చూపుతున్నది. ఒక దృష్టిని స్వీకరిస్తే సమాజ నిర్మాణమూ అందులో వ్యక్తికిగల స్థానమూ ఒకరకంగా ఉంటుంది రెండో దృష్టిని స్వీకరిస్తే ఇంకొక రకంగా ఉంటుంది. మూడో దృష్టిని స్వీకరిస్తే మూడో రకంగా ఉంటుంది. విజ్ఞానాభివృద్ధి వలన ఈ వాదాల సంఖ్యను తగ్గించడానికి వీలు ఏర్పడుతుంది. వాదాల సంఖ్య తప్పక తగ్గడం సంభవమవుతుంది, కాని ఒక హద్దును దాటిన తరువాత విజ్ఞానశాస్త్రం గూడా ఒక కల్పనగానే, ఒక ఊహా ప్రధానమైన విషయంగానే ఉండి పోతున్నది. ఈ జడానికీ, చైతన్యానికీ సంబంధాన్ని కలిపే సరియైన సాధనం ఇంకా దృష్టిగోచరం కాలేదు. ఆ సాధనం మన దృష్టికి ఇంకా దూరంగానే ఉన్నది. ఇవ్వబడే అభిప్రాయాలన్నీ కేవలం వాదాలు— థీరీలు—మాత్రమే. కాని దురాగ్రహం కలిగిన వ్యక్తి తనకు శ్రద్ధాభాజనమైన వాదాన్ని నమ్మి, ప్రపంచంలో నిర్మాణమైన సిద్ధాంతాలన్నీ ఆ వాదం మీదనే ఆధారపడి ఉన్నట్లు విశ్వసించి ఆ వాదప్రచారం కొరకు అసత్యాన్నీ, బలాన్నీ గూడా ఉపయోగిస్తున్నారు.

ఈ అనేక వాదాలలో రెండు వాదాలు ప్రపంచానికి మూలంలో ఒకే తత్వమున్నదని నమ్ముతున్నవి. అనేక తత్వాలున్నవని అంగీకరించడం లేదు. గాంధీ మార్క్సులిద్దరూ ఏకతత్వ వాదులు. కాని ఆ ఒక్క తత్వమూ ఏమిటి అనే విషయంలో

వీరిద్దరికీ తీవ్రమైన అభిప్రాయభేదమున్నది. గాంధీజీ దృష్టిలో ఆ మూలతత్వం చైతన్య స్వరూపము. జడ సృష్టి గూడా చైతన్యం వలన ఉత్పన్నమైనదే గాని స్వతంత్రమైన అస్తిత్వం కలది కాదు. చైతన్యం లేనపుడు కనీసం జడం ఉన్నట్లు ప్రమాణ మేదీ కనపడడం లేదు. ఉత్పత్తి స్థితి లయాలు మూడూ చైతన్యంలోనే ఉండి చైతన్యంలోనే జరుగుతున్నవి. చైతన్యం ఒక్కటే ఎల్లప్పటికీ ఇది వరలో ఉన్న, ముందు ఉండబోయే శక్తి. మిగతా శక్తులన్నీ దానికి కిరణాలు, మాత్రలు మాత్రమే. మిగతాదంతా నశ్వరమే. క్షణంలో మారిపోయేదే. చైతన్యం ఒక్కటే మూడు కాలాలలోనూ ఉండే సత్యము. అది ఒక అద్భుతమైన గూఢతత్వము. అది నిత్యానుభవంలో ఉన్నా కన్పించదు. చాలామందికి తమ జీవితమంతా కృషి చేసినా లభించనిది. అంతేకాదు. కొంత కొంత మందికి అసలు దాని అస్తిత్వం విషయంలోనే సందేహం ఉంటున్నది. దానిని అంగీక రించేవాళ్లు గూడా శ్రద్ధ వల్లనే అంగీకరిస్తున్నారు. మహా సాగరజలంలో ఉన్న సంపూర్ణ తత్వమే నీటి బిందువులో గూడా ఉంటున్నట్లు ఈ చైతన్యతత్వం సింహంలోనూ, బుద్ధిమంతుడైన మానవునిలోనూ ఉన్నంత కీటాణువులోగూడా ఉంటున్నది. బయటకు కన్పించే శక్తులలో ఎంత భేదమున్నా అసలు వస్తువు అందరిలోనూ ఏకంగానూ, సమానంగానూ ఉంటున్నది. నిద్రించే సింహానికి గలశక్తి మనకు తెలియక పో

వచ్చును. అంత మాత్రం చేత అసలు ఆ శక్తి లేదని అనడానికి వీలు లేదు. అదే విధంగా యావత్తుశక్తి ప్రకటీకృతం అయినా కాక పోయినా అణువు అణువులోనూ ఆ చైతన్య శక్తి పూర్తిగా నిండియే ఉంటుంది. చైతన్యంలో ఉన్న ఇంకొక అద్భుతమైన గుణ మేమంటే కీటాణువు నుండి ఒక ఏనుగ వరకు వేరువేరు ఉపాధులలో వేరువేరుగా, స్వయం సంపూర్ణంగా ఉన్నట్లు కనపడినా మొత్తం మీద అంతటా ఉండే ఆ శక్తి — ఆత్మ— ఒక్కటే. మూలతత్వ దృష్టితో చూస్తే పెద్ద జీవి కంటే చిన్న జీవికానీ ఒక మహాత్ముని కంటే ఒక పామరుడు గానీ వేరు కారు. వజ్రమూ, బొగ్గూ ధరలోనూ, రూపంలోనూ, గుణంలోనూ వేరువేరుగా ఉన్నా ఎట్లు అవి రెండూ ఒకే కార్బన్‌కు సంబంధించిన రెండు రూపాలో, జీవమాత్రులంతా అంతే. ఏ రహస్యమయమైన ఇంద్రజాలం వలన ఇవి ఏర్పడుతున్నవో మనకు తెలియడం లేదు. కాని రెండింటికీ కారణభూతమైన అసలు వస్తువు ఒక్కటే అనే విషయంలో గాంధీజీ సిద్ధాంతాలలో ఏ విధమైన సందేహానికీ ఆస్కారం లేదు. జడ చైతన్యములు, గుణదోషాలు మొదలగు అనేక విచిత్రాలతో నిండిన ఈ విశ్వమంతా ఒకే చైతన్య శక్తి స్వరూపమే. పరమ సత్యమనండి, పరమాత్మ అనండి, బ్రహ్మ అనండి ఏమైనా అనండి, అసలు మూల చైతన్య వస్తువు ఒక్కటే. మనుష్యులు, పశువులు, పక్షులు, వనస్పతులు, కీటాణువులలో వ్యక్తమయ్యే స్వాతంత్రి

మైన అస్తిత్వం— వ్యక్తిత్వం— జీవభావం ఆ విశ్వచైతన్యానికి సంబంధించిన పై రూపమే. అవి అన్నీ ఆ అనంతశక్తి యొక్క రకరకాలైన ఆవిర్భావాల పరిణామ స్వరూపాలు మాత్రమే. అన్నింటికీ మూలతత్వం ఆ ఆత్మయే. ఆ తత్వంలో నీవు, నేను, వాడు అనేదానికి చోటు లేదు. నాకు అర్థమైనంత వరకు ఈ జడచేతన మయమైన విశ్వం విషయంలో గాంధీజీ ఉద్దేశ్యపు- భూమిక— ఇదే.

దీనికి సంబంధించిన ఇంకొక ముఖ్యమైన విషయాన్ని ఇక్కడ స్పష్టపరచడం అవసరం.

గాంధీగారి వలె ఆత్మను ఒకే మూలతత్వంగా అంగీకరిస్తూ అందుకు గీతలాంటి గ్రంథాలను ప్రమాణంగా చూపించే, వాదాలు ఇంకా కూడా కొన్ని ఉన్నవి. కాని ఆ వాదాలు కొన్ని విషయాలలో సామ్యవాదంతో కలిసే, గాంధీజీ భావా లకు వ్యతిరేకంగా ఉండే ఫలితాంశాలను వెలువరిస్తున్నవి. అదే విధంగా అవి సాక్ష్యసాధనాలను స్వీకరిస్తున్నవి.

జడచేతన మయమైన సృష్టిని ఒకే ఆత్మతత్వావి ర్భూతమని అంగీకరిస్తూ గాంధీజీ దానివలన ఏ విషయాన్ని గ్రహిస్తున్నారో దానిని ఈ క్రింది విధంగా చెప్పవచ్చును.

"అహం బ్రహ్మాస్మి వైరకరాం" అంతా భగవత్స్వ రూపమే అయితే, నేను కూడా ఆ అసలు వస్తువునే అయితే

నేను ఎవరిని చెడ్డవారని అనగలను? ఎవరిని ద్వేషించగలను? ఎవరిని భయపెట్టగలను? ఎవరిని నావాడనీ, ఎవరిని పరాయి వాడనీ అనను? ఎవరిని తక్కువవారనీ, తుచ్ఛులనీ అనగలను?

"అయినా నేను ఆ అసలు వస్తువునే అయినా నాతో కలసి ఉన్న ఈ శరీర మోహాన్ని, దీనిని ఆరోగ్యవంతంగా అట్టి పెట్ట వలెననే కోరికను ఒక్కసారిగా వదలిపెట్టలేను. నేను దోషరహితుణ్ణి కాలేకపోయినా ఆత్మహత్య మాత్రం చేసు కోలేను. అలా చేయడం మంచిది కాదని గూడా భావిస్తున్నాను, కనుక రెండవవానిలోని చెడు ను చూచి అతడు దండనార్హు డని ఎలా భావించను?"

"నిజమేమంటే విశ్వమంతా భగవత్స్వరూపం, నేను ఏమీ కాను" అని అనుకోవడం ఒక శ్రద్ధ మాత్రమే. నిజంగా మనం ఆ స్థితికి చేరలేదు. ప్రస్తుతం మనమున్న స్థితి రాగద్వేష హింసా విభేదభావ మిశ్రిత మైనది. తెలిసియో తెలియకనో మనం అదే విధంగా ప్రవర్తిస్తున్నాము. మనకు అసలు వస్తువు ఒక్కటేనన్నే దృఢ విశ్వాసం ఉన్నది గనుక ఆ స్థితిని పొంద డానికి ప్రయత్నం చేయాలి. అహింసను పరమధర్మమని భావించి జీవితంలో సాధనను ప్రారంభించినప్పుడే అది సంభవం అవు తుంది. దానినే సహాయంగా తీసుకొని జీవితంలోని ఇతర వ్రతాలకూ, ధర్మాలకూ, సమాజ నిర్మాణ సాధనాలకూ

సంబంధించిన సాధనాలను వెదుకుదాము. హింసించుట, దుష్టులను దండించుట మొదలైనవానిని దీనిలో కలిపితే, ఆ పనులు చేయడానికి అధికారులం అని అనుకొంటే మనలోని నిష్ఠ పాండిత్యం క్రిందకు మారుతుంది.

భగవంతుణ్ణీ ఆత్మనూ అంగీకరించే ఇతర వాదాల వారికీ గాంధీజీకీ మధ్య ఉన్న సిద్ధాంత భేదం ఇదే. అధికార, సంప్రదాయ, జాతి, ధన, దేశభేదాలననుసరించి ఏదో రూపంలో హింస, ద్వేషాదులను ప్రచారం చేయడం, తదనుసారంగా, ఆసురీ ధర్మ ప్రచారం చేసేవారిని సంహరించడం, సత్పురుషులను రక్షించడం మొదలగు పనులన్నింటినీ చేసే అధికారం తనకు ఉన్నట్లు భావించడం మొదలైన వాని నన్నింటినీ ఇతరులు అంగీకరిస్తున్నారు. ఆత్మవాదానికి గల సరియైన అర్థం-సారం అది అని అంటున్నారు. కాని గాంధీగారు ఆత్మధర్మానికి అంత అర్థాన్ని గ్రహించడం లేదు.

ఇక మార్క్సు భూమిక ఏదో ఆలోచిద్దాము.

## * మార్క్సు వాదం

నాకు అర్థమైనంతవరకు గాంధీజీ, మిగతా బ్రహ్మవాదులు

* మార్క్సు, మార్క్సు వాదమని అన్న చోట నల్లా మార్క్సు సిద్ధాంతాలకూ, తరువాత అమలులోనికి వచ్చిన మార్క్సు వాదానికీ గల భేదాన్ని గుర్తించడంలో పొరపాటు చేశానేమో !! గాంధీజీ సిద్ధాంతాలకూ, గాంధీ

అంగీకరించినట్లుగానే మార్క్సువాదులు గూడా సమస్త సృష్టికీ బీజరూపంలో ఒకే ఒక తత్త్వమున్నదని అంగీకరిస్తున్నారు. మార్క్సువాదుల దృష్టిలో ఆ తత్త్వం చేతన తత్త్వంగానీ పరమాత్మ తత్త్వంగానీ కాదు. అది జడప్రకృతి తత్త్వమే. బ్రహ్మ వాదులు జడం చైతన్యం మీద ఆధారపడి ఉన్నదని అంటారు. చైతన్యంలో అంతా ఉత్పన్నమై, పెరిగి, లయాన్ని పొందు తున్నది. అందుకు వ్యతిరేకంగా మార్క్సు చైతన్యమే జడంలో నుండి ఉత్పన్నమవుతున్నదని అంటున్నాడు. జడంలో నుండియే చైతన్యం ఉత్పన్నమై, దానిని ఆధారంగా చేసుకొనే పెరిగి, చైతన్యం నష్టమై పోయినా జడ ప్రకృతియే ఉండిపోయి నెమ్మది నెమ్మదిగా మారి పోతున్నది.

సృష్టి చరిత్రను పరిశీలించి చూస్తే తెలిసేదేమంటే భూమి మొదట సూర్యునివలె మండుతూ ఉండే అగ్ని పిండం గా ఉండేది. కొన్ని కోట్ల సంవత్సరాలు గడచిన తరువాత దానిలో ఎన్నో చైతన్యం గలిగిన పదార్థాలు ఉత్పన్నమైనవి. అవి ఏ క్రమంలో ఉత్పన్నమైనదీ, అవి ఎలా వికాసాన్ని

---

వాదం పేరుతో ప్రబలిన సిద్ధాంతాలకూ భేదం ఏరపడినట్లుగానే, మార్క్సు సిద్ధాంతాలకూ మార్క్సువాద సిద్ధాంతాలకూ భేదమున్నదని వింటున్నాను. మార్క్సు వాదాన్ని అవలోడనం చేసిన పండితుడుగా నేనీ పుస్తకాన్ని వ్రాయడం లేదు.

పొంది పొంది వనస్పతులు, జలచరఖేచరభూచరాలుగా మారిన
దీ, చివరకు మనుష్యుడు ఎలా ఉద్భవించినదీ ఈ చరిత్ర అంతా
మనకు దొరుకుతున్నది. ఆకాశంలో ఉండే గ్రహాలూ, నక్ష
త్రాలూ మొదలైన వానిలో చైతన్యమయమైన సృష్టి ఎన్నిం
టిలో ఉన్నదో సందేహంగానే ఉన్నది. కొన్నింటిలో అసలు
ఆ చైతన్యం ఉన్నట్లే కనపడడం లేదు. కనుక వీటినన్నింటినీ
బట్టి, మూలవస్తువు జడప్రకృతియే అని అంగీకరించక తప్పదు.
ఆ ప్రకృతియే అద్భుత యంత్రంవలె వికాసాన్ని పొంది పొంది
ఒక రసాయన పదార్థంగా మారుతున్నది. ఆ పదార్థాన్ని తెలుసు
కొనే, అర్థం జేసుకొనే, ఆలోచించే, వృద్ధిని పొందే, జీవశక్తి
గల చైతన్యమని అంటున్నాము. ఈ గుణం జడంలో తరువాత
ఉత్పన్నమైనది. కొన్ని యంత్రాలు తమ గమనాన్ని తాము
రికార్డు చేసుకొంటవని మనకు తెలుసును. ఎక్కడనైనా పొర
పాటు జరిగితే ఆ యంత్రాలు ఆగిపోయి యాంత్రికుని దృష్టిని
తమ వైపుకు ఆకర్షించుకొంటున్నవి. ఆ యంత్రాలు తమ అవస
రాన్ని బట్టి తమగమనాన్ని తామంతట తామే హెచ్చించితగ్గించు
కొంటున్నవి. కొన్ని విమానాలు నడిపేవాడు లేకుండానే గమ్య
స్థానానికి వెళ్ళివస్తున్నవి.అయినా వాటిని మనం చేతన పదార్థమని
అనము. అదే విధంగా మనుష్యుడుగానీ జంతువులుగానీ చైతన్య
విలసితములుగా కనిపించేవన్నీ ప్రకృతివలన ఉత్పన్నమైనవే.
బయటి అనాది చేతనతత్వం దానిలో కలిసిఉన్నదని । తప్పని

సరిగా అనుకోవలసిన అవసరంలేని చోట గూడా చైతన్యం ప్రధానమైన ఆధారతత్వ మనీ, జడం తరువాతిదనీ, ఆ చైతన్యాన్ని ఆశ్రయించుకొని ఉండేదనీ అంగీకరించవలసిన అవసరం మాత్రం ఏమున్నది?

చిన్న చిన్న అణువులు మొదలుకొని పెద్ద పెద్ద ప్రాణులు సైతము, అందరికంటే బుద్ధిమంతుడుఅని అనుకొనబడే మనుష్యులు సైతము ప్రకృతికి సంబంధించిన బొమ్మలే. ప్రకృతిలో పుట్టి, పెరిగి నశించేవారే. పెరుగుతూ ఉన్నంతకాలమూ జీవధారులు బుద్ధి గలిగినట్లుగా కనపడుతున్నారు. అవన్నీ ఆగంతుక ధర్మాలు. సిద్ధాంత దృష్టిలో మట్టిబొమ్మలు నిర్మాణమైనా, విరిగి పోయినా ప్రాణంగల బొమ్మలు ఏర్పడినా, ఏర్పడక పోయినా ఆ రెండింటిలో భేదమేమీ లేదు. ఏ విధంగా మట్టి బొమ్మ విరిగినా, సరిగా ఉన్నా పాపపుణ్య, సదాచార దురాచార విచారణ చేయమో, అదే విధంగా వీటి విషయంలో గూడా అలాంటి ఆలోచన చేయవలసిన అవసరంలేదు. పనిని దృష్టిలో పెట్టుకొని ఎప్పుడు ఎలాంటి విషయం తగినదో దానిని గురించి ఒక పద్ధతిని (పాలసీని) నిర్ణయించవలసివస్తే అది వేరు విషయం, కాని ఆ విషయమై పాపపుణ్య సత్యాసత్య, హింసాహింసల విచారణ నిరర్థకము.

మార్క్సువాదంలోని ఈ భాగం చార్వాకుని సిద్ధాంతంతో సరితూగుతున్నది. అంతేగాక సాంఖ్యవాదులూ, వేదాంతు

లూ గూడా ఏదో రకంగా ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తూనే ఉన్నారు. కాని మార్క్సువాదం అంతతోనే ఆగక ఇంకా ముందుకు సాగుతున్నది.

ఈ సృష్టిలో జీవితం వికాసాన్ని పొందగా పొందగా మనుష్యజాతి ఉద్భూతమైనది. వర్తమాన యుగంలో వికసించిన ప్రాణి మనుష్యుడే. మనుష్యజాతి వికాసచరిత్ర ఒక పెద్ద చరిత్ర అయినది. ఈ చరిత్ర ఎంతో అద్భుతంగా ఉంటున్నది. ఆ చరిత్రలో మనుష్యజాతి ఏ క్రమంలో పెరుగుతున్నదో, అభివృద్ధి పొందుతున్నదో స్పష్టపరచబడిఉన్నది. దానిని తెలుసుకుంటే ముందు మనుష్యుడు ఏ వైపుకు సాగనున్నాడో స్పష్టంగా తెలుసుకొనగలము. కారల్ మార్క్సు నిశ్చయించినా నిశ్చయించక పోయినా మార్క్సువాదులు మాత్రం మనుష్యజాతి భవిష్యత్తు నిశ్చితమైనదనే భావిస్తున్నారు. ఏ దోవలో ప్రయాణం, చేసినా ఏ విధంగా ప్రయాణం చేసినా మానవజాతి ఆ నిశ్చితభవిష్యత్తుకు— గమ్యస్థానానికి— చేరి తీరుతుంది అని వారి నిశ్చయం.

దీనిని బట్టి మార్క్సువాదులను నియతి ( విధి ) వాదులని గూడా అనడం జరుగుతున్నది. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి "యదభావి నతద్భావి భావి చేన్నతదన్యథా" అన్నట్లు కానిది కాదు, కావలసినది అయి తీరుతుంది అనే దానికి బలంచే కూరుతున్నది. ఇక్కడ నియతివాదమంటే ఏ క్షణంలో మానవ

జాతిలో ఏ ఘటన జరుగుతుందో అది ముందే బ్రహ్మలేఖవలె నిశ్చితమయి ఉంటుందని అర్థం కాదు. ఫలానాస్థితి నుండి మానవ జాతి ఫలానిస్థితికి చేరుతుంది, తదనుగుణ్యమైన ప్రవృత్తి ప్రగతులను పొందుతుంది అని మాత్రమే ఇక్కడ అర్థం. ఈ భవిష్యత్తును తొలిగించివేయడానికి, దూరంగా తోసివేయడానికి చేసే ప్రయత్నాలన్నీ నిరర్థకాలే. అందువలన ప్రయోజన మేమీ లేదు. అందుకు వ్యతిరేకంగా చేసే ప్రయత్నాలన్నీ వ్యర్థమయ్యేవే, గనుక తొందరలో ఆ భవిష్యత్తును పొందడానికి తగిన ప్రయత్నాలనే మనుష్యుడు చేయాలి. అప్పుడు తొందరలో భవిష్యదధ్యాయం ప్రారంభమవుతుంది.

నియతి వాదంలోని ఈ శ్రద్ధ మార్క్సువాదులకు ఎంతో ప్రేరణను కలుగజేస్తున్నది. వారు ఈ రోజు చేసేపని అంతా నిశ్చితమైన ఆ మానవ భవిష్యత్సిద్ధి కొరకే. అనగా వారు ప్రకృతి నియమాలను ఉపాసిస్తున్నారు. ఆ శ్రద్ధతోనే ముందుకు సాగుతున్నారు.

ఈ నియతివాదం మన దేశానికి కొత్తది కాదు. శ్వేతాశ్వతరోపనిషత్తులోనూ, మహాభారత, యోగవాసిష్ఠాలలోనూ దీనిని గురించిన చర్చ ఉన్నది. మహమ్మదీయ మతంమీద గూడా దీని ప్రభావం పడినది. పైన ఉల్లేఖింపబడిన సంస్కృత శ్లోకం హితోపదేశంలోనిది. కాని మార్క్సువాదులు అంత

కంటే ముందుకు పోతున్నారు. వారు మానవజాతి చరిత్రను చదివి ఈ "నియతి" ని నిశ్చయించారు.

ఇప్పుడు వస్తూఉన్న యుగం పూంజీవాదాన్ని నశింపజేసే యుగం. వ్యక్తిగతమైన ఆస్తి లేని వారి యుగం భూములులేని శ్రామిక వర్గోదయ యుగం. శక్తి యుగం గడిచిన యుగంలో రాజుల, ధనవంతుల అధికారం చెల్లింది. వారి ఆధిపత్యంలో సాధన హీనమైన శ్రామిక వర్గం అర్ధాకలితో బానిసత్వాన్ని అనుభవించింది. ఇప్పుడు ఆ శ్రామిక వర్గ ప్రభుత్వం క్రింద శక్తి వంతాలైన రాజ్యాలు ఏర్పడనున్నవి. యంత్రాలను, పరిశ్రమలను ఇదే విధంగా వారు గూడా నడుపుతారు. కాని వానివలన లభించే ఫలం వారి వర్గానికే ఎక్కువగా చెందుతుంది. వ్యక్తిగతమైన ఆస్తి ఉండనే ఉండదు. ఒకవేళ ఉన్నా ఆ ఆస్తి ఉన్నవారు ఇది వరలో శ్రామిక వర్గం ధనికవర్గపు దయాదాక్షిణ్యాల మీద ఎలా ఆధారపడి ఉండేదో అదే విధంగా శ్రామికవర్గ దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి ఉంటారు. ఆ ఆస్తి ఉన్నందుకుగాను ఆ జమీందారు ప్రతి ఫలం గూడా చాలా చెల్లించవలసి ఉంటుంది. ఈ విధంగా శ్రామిక వర్గం మీద మానవజాతి భవిష్యత్తు ఆధారపడుతుంది. కనుక శ్రామికవర్గమే ఈ యుగానికి ప్రభువు. ఈ ప్రవాహాన్ని ఆపడానికి చేసే ప్రయత్నమంతాగంగా ప్రవాహాన్ని అరచేత్తో ఆపడానికి చేసే ప్రయత్నంలాగా నిరర్ధకమైపోయేదే.

ఇలాంటి యుగం స్థాపితమై, ఉన్నత శిఖరాలకు చేరి నప్పుడు మార్క్సువాదులు ప్రపంచమందంతటా శాంతి ఏర్పడు తుంది అని అభిప్రాయపడుతున్నారు. అప్పుడు ఈ వర్గ భేదాలూ ఈ లాభదృష్టీ, ఈ చిన్న పెద్ద తారతమ్యాలూ ఉండవు. ప్రపంచం లోని మనుష్యులందరూ ఒక్కటిగా చూడబడతారు. దానికి పరిణామస్వరూపంగా అహింస ఏర్పడుతుంది. రాజ్యతంత్రా నికి సంబంధించిన పనికి రాని విషయాలుండవు. ఆదర్శవంత మైన అరాజకత్వము (అనగా ప్రభుత్వం లేకుండానే మంచి రాజ్యవ్యవస్థ) ఏర్పడుతుంది. గాంధీజీ అలాంటి వ్యవస్థను ఆశిస్తే అది కమ్యూనిజం స్థాపించబడిన తరువాతనే ఏర్పడుతుం ది. ముందు ఏర్పడదు. అంతవరకు హింసగానీ అహింసగానీ ఏది మాకు ఉపయోగపడితే దానిని ఉపయోగిస్తాము. తెలివి తక్కువవల్లగానీ, దుర్మార్గపుటాలోచనల వలన గానీ ఈ సిద్ధాం తాన్ని వ్యతిరేకించే వారిని నశింపుచేయక తప్పదు. శ్రామిక వర్గా న్ని సంఘటిత పరచవలెను. ధనికవాదుల శక్తిని నాశనంచేయవలసిం దే. అందుకుగాను దేశవ్యాప్తంగా హర్తాళ్ అనే మహాస్త్రాన్ని ఉపయోగించ వలసిందే. శత్రువులనందరినీ మార్గంలో నుండి ఏరి తొలగించి వేయాలి. ఇదే నిజమైన పని. అసలు చేయ వలసిన పని అదే. ధర్మాధర్మములనీ, నీతి అవినీతులనీ అనేవనీ అమాయకత్వాన్నీ మోసాన్నీ సూచింపజేసేవే. ఈశ్వరుడనీ

మతమనీ చెప్పేదంతా మోసమే. మత్తుమందును ఇవ్వడమే. అవన్నీ స్వార్థసిద్ధికి ఉపయోగించే తమాషామాటలే.

గాంధీజీ ఈశ్వరుడనే, మతమనే శబ్దాలను ఉపయోగించి ధనికవాదుల మోసానికి ఎక్కువగా సహాయం చేశారు. అరాజకత్వపు ఆదర్శమున్నా అహింసమీద పట్టు బట్టి మధ్య రావలసిన విప్లవం రానవసరం లేనట్లు ప్రవర్తించారు. ఇంతేగాక ఆయన మానవజాత్యభివృద్ధికి దోహదం కలుగజేసే యంత్రపరిశ్రమను కాదని అభివృద్ధి నిరోధకములైన చరఖా, గ్రామపరిశ్రమలనే యుగనిరోధకాలైన ప్రణాళికలను తయారు చేశాడు. అందువలన ఆయన సఫలుడు కాలేదు. గాంధీవాదం గూడా అందువల్ల అసఫలమయిపోయింది.

ఈవిధంగా సామ్యవాద దృష్టితో ఆలోచిస్తే గాంధీ వాదం అన్ని విధాలా తప్పువాదమవుతుంది. దాన్ని సామ్యవాద మనడానికి వీలులేదు. దానిలో అహింస ఉన్నది. ఆ అహింస ఎప్పుడో— ఎక్కడో— భవిష్యత్తులో మాత్రమే దృష్టిగోచర మవుతుంది. ఇదేగాక గాంధీవాదాన్ని సామ్యవాదమని అనడానికే వీలులేదు. దానిలో మతమనీ, ఈశ్వరుడనీ పిచ్చి పిచ్చి శబ్దాలన్నీ ఉపయోగింపబడినవి. ఈ శబ్దాలవల్ల ధనికతత్వం బలపడడానికి మాత్రమే అవకాశం ఉన్నది. శస్త్ర బలం లేనిది రాజ్యం నడవదు. శాస్త్ర బలం లేనిది విప్లవం

రాదు. విప్లవం లేనిది సామ్యవాదం ఏర్పడదు. కనుక సామ్య వాద స్థాపనకుగాను శ్రామికవర్గనియంతృత్వాన్ని నిర్మిం చాలి. ఆ నిర్మాణం కొరకు శస్త్రాస్త్రాలను ఉపయోగించే విప్లవాన్ని తీసుకొని రావాలి. ఇది వారి అభిప్రాయం.

మార్క్సువాద సిద్ధాంతాన్ని సరిగ్గానే వ్యక్తపరచానను కొంటాను.

## సదాచారపు పునాదులు

వెనుకటి ప్రకరణాలలో గాంధీవాద సామ్యవాదాల పునాదులలో నిహితమై ఉన్న తత్వాన్ని తెలుసుకొన్నాము. ఆత్మను అంగీకరించేవారంతా అసత్యము, హింస మొదలైన వానిని నిషేధించరని గూడా తెలుసుకొన్నాము. తమాషా ఏమంటే ఈశ్వరునీ, ఆత్మనూ, చైతన్యాన్ని ఏ మాత్రమూ అంగీకరించని కొంతమంది నాస్తికులు నైతికప్రవర్తన, సదా చారము మానవుని ముఖ్య ధర్మములని విశ్వసించి సాధన శుద్ధి విషయంలో అమిత శ్రద్ధను కలిగిఉన్నారు. అలాంటి వారు ఇప్పుడుగూడా కనపడుతున్నారు. అయితే ఈ అహింస, సత్యము సదాచారము అనే వాటికి ఆధారం ఏమిటి? అని ప్రశ్నవస్తుంది. ఆ ఆధారాన్ని గురించి నాలుగు వాక్యాలు వ్రాస్తాను.

జడవాద చైతన్యవాద శబ్దాలను క్షణకాలం మరచి పోదాం. అయినా మనం నివసించే ఈ జగత్తులో జీవనం అనగా

చేతనాత్మక సృష్టీ, దానితోబాటు దానినంటుకొని ఉన్న జడ తత్వం— ప్రకృతీ— రెండూ ఉన్నవని ప్రతి ఒక్కడూ అంగీకరిస్తాడు. జడంతో కలసియున్న చేతన సృష్టిలోని ఒక భాగమే మన ఈ మానవజాతి. ఈ జాతి ప్రపంచ మందంతటా వ్యాపించి ఉన్నది. శరీర నిర్మాణదృష్టితో చూస్తే ఈ జాతిలో కొన్ని రూప భేదాలు కనపడుతున్నవి. రూపు రేఖలూ, ఆచార వ్యవహారాలూ, భాషలూ, మతాలూ, అభిరుచులూ, అన్నీ వేరు వేరై ఈ జాతి అనేక దళాలై పోయింది. ఈ దళాలు జన్మననుసరించీ, మతాన్ననుసరించీ, దేశాన్ననుసరించీ, చేసే వృత్తిననుసరించీ, రాజ్యాంగ నిర్మాణాన్ని అనుసరించీ, భాషలననుసరించీ ఇలాంటి అనేక సాధనాల ననుసరించి వేరు వేరుగా ఏర్పడినవి. వీటి నన్నింటినీ ఆలోచించి చూస్తే పరిణామ స్వరూపంలో మనుష్యజాతి ఒక్కటి కాదనీ, అది అనేక జాతులలో విభక్తమై ఉన్నదనీ, ఒక దానితో ఇంకొకటి కలిసే స్థితిలో అది లేదనీ కొంతసేపు మొదట్లో మనకు అనిపిస్తుంది.

కాని మనుష్యజాతిలో కనిపిస్తూ ఉన్న ఈ విభేదాలన్నీ పై పైన ఉన్నవేనని అనుభవం, చరిత్ర మనకు చెప్పుతున్నవి. అందరిలోనూ ధర్మమునకూ, వికాసమునకూ సంబంధించిన లక్షణాలు మనకు కన్పిస్తున్నవి. అందరు వ్యక్తులలోనూ, అన్ని జాతులలోనూ, ఉపజాతులలోనూ వికాస విలయాలు సమాన

క్రమంలోనే ఉన్నట్లు స్పష్టంగా కనపడుతున్నవి. ఉదాహరణకు తీసుకొంటే అన్ని జాతుల మధ్యా శరీర సంబంధం ఏర్పడ డానికి అవకాశం ఉన్నది. నలుపు, ఎరుపు, తెలుపు, పొడవు, పొట్టి అనే వానిని ఆధారంగా తీసుకొని ఏర్పడిన మనుష్య విభేదాలు, అవే ఆధారంగా ఉన్న ఆవులు, ఎద్దులలోని విభేదాల కంటే విభిన్నమైనవి కావు.

ఇదేగాక మానవులందరిలోనూ బౌద్ధిక వికాస, హృదయాలూ ప్రేమ, క్రోధాదిగుణాలా, బౌద్ధిక సంస్కారాలూ అన్నీ సమానంగానే ఉంటున్నవి. సత్పురుషులూ, అసత్పురుషులూ, వీరులూ, పిరికివారూ, తెలివిగలవారూ, తెలివిలేనివారూ అన్ని జాతులలోనూ పుట్టుతూనే ఉన్నారు. అన్ని దళాలూ అనుకూల పరిస్థితులు లభిస్తే విశాలమైన సామ్రాజ్యాలను స్థాపించ గలుగుతూనే ఉన్నవి. బౌద్ధిక వికాస, పరాక్రమ, సద్గుణా దులలో పేరు ప్రఖ్యాతులను సంపాదించగలుగుతున్నవి. భోగవిలాసాలలో మునిగిపోయి చివరకు అధఃపతితాలై పోగలు తున్నవి గూడాను.

వేరు వేరు వైజ్ఞానికులు జీవిత వికాస విలయ క్రమ చరిత్రను గురించి వేరు వేరు పద్ధతులలో ఆలో చించారు. ఒకడు వ్యక్తిగత శారీరక వికాసాన్ని గురించి ఆలోచిస్తే, మరొకడు మనోవికాసాదులను గురించి ఆలోచిం

చాడు. ఒకడు మానవనిర్మితమైన సమాజాన్ని గురించి ఆలో చిస్తే మరొకడు సమగ్రజాతిని గురించి ఆలోచించాడు. సామా జిక వికాసాన్ని గురించి ఒకడు రాజకీయం గానూ, ఇంకొకడు సాంఘికంగానూ, మరొక్కడు ఆర్థికంగానూ, ఇంకొకడు ధార్మికం గానూ ఆలోచించారు. వ్యక్తికంటే సమాజం ఎక్కువ కాలం వరకు నిలవగలదు. వ్యక్తి తన సంతానంకొరకు సుగుణ దుర్గు ణాది కార్యసముదాయాన్ని వదలితే అతని వంశజుడైన ఇంకొ కడు వాటిని పెంచి ముందుకు తీసుకొని పోతున్నాడు. వ్యక్తి మరణిస్తాడు. కాని తన మంచి లేక చెడు బీజాలను వదలి పోతాడు. అందువలన కొన్ని వాదాలు వ్యక్తికంటే సమాజా నికి ఎక్కువ ప్రాముఖ్యతనిస్తున్నవి. వ్యక్తిని సమాజమనే కాళ్ల జెర్రి తాలూకు ఒక కాలునుగా భావించి గౌణాస్థానాన్నిస్తు న్నవి. తన ప్రాణరక్షణ కొరకు ఏ విధంగా కాళ్లజెర్రి తన కొన్ని కాళ్లు విరిగిపోవడానికి అంగీకరిస్తుందో అదే విధంగా సమాజహితం కొరకు కొంతమంది వ్యక్తులు బలి అయిపోయినా ఫరవా లేదని వారి అభిప్రాయం. కొంత మంది వ్యక్తికే ప్రాధాన్యాన్నిచ్చారు. వ్యక్తికొరకే సమాజ నిర్మాణం జరుగు తుందని భావించి వ్యక్తివికాస చరిత్రను అధ్యయనం చేశారు.

దీనిని బట్టి మానవజీవితాన్ని సమగ్రంగా చూచే దృష్టి ఏ ఒక్కడికీ లేదు అని తెలుస్తున్నది. ఏనుగ— గుడ్డివాళ్ల కథ లాగా ఎవరికో ఏ కొద్ది భాగమో కనిపిస్తే అదే సర్వస్వమని

వారు భావించి కూర్చుంటున్నారు. పూర్ణ దృష్టి కనపడడం లేదు. అయినా ముండకోపనిషత్తులో చెప్పినట్లుగా—

అవిద్యాయామంతరే వర్తమానాః స్వయం ధీరాః పండితం
మన్యమానాః
జంఘన్యమానాః పరియంతి మూఢాః అంధేనైవనీయమానా
యథాంధాః

అవిద్యాయాం బహుధా వర్తమానా వయంకృతార్థా
ఇత్యభిమన్యంతి బాలాః
యత్కర్మిణో న్రప్రవేదయంతి రాగా త్తేనాతురాః
క్షీణలోకాశ్చ్యవంతే

(అజ్ఞానులై గూడా తెలివిగల వారమనుకొంటూ, పండితుల మనుకొంటూ ఆ మూర్ఖులు అన్ని విధాలా హానిననుభవిస్తూ గూడా అంధుని వెనుక తిరిగే అంధులులాగా దోవ తప్పి తిరుగు తున్నారు. అజ్ఞానంలో ఉండి గూడా ఆ మూర్ఖులు మేము కృతార్థులమైనామని అనుకొంటున్నారు. కర్మశీలులై, రాగాతురులై వారు సత్యాన్ని తెలుసుకోవడం లేదు. ఆ కారణం వలన దుఃఖితులై పుణ్యం క్షీణించిపోగానే క్రిందకు పడి పోతు న్నారు, ఇంతేకాదు. నరసింహ మెహతా ఏమన్నాడంటే—

గ్రంథ గరబడ కరీ, బాత నకరీ ఖరీ
జేహనే జే గమే తేనే పూజే

మన కర్మ వచనధీ ఆఫ్ మానీలపే

సత్యచే జమన ఏమసూపిరేఘ

గ్రంథాలలో గడబిడచేయబడి నిజమైన విషయం చెప్పబడడంలేదు. ఎవరికి ఏది ఇష్టమైతే దానినే వారు పూజిస్తున్నారు. తాము చెప్పినదే సత్యమని వారు మనో వాక్కాయ కర్మలా విశ్వసిస్తున్నారు.

తమకు తెలిసినదే సత్యమనీ, అదే సరియైనదనీ అందుకు భిన్నమైన అభిప్రాయాలు గలవారు అజ్ఞానులనీ, మోసగాళ్లనీ దుష్టులనీ, రాక్షసులనీ వారిని వ్యతిరేకించడం, అవసరమైతే వారినీ, వారి భావాలనూ నాశనం చేయడం అవసరమనీ, అది తమ కర్తవ్యమనీ కొంతమంది భావిస్తున్నారు. మహాభారతాది ఉద్గ్రంథాలు తాటి ఆకులమీద వ్రాయబడి, ఆ ఆకులన్నీ నలువైపులా చెల్లా చెదరైపోతే ఏవో కొన్ని దొరికిన వాటిని చదివి, వాటిని ఆధారంగా తీసుకొని సంపూర్ణ గ్రంథాన్ని గురించి ఒక అభిప్రాయాన్ని నిర్ధారణ చేసుకొనడం ఎంత నిరర్థకంగా ఉంటుందో, విజ్ఞాన శాస్త్రాన్ని లేక చరిత్రను మాత్రమే చదివి సంపూర్ణ మానవ జీవితాన్ని తెలుసుకొనుటకు చేసే ప్రయత్నంగూడా అంత నిరర్థకమే. * ఆశాస్త్రాలూ, ఆ గ్రంథాలూ గొప్పవే. వాటి వలన మనకు లభించే జ్ఞానంగూడా

---

* మేక ది అడనోడ రచించిన అలిగ్జస్ కెరోల్ అనే ఆయన గొప్ప పర్జను. పర్జరీలో కొత్తవిషయాలను కనిపెట్టిన ఆయనకు నోబుల్

గొప్పదే. అయినా ఆజ్ఞానంకంటే ప్రత్యక్ష జీవితానుభవం వలన లభించే ఆనందం ఇంకా గొప్పది. వేల కొలది గ్రంథాలను చదవడం కంటే ప్రత్యక్ష జీవితానుభవమూ, జీవిత సూక్ష్మావలోకన మూ ఎక్కువైనవి. విజ్ఞానంలోనూ చరిత్రలోనూ కూడా అనుభవ సిద్ధమైన వానిమీద అభిప్రాయ భేదాలు ఉండనే ఉండవు. ఊహల వలనా, తర్కం వలనా నిర్ధరించబడిన భాగాల వల్లనే ఇలాంటి వేరు వేరు వాదాలు ఉత్పన్న మవుతున్నవి.

ప్రతి మనుష్యుడూ వృద్ధి పొందడానికీ, ముందుకు సాగ డానికి ప్రయత్నిస్తున్నాడని లోకానుభవం చెప్పుతున్నది. ప్రతివ్యక్తీ అజ్ఞానాన్నుండి జ్ఞానం వైపుకూ, పరావలంబనం

---

* బహుమతి లభించింది. ఆయన వ్రాసిన వాక్యాలను చదవండి.

సజీవ ప్రాణులకు సంబంధించిన— ముఖ్యంగా మానవజాతికి సంబంధించిన విజ్ఞానం ఎక్కువ అభివృద్ధిని పొందలేదు. అక్కడక్కడ తెలిసిన చిల్లర విషయాలు మాత్రమే ఇంతవరకు నిర్ణయింప బడినవి...... ఆ విషయంలో మనకేమీ తెలియదనడంలో అతిశయోక్తి లేదు. మానవ శాస్త్రాన్ని అధ్యయనం చేసేవారికి కలిగే సందేహాలకు సరియైన సమాధానం ఇవ్వడానికి అవకాశం లేదు. మనశరీరంలోని లోపలి భాగాలు అనేకం ఇంకా మనకు అజ్ఞాతంగానే ఉన్నవి. అనేకమైన భౌతిక, మానసిక పరిస్థితుల వలన మన సుఖ దుఃఖాలు నిర్ణీత మవుతవనేమాట నిజం. కాని ఆపరిస్థితులేమిటో అది ఇంకా మనకు తెలియలేదు. ఉన్నత సంస్కారవంతుణ్ణి తయారు చేయడానికి ఏ పరిస్థితి అనుకూలమైనదో మనకు బోధపడలేదు.........

నుండి స్వావలంబనం వైపుకూ, నిరాశనుండి ఆశ వైపుకూ, దుఃఖంలో నుండి సుఖం వైపుకూ సాగవలెనని ప్రయత్నం చేస్తు న్నాడు. ఒక వేళ ఎవడైనా వెనుకకు పోతున్నాడంటే అది గూడా ముందుకు సాగడానికే. దూరం దూకడానికి ఆటగాడు వెనుకకు వెళ్లుతాడు. అంతేగాక ఏ మనుష్యుడూ మోస పడవలె ననికోరడు. ప్రతివాడూ సత్యాన్ని తెలుసుకొనవలెనని కోరుతాడు. అతనికి తిరస్కారం అక్కర్లేదు. ప్రేమ కావాలి. అన్యాయాన్నీ బలాత్కారాన్నీ చూచి అతడు సహించలేడు. న్యాయాన్నీ, సద్వర్తననూ అతడు అభిలషిస్తాడు. అతడు భయపడకుండా నిర్భయంగా ఉండవలెనని కోరుతాడు.

జీవితానుభవం వలన మనుష్యునికి సమాజంతోనూ, తన కుటుంబము, దేశము, జాతి మొదలైనవానితోనూ ఉన్న సంబంధం బాలక— మూఢ— దశలో స్వార్థపూరితమైన దేనని తెలుస్తు న్నది. అతడు సమాజంలోనే ఉన్నా ఆ సమాజాన్ని తన పనిని పూర్తి చేసే సాధనంగా భావిస్తున్నాడు. పిల్లవాడు తన భోజన భాజనాలకూ, ఆటపాటలకూ, తల్లి దండ్రులను సాధన మాత్రంగా భావిస్తున్నాడు.

మధ్యమ దశలో వ్యక్తికి సంఘానికి ఉన్న సంబంధం ఇచ్చి పుచ్చుకొనే సంబంధమయి పోతున్నది. ఒకప్పుడు సంఘం వలన వ్యక్తికి లాభం కలుగుతున్నది. ఒకరి వీలును ఇంకొ

కరు గుర్తించి పరస్పరాభివృద్ధికి ప్రయత్నం చేయబడుతున్నది. అందువలన వ్యక్తి సమాజాన్నిగానీ, సమాజం వ్యక్తినిగానీ ముంచి వేయవలెననే ప్రయత్నం జరుగదు. ఒకటి రెండవ దాని లాభానికి మాత్రమే సాధకమని భావించక రెండూ పరస్పర హితసాధకములని భావించడం జరుగుతున్నది. అప్పుడప్పుడు వ్యక్తి కొరకై సమాజమూ, సమాజం కొరకై వ్యక్తీ ఇద్దరూ నష్టాన్ని భరిస్తున్నారు. ఒకప్పుడు ఒక కుటుంబమంతా ఒక పిల్లవాని సంరక్షణకు లేక అతనిని చదివించుటకు నష్ట పడిపోతే ఇంకొకప్పుడు ఒక వ్యక్తి కుటుంబ సంరక్షణకై బలి అయిపోతున్నాడు. అలాంటప్పుడు గూడా మనం ఎవ్వరికో ఉపకారం చేస్తున్నామని ఎవ్వరూ భావించడం లేదు. ఎప్పుడూ ఒక వ్యక్తియే బాధపడుతూ రెండవ వ్యక్తి కృతజ్ఞతను గూడా చూపకపోతే వ్యతిరేక భావం ఉత్పన్నమవుతుంది. ఆ స్థితిలో చివరకు అసంతృప్తి గూడా ఏర్పడుతుంది. అట్లా జరగకపోతే ప్రతివాడూ తీసుకోవడం లో కంటె ఇవ్వడంలో కృతార్థత కలదని అంగీకరిస్తాడు. దానిలో అతనికొకరకమైన సాత్విక సంతోషంకలుగుతుంది. ఎందువల్లనంటే ఆశ్రిత దశలో నుండి ఆశ్రయదాతగా అతడు మారుతున్నాడన్న మాట. అదే వికాసము.

ఈ మధ్యమదశనుండి ఉత్కృష్ట స్థితివైపునకు జీవితం అగ్రసరమైనకొద్దీ వ్యక్తికీ సంఘానికీగల సంబంధం ఇచ్చిపుచ్చుకోవడాలలోనుండి ఇవ్వడం వైపుకు ఎక్కువ మొగ్గుతుంది.

అనగా ఆ రెండింటిలో సశక్తమైన వస్తువు అశక్తమైన దానికి బలాన్ని కల్పించి తనతో సమానంగా చేసుకుంటుంది గాని, అశక్తమైన దానిని లూటీ చేయడానికి ప్రయత్నించదు. బీద తనంలో నుండి ఐశ్వర్యం వైపుకు సాగడంలో జీవాత్మకు ఎలాంటి ప్రగతి కలుగుతున్నదో, భోగ విలాసాలలోనుండి సంయమం వైపుకు సాగడంలో గూడా అలాంటి ప్రగతి కలుగుతున్నది. ఈశ్వరుడు అనగా పోషకుడు, రక్షకుడు కాదలచిన వ్యక్తికి ఆత్మనిగ్రహం, సంయమం ఒక అనివార్యమైన, సంతోష ప్రదమైన ధర్మమవుతున్నది.

ఇదేగాక మానవ రూపంలో వికాసం పొందియున్న చిత్తంలో కొన్ని కొన్ని లక్షణాలు స్మృతి, ఇచ్ఛ, నిరోధము (ఇచ్ఛనూ, స్మృతినీ ఆపి ఉంచు శక్తి) సంకల్పము మొదలైనవి స్పష్టంగా కనబడుతున్నవి. మనుష్యుడు నీతి, సదాచారము, వ్యక్తిధర్మము, సాంఘిక ధర్మము, రాజకీయ పద్ధతులు మొదలైన వానిని సృష్టించినా, నశింపజేసినా అదంతా చిత్తం తాలూకు ఇలాంటి స్వభావాల, లక్షణాల పరిణామమే. నీతి, సదాచారాదుల పునాది_ ఆధారం_ గూడా ఇదే.

ఈ విధంగా ఇంకొక తత్వాన్ని మనం అంగీకరించినా అంగీకరించక పోయినా జీవితనిరీక్షణా, జీవితానుభవమూ రెండూ నీతి, సదాచారాలకు మూలాధారాలని తప్పక అంగీకరిస్తు

న్నాము. మొదటిలో మనుష్యుడు మూఢుడుగా, అజ్ఞానిగా, దీనుడుగా, సేవను అపేక్షించే వాడుగా, అసత్యము, హింస స్వార్థాదులకు వశవర్తుడుగా, భోగేచ్ఛ కలవాడుగా ఉండనే ఉంటాడు. ఈ పనులను ఉదారదృష్టితో చూడవలసిన అవసరం ఒకప్పుడు ఏర్పడినా ఈ గుణములు, ఆచరణ, ధర్మాలు మాత్రం కానేరవు. వివేక, జ్ఞాన, ఐశ్వర్య, సత్య, అహింస, సంయమ, వైరాగ్యముల వైపుకు సాగడంలోనే ధర్మమున్నది.

చేతనాత్మకమైన ప్రాణుల ఏ పెద్దస్వరూపం కనపడు తున్నదో అదే చిత్తము. ఈనాడు జగత్తులో ఎక్కువ అభివృద్ధిని పొందిన దానిస్వరూపము మనుష్యజాతి లోనే కనపడు తున్నది. సామాన్యభాషలో చిత్తాన్నే చైతన్యమనీ, ఆత్మ అనీ అంటున్నారు. నా ఆత్మ, ఆత్మవికాసము, ఆత్మకు దుఃఖం కలుగుతుంది ఇలాంటి అనేక ప్రయోగాలను మనం చేస్తు న్నాము. చిత్తము—ఆత్మ—ఎంత వికాసావస్థను పొందినదో అందుకు తార్కాణంగా మూర్తస్వరూపంలో ప్రపంచంలో శ్రేష్ఠాతి శ్రేష్ఠులైన మనుష్యులను మనం చూడగలుగుతున్నాము.

సదాచార, నైతిక ధర్మప్రతిష్ఠాపనకు గాను చైతన్యము, ఈశ్వరప్రతీతి అవసరం కాకపోయినా ఆ ప్రతీతి పరీక్షా సమయంలో మనుష్యుని ధర్మమార్గంమీద స్థిరంగా ఉంచడంలో ఎక్కువ ప్రాధాన్యం కలదవుతున్నది. దానికి పరిణామ

స్వరూపంగానే మనుష్యుడు అత్యంత నైరాశ్యప్రదమైన పరిస్థితిలో గూడా నిరాశుడు కావడంలేదు. తీవ్ర పురుషార్థ సాధకుడై గూడా పురుషార్థంవలన ఏర్పడిన గర్వాన్ని అనుభవించడంలేదు. తనమీదనే అంతా ఉన్నదనీ, తనశరీరం లేకపోతే అంతా అంధకారమేననీ అతడు మిథ్యాభిమానభూయిష్ఠుడు కావడం లేదు.

నిరాశ, అభిమానాదులనుండి సంరక్షింపబడుటకు ఈశ్వరుడు కల్పించ బడినాడని దీనికి అర్థంకాదు. ఈశ్వరుడే సత్యము. ఆసత్యము జడతత్వంలోనుండి బయలుదేరిన పరిణామం కాదు. అలాంటి ప్రతీతి విశేషనిరీక్షణ వలనా, అనుభవంవలనా, చిత్తంలో కలిగిన వివేకం వలనా లభిస్తున్నది. అది కేవలం, తర్కసిద్ధమూ బాహ్య నిరీక్షణయుక్తమూ అయిన వివేకంవలన లభించేది కాదు. ఇంతలోతుకు పోవడానికి ధైర్యమూ, తీవ్రమైన వ్యాకులతా సత్ప్రయత్నమూ అవసరమనేది నిజమే. ఈ గుణాలు కొద్ది మందిలో మాత్రమే లభ్యమవుతున్నవి. కనుక ఎక్కువమంది భక్తులు బలవత్తరమైన శ్రద్ధతో ఈశ్వరునే ఆలంబనంగా పెట్టుకొంటున్నారు.— దాదాపు శ్రద్ధనే ప్రతీతితో సమానమైన బలం గల దానినిగా చేస్తున్నారు. దానిని గురించి ఎక్కువగా చర్చించడానికి ఇక్కడ అవకాశంలేదు. ఇదిస్థానం కాదు. ఇక ఇతర విషయాలను గురించి ఆలోచిద్దాము.

# మనుష్యుని వృద్ధి క్షయములు

జ్ఞాన విజ్ఞానాలలోనూ, పరిశ్రమలు, కళ మొదలైన వాని లోనూ మనుష్యుడు తనకుకలిగిన అభివృద్ధిని వదలి తిరిగి వెనుకటి యుగం లోనికిపోవడం, అభివృద్ధివలన వచ్చిన ఫలితాలను వదలి పెట్టడం జరగదని చెప్పబడు తున్నది. ఇది కొంతవరకు నిజమూ, కొంతవరకు అప్రస్తుతమూను. నిజమైనంత వరకు అన్ని వస్తువులకూ అనువర్తిస్తున్నది.

సృష్టి స్వాభావికంగానే వెనకకు పోవడానికి వీలులేకుండా ఏర్ప డ్డది. ఋతువులు మాటి మాటికీ మారుతుంటవి. ఆకాశంలో సూర్యుడు మొదలైన గ్రహాలు ఆ రాశులలోనే మాటిమాటికి కన్పి స్తుంటవి. చంద్రుడు, పృథ్వి మొదలైన నక్షత్రాలు ప్రదక్షిణం చేస్తూ కన్పిస్తుంటవి. కాని మొదట ఆకాశంలో ఏ స్థానంలో ఉంటవో ఆ స్థానానికే తిరిగి అవి రానే లేవు. ఒక గుండ్రని మెట్టు మీదకు ఎక్కుతూ దిగుతూ ఉన్నప్పుడు మన ముఖం ఒక వైపునకే ఉంటుంది. అయినా ఎక్కనైనా ఎక్కుతుంటాము. దిగనైనా దిగుతుంటాము, కాని ఆ చోటికే తిరిగి రాము. సృష్టి ప్రయాణం చేసేమార్గంగూడా ఇదే రకంగా ఉన్నది. ఆ మార్గంలో మనం పైకి పోతున్నామో, క్రిందకు వస్తున్నామో గూడా చెప్పడం కష్టం. క, ఖ చుట్టూ ప్రయాణంచేస్తే, ఖ, గ చుట్టూ గ, ఘ చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నవి. ఈ విధంగా సృష్టి. యావత్తూ

చక్రజాలాలలోనికి లాగి వేయబడుతున్నది. స్థూల సృష్టికి గల స్థితియే జీవ సృష్టికీ, దానికి సంబంధించిన రాజనైతిక, ధార్మిక, సాంఘిక సంస్థలకూ ఏర్పడి ఉన్నది. అందువలన ఒకే సంస్థ రెండో సారి అభివృద్ధి పొందడం లేదు. రెండోది మొదటి దాని లాగా కనపడుతుంది గాని మొదటిదిగా ఎప్పుడు కాదు. అందువలన వెనకకు పోతామనే భయం కలగడం నిరర్థకం.

విజ్ఞానం లాంటి విషయాలలో వెనుకటియుగం వైపుకు పోము, సరే, నీతి లాంటి విషయాలలో వెనకకు పోతామా? మనుష్యుడు వేలసంవత్సరాల నుండి ఏఉన్నతమైన ఆధ్యాత్మిక, నైతిక గుణాలను పరిశోధించి వాటిలో సిద్ధిని సంపాదించాడో, ఆ సిద్ధినీ, ఆ అభివృద్ధినీ ఉదాసీనంగా చూడడానికి అవకాశం ఉన్నదా? బుద్ధుడు, సోక్రటీసు, కన్ఫ్యూషియస్, ఏసుక్రీస్తు, గాంధీ లాంటి ఉన్నత స్థాయికి చెందిన ధార్మిక మూర్తులు, మార్గదర్శకులూ, మహత్తర మైన వైజ్ఞానిక పరిశోధకులూ కారా? మనుష్యుడు పొందిన గుణ వికాసానికి వారు మచ్చుతునకల లాంటి వారు కారా? ప్రఖ్యాత చరిత్రకారుడు విన్‌వుడ్ రీడ్ అనే ఆయన నిరీశ్వర వాదిఅయినా గొప్ప మానవ ధర్మపరాయణుడు. ఆయన తన ది మార్టర్డమ్ ఆఫ్ మాన్ అనే పుస్తకంలో ఇలా వ్రాశారు.

"మేలు చెద్దామనే కోరిక అసలులో స్వార్థంలో నుండి ఉత్పన్నమై, పరలోకంలో ప్రతిఫలం పొందుదామనే ఆశతో

వికసించి, ఇప్పుడు మనుష్య జాతి స్వాభావిక మనః ప్రవృత్తి అయి పోయింది .......... తన ఆత్మ అనే అద్దంలో చూచుకొని, తన హృదయాన్ని సింగారించుకొనేవారూ, దానిని పవిత్రం చేసుకొనేవారూ, తమ పనులలోనూ, భావాలలోనూ పరమ శుద్ధిని పొందుటకై తమలో తాము మధనపడే వారూ, ఉత్సాహ వంతులూ అయిన సదాచారోపాసకులు ఈ నాడున్నట్లుగానే ప్రపంచంలో ఎల్లప్పుడూ ఉంటారు"

ఆయన తనను గూడా ఈ వర్గానికే సంబంధించిన ఒక వ్యక్తినిగా భావించుకొని సదాచార ధర్మ స్వరూపాన్ని గురించీ, తత్సాధనను గురించీ ఈ విధంగా వర్ణించాడు—

తన బుద్ధినీ, ప్రేమనూ ఎంత వృద్ధి పొందించు కొన గలిగితే అంత వృద్ధి పొందించు కొనడంలోనే నిజమైన ధర్మమున్నది. ఏది వ్రాయ దగినదో దానినే చేయాలి. ఏది చదువ దగినదో దానినే వ్రాయాలి. రోగులకు సాంత్వనం కలగాలి. దుఃఖవంతులకు ధైర్యం కలగాలి. అలసినవానికి ఉత్సాహం కలుగాలి. దేహమనే దేవాలయాన్ని పవిత్రంగా ఉంచుకోవాలి. మనలోనికి దివ్యత్వం రావాలి అనేకోరిక ఉండాలి. బుద్ధికి కృతజ్ఞులమై, స్వామిభక్తులమై ఉండాలి, మనకు లభించిన శక్తులకు శిక్షణనిచ్చి వాటిని మానవసేవలో ఉపయోగించాలి— మనం చేయగలిగింది ఇంతే. కనుక మన ధర్మం సత్ప్రవర్తనా, సదా

చారమూ కలిగిఉండడమే. మన ఆశలు రాబోయే సంతతివారి సుఖంలో నిహితమై ఉన్నవి. మానవుడు పూర్ణత్వం పొందడం లోనే మనకు విశ్వాసం ఉన్నది. భయం గాక ప్రేమయే మానవ జాతిని ఏకం జేయగలదు. ఒకే శ్రద్ధతో, ఒకే ఇచ్ఛతో రోగాలను పోగొట్టడానికి, పాపాన్ని నశింపజేయ డానికి, బుద్ధి పరిపూర్ణతను పొందుటకు, ప్రకృతి మీద విజయం పొందుటకు, అనంతాన్ని వెదకుటకు అందరమూ కలసి పని చేద్దాము.

అందరు మనుష్యులూ, కవులూ, అన్వేషకులూ, దాన వీరులూ కాలేరు. కాని సృష్టి అనే మహత్తరమైన పనిలో అందరూ చేరవచ్చును. ఎవడు తన ప్రకృతిని బాగు చేసుకొన గలుగుతాడో, వాడు ఏ ప్రపంచానికి తాను అంగమో, దానిని గూడా బాగు చేసుకొంటాడు. ఎవడు పురాతనమైన పశుజీవి తావశేషాలను తుదముట్టించి, తనలో రేకెత్తే దుష్ట భావాలను నశింపు చేసుకొనే ప్రయత్నం చేస్తాడో, సాంఘిక ప్రేమ సిద్ధాంతాన్ని అభ్యాసం చేస్తాడో, తన స్థితిని బాగు చేసుకొని తన సంతానాన్ని తెలివిగలదానినిగానూ, సుఖవంతమైన దానిని గానూ చేసుకొనే ప్రయత్నం చేస్తాడో, అతని ఉద్దేశ్యాలు ఎలా ఉన్నా అతనిజీవితం వ్యర్థమై పోతున్నదని అనడానికి వీలులేదు. కాని ఈ సిద్ధి తేలికగా లభించేదికాదు...... ఉత్తమగుణ సిద్ధి సామాన్యంగా లభ్యమయ్యేది కాదు.

వికాస క్రమంలో మనుష్యుడు ఒకసారి ముందుకు సాగినట్లూ, ఇంకొకసారి వెనకపడినట్లూ కనబడుతాడు. అతడు మాటిమాటికీ పొరపాట్లుచేసి, ఆ పొరపాట్లను తెలుసుకొని వాటిని సర్దుకుంటూ ముందుకు సాగడానికి ప్రయత్నం చేస్తుంటాడు. అనేకసార్లు అతడు కట్టిన కట్టడాన్ని పడదోసుకొని తిరిగి అలాంటి పాత నమూనాలోనే కట్టడాన్ని తయారు చేస్తుంటాడు. ఏకతంత్రరాజ్యాన్నుండి ప్రజాతంత్రంవరకు అతడు అనేక ప్రయత్నాలను చేశాడు. వీటినన్నింటినీ అధ్యయనంచేసి చరిత్రకారులు వెనక ముందులకు పోవడమనే తాత్కాలిక విషయాలను వదలి సమగ్రమైన అభివృద్ధి మార్గాన్ని చిత్రించడానికి ప్రయత్నిస్తున్నారు.

మానవసమాజం యొక్క ఆర్థికస్థితి ననుసరించియే సాంఘిక, రాజనైతిక, ధార్మికసంస్థలు ఏర్పడగలవనీ, మనుష్య జాతి శార్మిక నియంతృత్వం వైపునకు అగ్రసర మవుతున్నదనీ, ఆస్థితిని వెంటనే నిర్మించడం మనుష్యుని కర్తవ్యమనీ మార్క్సు చెప్పినాడు.

ఇదినిజం కావచ్చును, అందుకు ఏసాధనందొరికితే దానినే అవలంబించమని అర్థమా ? కాదు. ఎందువల్లనంటే వేలకొలది సంవత్సరాలుగా మనుష్యజాతి ఆధ్యాత్మికంగానూ, నైతికం గానూ కొంత వికాసాన్ని పొందిందని గుర్తించక తప్పదు. ఈ

యుగంలో మహాత్మాగాంధీ ఒక మెట్టును చూపిస్తే, తరువాత వచ్చే మహాపురుషుడు ఇంకొక పైమెట్టును చూపించవచ్చును. దానిని అధిరోహించ వచ్చును. ఆ మహాపురుషుడు నైతిక వికాస ప్రదర్శనంలో ఇంకొక అడుగు ముందుకు వేయవచ్చును. నియతివాదానికి ఏదైనా అర్థం ఉంటే అది నిశ్చితమైన ఈ మనుష్యధ్యేయాన్నే చూపిస్తున్నది. మార్క్సువాదుల అభిప్రాయాన్ని అనుసరించి మనుష్యుడు తేనెతుట్టెలోని తేనెటీగ లాంటి వాడు. తేనెటీగ తేనెతుట్టె రక్షణకొరకు, రాణిఈగ రక్షణకొరకు తనను తాను బలిచేసుకొంటుంది. అందువలన ప్రతి మనుష్యుడూ గాంధీగారికంటె గూడా గొప్ప మహాపురుషులు తొందరగా ఉత్పన్నులై భవిష్యద్వికాస క్రమంలో ముందుకు సాగడానికి వీలు అయ్యేటట్లుగా చూడాలి.

నైతిక పరిపూర్ణత్వం కొరకు చేసే సాధనలో ఎంతో మంది మహాపురుషులు తమజీవితాలను అర్పించిఉంటేనే అందులో ఒకప్పుడెప్పుడో గాంధిలాంటి వ్యక్తి జన్మించాడని మనంమరచిపోగూడదు. కనుక గాంధికంటే గూడా మహోన్నతుడైన మహాపురుషుడు జన్మించవలె నంటే వేలకొలది సాధకులు తపశ్చర్య చేయాలి. పురాతనకాలంనాటి నరమాంసభక్షకులైన విజేతలందరికంటే హిట్లరు గొప్పవాడై ఉండి ఆ హిట్లరుకంటే గూడా గొప్పవాడైన సూపర్ హిట్లరు ఉద్భవించాలి అనే

కోరిక మానవునిలో వికసించడం ఆరంభిస్తే నిజంగా దాని వలన మానవత్వం వికసించిందని అనుకోడానికి వీలులేదు.

ఆర్థిక, రాజకీయ లక్ష్యాలవలె నైతికలక్ష్యం గూడా ఎక్కువ ప్రాధాన్యత గలదే. ఈ రెండింటిలో ఏది గొప్పది అని ప్రశ్నవస్తే నైతిక లక్ష్యానికే ప్రాముఖ్యత నివ్వవలసి వస్తుంది. ఆ లక్ష్యానికి మనం ప్రాముఖ్యత నివ్వకపోతే మన భౌతిక లక్ష్యాలు గూడా నెరవేరవు. అసలు లక్ష్యసిద్ధిమనకు కలగదు. ఒకవేళ కలిగినా అది ఎందుకు ఉద్దేశింపబడినదో ఆశాంతిని ప్రసాదించలేదు. గాంధీజీ నైతిక ప్రవర్తనకు ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చారు. కాని మనం దానికి ఏ విధమైన ప్రాముఖ్యతనూ ఇవ్వలేదు. దానికి ఫలితంగానే మనకు స్వాతంత్ర్యం లభించినా శాంతి లభించలేదు. సామ్యవాదం స్థాపింపబడిన తరువాత గూడా అంతే అవుతుంది.

లభించిన అభివృద్ధిని వదలము అనే సిద్ధాంతం గూడా సత్యం కాదు. అది అర్ధ సత్యమే. అది నిజమైతే ఆటంబాంబులనూ, హైడ్రోజన్ బాంబులనూ, విశ్వయుద్ధాలనూ వదలడానికి వీలుండదు. అంతేగాక ఆ ఆయుధాలలో క్రూరత్వాన్ని ఎక్కువ చేయడానికిప్రయత్నం చేయవలసివస్తుంది. అంటే మొన్నటి యుద్ధంకంటే ఇంకా వినాశకరమైన పరిస్థితుల వైపుకు మనం అడుగు వేస్తున్నామన్న మాట. దానినే అభివృద్ధి అంటున్నామన్న మాట.

దీనినే అభివృద్ధి అని అనుకొనే వారు గూడా ఉన్నారు. అటువంటి ఘటనలు గూడా జరగవచ్చునేమో!! కాని దీనిని వికాసోన్ముఖత్వం అనడానికి మాత్రం వీలు లేదు. దీనివలన మనం పాఠం నేర్చుకొని చేసిన పొరపాటును దిద్దుకొని ముందుకు సాగడానికి ప్రయత్నం చేయాలి. లేకపోతే విలయమే జరుగుతుంది.

జ్ఞాన పూర్వకంగా ప్రయత్నం చేస్తే ఈ విలయాన్ని తగ్గించడంలోనే విశేషం ఉన్నది గాని విలయాన్ని దగ్గరకు తెచ్చుకోడంలో విశేషమేముంటుంది?

# వర్గోత్పత్తి, వర్గక్షయము

రాజకీయంగా, ఆర్థికంగా సంఘంలో ఏర్పాటు గావలసిన వ్యవస్థ విషయంలో గాంధీ మార్క్సు సిద్ధాంతాలలో ఉన్న భేదాన్ని తెలియజేయడం జరిగింది. మార్క్సు సిద్ధాంతానుసారంగా వర్గసంఘర్షణా, కార్మిక నియంతృత్వమూ ద్వారా వర్గాల నశింపూ, భూమి, గనులు మొదలైన ప్రాకృతిక సాధనాల మీద ప్రభుత్వాధికారమూ, జాతీయ పూంజీవాదమూ * పరిశ్రమలను ప్రభుత్వపరం చేయడమూ, జనుల జీవితంమీదా, పనులమీదా నియం

* నేను మార్క్సు వాదంతో జాతీయ పూంజీవాదాన్ని కలిపితే ఒక మార్క్సిస్టు ఆక్షేపించాడు. కనుక జాతీయ పూంజీవాదమంటే నా అభిప్రాయం ఏమిటో వివరించడం అవసర మనుకొంటాను. నాకు తెలిసినంత

త్రణా అవసరమవుతున్నవి. రెండో వైపు గాంధీ సిద్ధాంతాలున్నవి. వర్ణ ధర్మములు (వృత్తులను, కర్తవ్య కర్మలనుగా భావించి వాటిని పరిశీలించడం) సత్యాగ్రహము, పంచాయతులు, వికేంద్రీకరణ, ధర్మకర్తృత్వము, సాంఘిక జీవితంలో సాధ్యమైనంతవరకు వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని, ప్రజా స్వామ్యాన్ని స్థాపించడము మొదలైనవి గాంధీ ధర్మాలు.

---

వరకు రష్యాలో స్థూలాస్థూల సంపదల విలువలను కట్టడానికీ, చేసిన సేవకు ప్రతి ఫలాన్ని ముట్ట జెప్పడానికీ అవలంబింపబడుతున్న సాధనం ధనమే. కూలిపనికి ప్రతి ఫలం, కేవలం పనినిక్కొలిచీ, అది సంభవం కాక పోతే ఆ పనికి పట్టిన గంటలను లెక్కించీ మాత్రమే చెల్లింపబడడంలేదు. ఆ పనిలో ఉపయోగింపబడిన బుద్ధి బలాన్ని గూడా గుర్తించడం జరుగుతున్నది. సమర్థుడైన వైజ్ఞానికునికీ, కార్ఖానాలను నడిపించే ఇంజనీరుకూ, ఆ కార్ఖానా మేనేజరుకూ, ఆ కార్ఖానాలో పనిచేసే సామాన్యమైన కూలికీ రష్యాలో గూడా సమానమైన వేతనం ఇవ్వబడడం లేదు. ధనికవాదాన్ని ఆశ్రయించిన దేశాలలో లాగానే రష్యాలో గూడా ఈ తారతమ్యం పాటించబడుతూనే ఉన్నది.

ఇక రెండో విషయం. వస్తువులధర అందుకైన గిట్టింపును మాత్రమే దృష్టిలో పెట్టుకొని నిర్ణయింపబడదు. ఒకే రకమైన రెండు వస్తువులుండి అందులో ఒక వస్తువు ఎక్కువగా చలామణీలోనికి వస్తే— అది ఒక ఫేషన్ గా మారిపోతే —మొదటి దానికన్న ఈ రెండో వస్తువునకు విలువ పెరుగుతుంది. అనగా మనుష్యునిఆసక్తి లేక దౌర్బల్యానికి ఫలితంగా ధన రూపంలో లాభం తీసుకొనబడుతున్న దన్న మాట.

వర్గ సంఘర్షణ సిద్ధాంతాన్ని సూక్ష్మంగా విశ్లేషించి చూస్తే గాంధీజీ ఆశించిన నైతిక భావములు, మానసిక స్థితి ఏర్పడనంతవరకూ, వర్గాలను నశింపజేయడానికి మార్క్సు సూచించిన సూచనలు అపూర్ణములు కావడమే గాక వర్గరహిత సమాజ స్థాపనను సాధించలేవు. ధనవంతులను చంపి వారిసంపదను అధికారంలోనికి తీసుకోడమన్నా, రాజునుచంపి లేక పదభ్రష్టుణ్ణి చేసి అతని స్థానాన్ని

---

మూడోది— జీతాలలో ఉన్న భేదం కారణంగా జీవిత నిర్వహణలో హెచ్చు తగ్గు లేర్పడుతున్నవి. సామ్యవాద దేశంలో హెచ్చు జీతం వచ్చే వారు తమరాబడిలోనుండి కొంత భాగాన్ని మిగిలించి రాజ్యానికి ఇవ్వవలెనని మాత్రం నిర్ణయించబడినది. ధనికవాదాన్ని ఆశ్రయించిన దేశాలలో లాగానే సామ్యవాద ప్రధాన దేశాలుగూడా వడ్డీకి డబ్బును అప్పుగా తీసుకొంటున్నవి. అయితే. సామ్యవాద ప్రధాన దేశాలలో ప్రభుత్వమే అప్పు తీసుకొనగలదు, గనుక దీనిని నేను జాతీయవాదమని అంటున్నాను. ఆ శబ్దానికి పారిభాషికార్థం వేరుగా ఉంటే నేను చెప్పిన అర్థాన్ని గ్రహించవలెను.

ఇదే విషయాన్ని గురించి రష్యాలోని అస్ట్రోవిటియానోవ్ అనే సామ్యవాదరచయిత సామ్యవాద సమాజవాదాలలోని విభేదాన్ని వివరిస్తూ రష్యాలో సమాజవాదమేగాని, సామ్యవాదం ఇంకా స్థాపింపబడలేదని వ్రాశాడు. "శ్రమకు ప్రతి ఫలాన్నిచ్చే పద్ధతి సామ్యవాదంలో కంటే సమాజవాదంలో వేరుగా ఉంటుంది. సమాజవాదంలో పని ప్రమాణాన్నీ, పని పద్ధతినీ చూచి కూలి ఇవ్వబడుతుంది. కూలినిచ్చే సమాజవాద పద్ధతిలో వస్తువు పూర్తి విలువ తెలుస్తుంది. ఆ విలువ డబ్బు రూపంలో

ఒక హంత్యాకారునికి "ప్రముఖుడనే" పేరుతో సంక్రమింప చేయడమన్నా, దానికి విప్లవమని పేరుపెట్టడమన్నా గాంధీజీకి సుతరామూ ఇష్టంలేదు. అందువలన కలిగే పరిణామాలను దృష్టిలో పెట్టుకొని చూస్తే వారిని దింపి వీరిని గద్దెమీదకు ఎక్కించడమే అవుతుంది గాని అన్యం కాదు. ఆ విప్లవంవలన మొదట జీవిత విధానంలోనూ, వ్యవస్థలోనూ కొంతమార్పు రావచ్చును. కొంత కాలమైన తరువాత చూస్తే మానవస్వభావంలో ఏవిధమైన

---

ఇవ్వబడుతుంది" సోవియట్ రాజ్యం తన పంచవర్ష ప్రణాళికలో సమాజవాదపు అర్థశాస్త్రాన్ని తెలివిగా అమలు పరిచింది. వారొక సిద్ధాంతాన్ని లేవదీశారు. కార్మికులు వ్యక్తిగతంగా ఉపయోగించే వస్తు సామగ్రితో బాటు సమాజవాదపు ధన సంగ్రహం గూడా విరివిగా జరగాలి అనేది ఆ సిద్ధాంతం. మహోన్నత స్థితిలో పూంజీవాద దినాలలో ఏ లెఖ్ఖన పూంజీ పెరిగిందో అంతకంటే ఎక్కువ తీవ్రగతితో సామ్యవాదపు పూంజీ పెరిగింది. సామ్యవాద పక్ష నాయకత్వం క్రింద సోవియట్ ప్రజ నిర్మించుకొన్న ఆర్థిక నిర్మాణంలోని ముఖ్య లక్షణాలివి" (ది రోల్ ఆఫ్ ది స్టేట్ ఇన్ ది సోషలిస్టు ట్రాన్స్ఫర్మేషన్ ఆఫ్ ది ఎకానమీ ఆఫ్ ది. యు. యస్. యస్. ఆర్.)

2 దురాగ్రహం లేని మనుష్యుడెవడైనా వెనకటి కొద్ది సంవత్సరాల రష్యా చరిత్రను పరిశీలిస్తే అక్కడ నిజమైన ప్రజాతంత్ర విధానము లేదని తప్పక అంగీకరిస్తాడు. ప్రజాతంత్ర విధానంలో ప్రతివ్యక్తీ తనకు నచ్చిన విధంగా, తన జీవికోపార్జనకు మార్గాన్ని వెదకుకొంటాడు. తనకు ఇష్టం వచ్చిన లక్ష్యాన్ని నిర్ణయించుకొని ఆ లక్ష్యసిద్ధికై ప్రయత్నం చేస్తాడు. రష్యాలో వ్యక్తికి ఈ అధికారం లేదు. అక్కడ వ్యక్తిత్వ వికాసానికంటే రాజ్యానికే ప్రాధాన్యం ఎక్కువ. వ్యక్తి రాజ్యహితానికి ఉపయోగ

మార్పు రానట్లు తెలుసుకొంటాము. పూర్వపు రాజులకు బదులు కొత్త అధికారులు మాత్రం వచ్చినట్లవుతుంది. ఒక మధ్యమవర్గం నశించి ఆస్థానంలో ఇంకొక మధ్యమవర్గం వచ్చి కూర్చుంటుంది. పాతలు కొత్తలుగా మారుతవి. విప్లవానికి పూర్వమున్న పరిస్థితులే తిరిగి సంప్రాప్తమవుతవి. వర్గాలూ, సంఘర్షణలూ అన్నీ

---

పడాలి. అంతేగాని రాజ్యం వ్యక్తిత్వ పూర్ణత్వ సిద్ధికి కాదు:—
(ది థర్డ్ వే విల్ఫ్రెడ్ వేలాక్)

ఇలాంటి ఆక్షేపణను సామ్యవాదులు అంగీకరించరు. రెండాల్ స్వింగ్లర్ అనే రచయిత ఏమన్నాడో చూడండి. వ్యక్తిగత స్వాతంత్ర్యమంటే, వికాసమంటే అర్థం ఏమిటి? ఆ అర్థం మీదనే అంతా ఆధారపడి ఉంటుంది. రష్యాలో ప్రత్యేకించిన ధనవంతులూ, ఈజీచైర్ల మీద ఎల్లప్పుడూ కూర్చొని ఉండే విద్వాంసులూ, వ్యక్తిగతాధికారాలూ లేక పోవడం నిజమే. ధనవంతుల స్వాతంత్ర్యం (నియంత్రణ వలన) తగ్గుతుంది. కుర్చీలు విరగగొట్టే విద్వాంసుని కాళ్లకూ చేతులకూ కష్టం లేకుండా చేసే అధికారం గూడా నష్టపడుతుంది. ఇది నాజీరాజ్యంలో గూడా జరిగినదే. నిజానికి పూంజీపతికి గల వ్యక్తిగత స్వాతంత్ర్యం మోసం, లూటీ, దగామీద ఆధారపడినది. విద్వాంసునికున్న స్వాతంత్ర్యం ఒక భ్రమ. అయినా సమాజహితానికి ఉపయోగించే ప్రతి పనినీ సాధించడానికి, సంపూర్ణమైన అవకాశాలు రష్యాలో అందరికీ ఉన్నవి!. ఇదీ స్వింగ్లర్ ఉద్దేశ్యం. లెనిన్ ఒక చోట ఒక వంట చేసుకొనే స్త్రీ గూడా రాజ్య సంచాలనం చేయుటకు తగిన స్థితిలోనికి రావాలి సామ్యవాదం అలాంటి పరిస్థితులను సృష్టించడానికి ప్రయత్నిస్తున్నదని అన్నాడు (ది కమ్యూనిస్టు ఆన్సర్ టు ది ఛాలెంజి ఆఫ్ అవర్ టైమ్స్)

ఆలాగే ఉండిపోతవి. అత్యాచారాలు చేసే 'జారు' నియం తృత్వాన్ని హింసావిధానంతో ఎలాతొలగించడం జరిగిందో, శ్రామిక నియంతృత్వాన్ని గూడా అలాగే తొలగించడం జరుగుతుంది. శ్రామికవర్గ నియంతృత్వం వచ్చినంత మాత్రంచేత మానవస్వభావం మారిపోడానికి అవకాశ మేది ? ఆశాసన వ్యవస్థలో ఎంత అణచివేయ బడినా ధనవంతులవర్గం ఏర్పరడదనిమాత్ర మేమున్నది ?

వృత్తులనుబట్టి సమాజం విభక్తమై, ఆవిభజన స్థిర రూపాన్ని ధరిస్తే, జీవితానికి సంబంధించిన అవసరమైన అన్ని పనులలోనూ అందరూ పాల్గొనడం ఏర్పడితే ఆనాడే వర్గ విహీనమైనసమాజం సృష్టింప బడడానికి అవకాశం ఏర్పడుతుంది. మన సమాజంలో వికేంద్రీకృత అర్థవ్యవస్థను అంగీకరించినా వర్గ విహీనసమాజం ఏర్పడేటట్లు కన్పించడం లేదు. వేరువేరు వర్గాలలో సమన్వయం మాత్రం ఏర్పడవచ్చును. అది అయినా మనుష్యులు మంచివారు, ప్రేమపూరితులు, సంయములు, మానవసేవ చేసేవారు అయితేనే సంభవమవుతుంది.

అదిగాక వారు తమకు లభించిన పనులను బాధ్యతతో నిర్వ హింప గలగాలి. అలాంటి సమాజంలో సార్వత్రికాభివృద్ధి, శాంతీ, ఐక్యతా ఏర్పడి తగాదాలు పూర్తిగా నశించక పోయినా చాలావరకు తగ్గిఉంటవి. అలాంటి సమాజాన్ని నిర్మించడానికి అవసరమైన షరతులివి.

(1) మనుష్యుడు తనవంతుకు వచ్చిన సాంఘిక కార్యకలాపాలనూ, వృత్తులనూ మహాత్వాకాంక్షల కొరకుగాక కర్తవ్యబుద్ధితో నిర్వహించాలి.

(2) వ్యక్తికి ఒక ఆస్తి సంరక్షణ భారం అప్పగించబడినా, ఒక ఉన్నతపదవి లభించినా, విద్య, కళాకౌశల్యము, శరీరబలము వగైరాలు లభించినా, అనాధుల పోషణ భారం అప్పగింపబడినా ఆపనులను ఆవ్యక్తి తానొక ధర్మకర్తనని భావించుకొని చేయాలి. బాధ్యతతో చేయాలి. తన వ్యక్తిగత స్వార్థంకొరకు తనకు లభించిన అధికారాలను దుర్వినియోగం చేయగూడదు. అలాంటి ఆదర్శ వర్గహీనసమాజంలో ప్రతివ్యక్తీ తనశరీరాన్ని దాచుకోకుండా చేయగలిగినంత పనినిచేసి జీవితనిర్వహణకు తనకవసరమైనంత భృతిని తీసుకోవాలి.

ఈ షరతులను మన్నించడం జరిగితే రాజ్యాంగం మనకు ఎలాంటిది లభించినా బాధలేదు. బయటిరాజకీయ, ధార్మిక, సాంఘిక వ్యవస్థాపద్ధతులకు ప్రాధాన్యం ఉండదు. ఎన్నుకొనబడిన పంచాయతులద్వారా నడపబడుతూ ప్రజాతంత్ర విధానాన్నీ, జాతీయం చేయబడిన పరిశ్రమల విధానాన్నీ ఆభాసింపజేసే వ్యవస్థకంటే పూంజీవాదపు వ్యవస్థయే ఒకొక్కప్పుడు బాగా ఉంటే గూడా ఉండవచ్చును. కనుక మనకు మానవసమాజం అభ్యున్నతి అవసరంగాని వ్యవస్థ కాదు. జాతీయకరణము,

ప్రజాతంత్ర విధానము మొదలైనవన్నీ సాధనాలు. మానవ శీలాన్ని ఎంతపైకి ఇవి తీసుకొని రాగలిగితే అంత మనకు ఉప కరిస్తవి. లేనినాడు ఇవన్నీ వ్యర్థమే. కనుక గాంధీజీ ఎల్లప్పుడూ నైతిక విలువలకే ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చారు. రాజకీయ, ఆర్థిక విధానాలకు ఆయన ఎక్కువ ప్రాధాన్యాన్నివ్వలేదు. కాని మార్క్సువాదం ఏమంటున్నదో చూడండి

"మనుష్యుని వివేకబుద్ధి వ్యవస్థను నిర్మించడంలేదు. సాంఘిక వ్యవస్థయే వివేకాన్ని నిర్మిస్తున్నది."

"కనుక సామ్యవాదులు అవలంబించే విధానాలలో ఎలాంటి తప్పులూ జరగకుండా, ఆవిధానంలో మిథ్యాస్వప్న దర్శనాలకు అవకాశం లేకుండా, శ్రామిక నియంతృత్వం మానవ బుద్ధిగత సిద్ధాంతాలకు గాక సాంఘికమైన, భౌతికమైన జీవితం లోని వాస్తవ పరిస్థితులను ఆధారంగా గ్రహించి మహాత్ములు అని అనుకొనబడేవారి కోరికలమీదగాక భౌతిక జీవితాభివృద్ధికి, నిజంగా అవసరమైన విషయాలమీదనే ఆధారపడాలి. (స్టాలిన్ వ్రాసిన, డైలెక్టికల్ అండ్ హిస్టారికల్ మెటీరియలిజం)

ఎనిమిది సంవత్సరాల వరకు సామ్యవాదిగా ఉన్న ఇంకొక మిత్రుడన్న మాటలను వినండి.

"వర్గ సంఘర్షణ, పరస్పర విరోధక తత్వ సంఘర్షణ విప్లవానికి అవసరమని మార్క్సు విశ్వసిస్తున్నాడు. ఈ విప్లవ సిద్ధాంతాన్ని,

విప్లవానికి అవసరమని ఏర్పరచబడిన సంఘర్షణ సిద్ధాంతాన్ని ఆధునిక విజ్ఞానం అంగీకరించడం లేదు. అదిగాక మార్క్సు సిద్ధాంతానుసారంగా వర్గ సంఘర్షణను వ్యాప్తి చేయడానికి ద్వేషాన్ని పెంపొందింప జేయడం అవసరమవుతుంది. కాని ద్వేష మనేది ఒక మానసిక వికారం. ద్వేషముంటే బుద్ధి వికాసమూ భావనావికాసమూ జరుగనేరదు. తత్వ జ్ఞాన దృష్టితోనూ, వైజ్ఞానిక దృష్టితో ఆనూ చిస్తే ద్వేషంమీద ఆధారపడిన వాదాన్నిలో అసలు వాదం అనడానికి అవకాశం ఉంటుందా? అంతే గాక ఎప్పుడూ సహజ ప్రేమతో జీవించే మానవుడు ద్వేష వృత్తితో జీవించడం గూడా అంత సంభవమైన పనికాదు. ఏమనుష్యుడూ జీవితమంతా దుర్మార్గుడు గానే ఉండబోడు. కనుక సర్వోదయ సిద్ధాంతాలను మార్క్సు వాద సిద్ధాంతాల ఆవరణలో సమన్వయాత్మక దృష్టితో స్థాపించడానికి ప్రయత్నిస్తూ " పరిశ్రమలను జాతీయం చేయడమనీ, వర్గరహిత సమాజ స్థాపన " అనీ మాటలను అంటుంటే నాకు చాలాఆశ్చర్యం కలుగుతుంటుంటుంది. గాంధీజీ సిద్ధాంతాలలో ప్రధానమైన వర్ణధర్మ, ధర్మ కర్తృత్వాలను, మనవారు మరచిపోతున్నారని అనిపిస్తున్నది. సర్వోదయ సిద్ధాంత రహస్యాలను సరిగా అర్థం చేసుకోలేదని గూడా భావించవలసి వస్తున్నది. "

ఆనవయుకుడు అన్నమాటలను గురించి వివరంగా ఆలో చించవలసిందే. *

---

* ఒక మిత్రుడిలా వ్రాశాడు:—

"నేను చదివినంతవరకు మార్క్సు ద్వేషాన్ని ఉపదేశించినట్లు నాకు ఎక్కడా కనిపించలేదు. జర్మన్ భాషలో ఆయన ఉపయోగించిన శబ్దానికి సరియైన అనువాదం వర్గవిరోధం. విరోధభావం సర్వసాధారణమైన మానవ ప్రవృత్తి. అది ద్వేషవృత్తి మాత్రం కాదు. విప్లవవాదులు అందరివలెనే మార్క్సు కూడా తీవ్రమైన భాషను ఉపయోగించిన మాట వాస్తవమే. అంతమాత్రంచేత మార్క్సు విద్వేష ప్రచారాన్ని చేశాడనడం న్యాయ సంగతం కాదు. అలా అయితే ఏసుక్రీస్తు కూడా ద్వేషాన్నే ప్రచారం చేశాడని అనవచ్చును. నేను ఖడ్గం తీసుకొని దిగాను" ఓ, విషసర్పపు పిల్లలారా!" ఇవన్నీ ఏమి మాటలు!! కాని ఈ నవయువకుని మాటలవలన భారతదేశంలోని సమాజవాదుల భావాలు ఇంకా అస్పష్టంగా ఉన్నట్లూ, ఏరూపాన్నీ ధరించనట్లూ బోధపడుతున్నది.

భారత దేశంలో సమాజ వాదులు అవలంబిస్తున్న విధానాలనూ, చెప్పుతున్న మాటలనూ గురించియే నేను ఎక్కువగా చర్చిస్తున్నాను. ఈ విధానాలనూ, మాటలనూ మార్క్సువాదం ఎంత వరకు సమర్థిస్తున్నదో తెలియదు.

ముఖ్య విషయమేమంటే గందరగోళంగా ఉండే ఒక సమాజంలో రకరకాల పనులు చేయక తప్పదు. అందువలన వర్గాలు ఉంటూనే ఉంటవి. ఈ వర్గాలన్నీ కలిసిమెలసి పరస్పర సమన్వయ భావంతో పని చేస్తే శాంతి ఏర్పడుతుంది. లేనినాడు సంఘర్షణా, అశాంతీ పెరగడం సంభవిస్తుంది. ఒక సైకిలు ఎక్కిన వాడి కాళ్లూ, చేతులూ సమన్వయాత్మకంగా పని చేయకపోతే వాడు

# వర్ణాశ్రమ ధర్మ సిద్ధాంతము.

ఆయన మాటల్లోనే చెప్పవలెనంటే గాంధీజీ సిద్ధాంతీకరించిన సాంఘిక, రాజనైతిక, ఆర్థిక సిద్ధాంతాలన్నీ అహింసలో నుండియే ఉత్పన్నమవుతున్నవి. ప్రతివ్యక్తినీ, ప్రతిజీవినీ ప్రేమిస్తూ, గౌరవిస్తూ ఆయన సిద్ధాంతాలు జీవితంలో ఏర్పడిన సమస్యల నన్నింటినీ పరిష్కరించ వలెనని కోరుతున్నవి. ఆయన వర్ణధర్మ సిద్ధాంతమూ, ధర్మకర్తృత్వ సిద్ధాంతమూ అలా ఏర్పడినవే. వ్యక్తిగానీ, సమాజంగానీ గాంధీగారి దృష్టిలో కేవలం పంచభూతాత్మకమైన పదార్థంకాదు. ఆపదార్థాన్ని

---

తను పడిపోవడమేగాక దోవనబోయే వారి కాళ్లుగూడా విరగడం సంభవిస్తుంది. ఒక ఇంట్లో నివసించే భార్యా భర్తలు ఇద్దరిలో సమన్వయం లేక ఒకరు ఇంకొకరి మీద అధికారాన్ని చలాయించడం ప్రారంభిస్తే గృహ కలహాలు ఎక్కువై ఆ సంసారం నానా ఇకట్ల పాలవుతుంది. ఇంద్రియాలలో సమన్వయం లేకపోతే— ఆ ఇంద్రియాలను ఛేదించి మనుష్యుణ్ణి నిరింద్రియ మాంసపిండంగా తయారు చేయడానికి వీలుండదు. స్త్రీ పురుష జాతులలో సంఘర్షణ కలిగినంత మాత్రంచేత సమాజాన్ని స్త్రీ పురుష విహీనంగా చేయటానికి అవకాశం ఉండదు. అదే విధంగా సమాజాన్ని వర్గ విహీనంగా నిర్మించడం సంభవమయ్యేపని గాదు. వ్యక్తులు చేసే పనులలో సంఘర్షణ లేకుండా— ఒక్కొక్కరు ఒక్కొక్క విశిష్టకర్మను చేసేటట్లుగా సమాజాన్ని మనం రూపొందించవచ్చును. ఆ సమాజం గందరగోళంలో పడిపోక అనాడు బలం గలిగిన ఒక స్వతంత్ర సమాజం కాగలుగుతుంది. ఆధునిక సమాజంలో కలిగిన సంఘర్షణలను సమన్వయం ద్వారా పరిష్కరించుకోవాలి. అందుకు

మన ఇష్టంవచ్చినట్లుగా పాడుచేయడానికీ, బాగుచేయడానికీ, మార్చడానికీ, ఉపయోగించుకోడానికి వీలులేదు. ఒకానొక గొప్ప ఆదర్శంకొరకు ఐహిక సుఖాన్ని ఆహుతి చేయవలసివస్తే సంతోష పూర్వకంగా మనుష్యుడు ఆపని చేసేటట్లు ఉండాలి. బహుజనోపయోగం కొరకు, కొద్దిమందిని ఆహుతిగా సమర్పించినా, భవిష్యత్సంతతి సుఖభోగాలకుగాను ఈ యుగంలోని వారంతా కష్టాలను అనుభవించినా ఫరవాలేదు అనే సిద్ధాంతం గాంధీజీకి నచ్చలేదు.

వర్గసంఘర్షణ అవసరమని గానీ, వర్గరహితసమాజస్థాపన నా ఆదర్శమనిగానీ గాంధీజీ ఎప్పుడూ చెప్పిఉండలేదు. భోజన భాజనాదులనూ, వివాహాది క్రియలనూ పురస్కరించుకొని ఏర్పడిన జాతివిభేదాలూ, వర్ణగతంగా, జాతిగతంగా ఏర్పడిన ఎక్కువ తక్కువ భేదభావాలూ, వేరువేరు ఉద్యోగాలలో, లేక ఒకే పరిశ్రమలో- సంస్థలో- పనిజేసేవారి జీవితనిర్వహణకు అవసరమైన ఆదాయాలలో ఏర్పడిన ఎక్కువ తక్కువలూ అన్నీ మారిపోవలెననీ, అదృశ్యం కావలెననీ అయన గాఢంగా వాంఛిస్తున్న మాట నిజమే. ఆదిమ సమాజాన్ని వదలిపెడితే, ఆధునిక

---

అనుకూలమైన పరిస్థితులను నిర్మించడం, అయోగ్యులగు వ్యక్తులను తొలగించివేయడం అవసరమవుతుంది. దానిని సమన్వయం ద్వారానే సాధించాలి. నిజానికి ఇది ఒక నైతిక- మానసిక సమస్య అనే విషయాన్ని గుర్తించుకోవాలి.

సమాజంలో వేరువేరు పనులను చేసే వేరువేరు వర్గాలుండడం అవసరంగూడాను. ఆ అవసరమైన వర్గాలలో,— ఆ వర్గహితాలలో— కలిగే పరస్పర సంఘర్షణను ఆపివేయడానికి తగిన ఉపాయం వర్ణధర్మాన్నీ, ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్నీ అనుసరించడమేనని గాంధీజీ భావిస్తున్నారు. ఈ రెండు సిద్ధాంతాలనూ విశ్వాస పూర్వకంగా అమలులోనికి తీసుకొనివస్తే సమాజంలోని అన్ని వర్గాలలోనూ సమన్వయం ఎంతో తేలికగా ఏర్పడుతుంది. ఒకవేళ ఎప్పుడైనా సంఘర్షణ ఏర్పడ్డా ఆ సంఘర్షణను ఆపివేసే అహింసాత్మక కార్యక్రమాన్ని ఆలోచించవచ్చును. మనుష్యుడు పూర్ణుడు కానంతవరకూ సంఘర్షణ లేనేలేని సమాజం ఏర్పడుతుందనుకోడం గూడా జరిగేపనికాదు. వ్యక్తులనూ, వర్గాలనూ, సమాజాలనూ తదనుగుణ్యంగా మనం తయారుచేసుకోవాలి.

ఈ వర్ణధర్మసిద్ధాంతం ఏమిటి ? దీనిని గురించి శాస్త్రీయ పరిభాషతో సూటిగా ఆలోచిద్దాము.

సామాన్యంగా మనం మనతల్లిదండ్రులు అవలంబించిన వృత్తులనే అవలంబిస్తూ ఉంటాము. సమాజ జీవితంలో ఒకరకంగా స్థిరత్వం ఏర్పడడానికీ, పిల్లలకు వ్యవస్థితమైన విద్య లభించడానికీ, ఆయావృత్తులలో వైజ్ఞానిక వికాసం కలగడానికీ ఈపద్ధతి చాలా అవసరమైనది. ఉపయోగకరమైనది. అన్ని వృత్తుల ఆదాయమూ, గౌరవ మర్యాదలూ దాదాపు సమానంగా ఉంటే తనవృత్తిని

వదలి ఇంకొక వృత్తిని అవలంబించ వలెనని ఏవ్యక్తీ కోరడు. ఆయా వృత్తులకు సంబంధించిన అభిరుచులు పుట్టుకతోనే— రక్తంతోనే— ఏర్పడుతున్నవి. ఈ సిద్ధాంతం వైజ్ఞానికంగా సమర్థనీయం కాక పోయినా జీవితమంతా వంశపారంపర్యంగా ఒకే వృత్తిలోఉన్న మనుష్యుల శరీరనిర్మాణంలోనూ, బుద్ధినిర్మాణంలోనూ తల్లిదండ్రుల తాలూకు గుణాలు రావడం స్వాభావికమే. చుట్టూఉన్న వాతావరణంగూడా ఆవృత్తికి అనుకూలమైనదైనట్లయితే ఇతర వృత్తులలో కంటే ఆ వృత్తిలో మనం ఎక్కువ రాణించ గలుగుతాము. కనుక ప్రతివ్యక్తీ తనపెద్దలు అవలంబించిన వృత్తినే అవలంబించడం మంచిదనే నియమం ఏర్పడాలి. ఆవృత్తికే సంబంధించిన ఇతర శాఖలలో ఆతడు పనిచేసినా బాధలేదు. ఇంకొక వృత్తిలోనికి అతడు పోగూడదు. ఈ నియమాన్ని అనుసరించడం నేర్చుకుంటే యం. ఏ. లో ఉత్తీర్ణులైన నవయువక, నవయువతీ మణులందరూ పట్టంతీసుకొన్న తరువాత ఏమిచేయాలో తోచని పరిస్థితిలో పడి ఉండ నక్కరలేదు. వృత్తిని నిర్ణయించుకొంటే పిల్లలకు ఎలాంటి చదువు చెప్పించవలెననేది గూడా దానంతట అదే తేలిపోతుంది.

గాంధిగారేమన్నారో చూడండి—

" వర్ణ శబ్దానికి ఎంతో తేలికైన, సహజమైన అర్థమున్నది. నైతిక మూలసిద్ధాంతాలకు విరుద్ధంగాని, వంశపారంపర్యంగా లభించిన వృత్తిని మనం అనుసరించాలి "

( హిందీ నవజీవన్ 3 - 11 - 27 )

సామాన్య నియమాలకు గాంధీజీ ఇక్కడ ఒక మినహా యింపును చేర్చారు. వంశ పారంపర్యంగా లభించిన వృత్తి అయినా అది నీతివిరుద్ధంగా ఉంటే దానిని వదలివేయవలసిందే. వంశ పారంపర్యంగా లభించిన వృత్తి కేవలం తన జీవితనిర్వాహణకు మాత్రమే ఉపయోగపడాలి.

ఈ సామన్య నియమానికి ఆయన ఇంకొక మినహాయింపును గూడా తెలియజేశారు. ఒకవ్యక్తి గుణధర్మాలు అతని తండ్రి తాతల గుణధర్మాలకంటే వేరుగా ఉంటవనుకోండి. అప్పుడేమి చేయాలి ? దానికి ఆయన ఈ క్రింది విధంగా జవాబు చెప్పారు.

" నాతండ్రి వ్యాపారస్తుడై నాలో సైనికుని లక్షణాలు ఉంటే నేను తప్పక సైనికవృత్తిని స్వీకరించి దేశసేవ జేస్తాను. కాని నా జీవిత నిర్వహణకు నేను వ్యాపారాన్నే ఆధారంగా పెట్టు కొంటాను "

( హిందీ నవజీవన్ 1-12-27 )

ఇంకొక ప్రశ్నకు గాంధీజీ ఇలా జవాబు చెప్పారు.

" .........బుద్ధిమంతుడైన వడ్రింగి డబ్బు సంపాదించ డానికి గాక సేవకొరకై వకాలతు చేస్తే అది గౌరవ ప్రదంగానే ఉంటుంది "

ఈ రెండు అపవాదాలకూ పరిణామ స్వరూపంగా ఇంకొక అపవాదాన్ని గూడా చెప్పడానికి అవకాశమున్నది.

సమాజంలో లేక ఒక వృత్తిలో అవసరమైన సలహా కావలసివస్తే ఇతరవృత్తులలో ఉండే వారిని మనం ఆహ్వానించవచ్చును. కాని ఈవృత్తి డబ్బు సంపాదించడానికి గాక సమాజసేవ కొరకు ఆయి ఉండాలి. విశ్రాంతిగా కూర్చొని మెదడునూ, కలాన్నీ ఉపయోగిస్తూ ఉండేవారిని వ్యవసాయము, గోపాలన, మొదలగు ఎండలో వానలో కష్టపడి పని చేయవలసిన వృత్తుల లోనికి వచ్చేటట్లుగా ప్రోత్సహించవచ్చును.

కాని అలాంటి వ్యక్తులు ఎక్కడో కొద్దిగానే దొరుకు తారు. ప్రస్తుతం వీరి సంఖ్య పెరిగిపోయి కొత్త సమస్యలు ఏర్పడుతున్న మాట గూడా నిజమే. దీనికి రెండు కారణాలున్నవి. ఒకటి వృత్తులను బట్టి ఏర్పడిన హెచ్చుతగ్గు భావాలూ, వర్గాలూ బయలు దేరడం, రెండు కర్తవ్య దృష్టితో గాక కేవలం ధనసంపాదన కొరకు పనిచేసే సంస్కారం ఏర్పడడమూనూ. ఈ సంస్కారం ఏర్పడడానికి పోటీ, వ్యక్తిగత ఆస్తిని పెంపొం దించు కొందామనే భావంమీద ఆధారపడిన సంఘనిర్మా ణమూ కారణాలు.

వర్ణధర్మాలను గురించి చెప్పుతూ గాంధీజీ—

"వర్ణధర్మధారణలో హెచ్చు తగ్గు భేదాలులేవు' అన్నారు

(యంగ్ ఇండియా 20-10-27)

ఇంకొకచోట — ఈ క్రిందివిధంగా అన్నారు.

" నా దృష్టిలో జన్మవలనగానీ, కర్మవలనగానీ, ఏవ్యక్తీ గొప్పవాడు కానేరడు........... జన్మించినప్పుడు అందరూ సమానంగానే ఉంటారని నావిశ్వాసము. ఇంగ్లండులో జన్మించినా, అమెరికాలో జన్మించినా లేక హిందూదేశంలోనే జన్మించినా మనుష్యులందరిలో ఒక్కటే ఆత్మ ఉంటుంది. అందువలన శాసక వర్గంవారు మేము గొప్పవారము అని అనుకుంటూ ఉంటే అందుకు నేను వ్యతిరేకిస్తున్నాను. దక్షిణాఫ్రికాలో అలాంటిభావం కలిగిన వర్గంతో నేను కలహించాను. అందువల్లనే నేను పాకీవాణ్ణి, సాలెను, నూలువడికేవాణ్ణి అని చెప్పుకోడంలోనే ఎంతో ఆనందాన్ని అనుభవిస్తుంటాను. విద్య లేక పుట్టుకబలం వల్ల బ్రాహ్మణ వర్గం మేము గొప్పవారమని అంటే నేను వారినిగూడా వ్యతిరేకించాను. ఇంకొక వ్యక్తికంటే నేను గొప్పవాడనని* అనుకోడం మనుష్యత్వాన్నే కళంకిత పరచడమని నాఉద్దేశ్యం. బ్రాహ్మణుడుగానీ, ఇంకొకడుగానీ, నేను గొప్పవాడనని చెప్పుతూఉంటే అందుకు వ్యతిరేకంగా అబ్రాహ్మణుడు ఎదురు తిరిగితే ఆ అబ్రాహ్మణుని నేను బలపరుస్తున్నాను. నేను గొప్పవాడినని చెప్పేవాడు మనుష్యత్వాధికారంలో నుండి చ్యుతుడై పోయినాడని నా ఊహ. ఇది నాఉద్దేశ్యం.

( హిందీ నవజీవన్ 6–10–27 )

వర్ణధర్మ సిద్ధాంతానికి విఘ్నంకలిగించే ఇంకొక విషయాన్ని వ్యతిరేకించడానికి గాంధీజీ ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని ప్రతిపా

దించారు. ఈ విషయాన్ని గురించి ఇంకొక ప్రకరణంలో చర్చిస్తాను.

గాంధీజీ దృష్టిలో వర్ణసిద్ధాంతమనేది కర్మకాండకు, లేక ఒక సంప్రదాయానికి సంబంధించిన సిద్ధాంతంకాదు. అది నాగరికులైనవారు అనుసరించవలసిన కర్తవ్యసిద్ధాంతము. ఈకర్తవ్యాన్ని తన యొక్కయూ, తనఆశ్రితుల యొక్కయూ, తనసమాజం యొక్కయు మేలుకొరకు అమలుపరచాలి. ప్రతినాగరికుడూ తనజీవికా నిర్వహణకు పైతృకంగా నీతికి అవిరుద్ధంగా తనకు లభించినటువంటిన్నీ, సమాజపోషణకు, ఉత్కర్షకు అవసరమైనటువంటిన్నీ ఏదోవృత్తిని అవలంబించి తీరాలి. వృత్తిగతమైన హెచ్చుతగ్గుభావాలు సారహీనమైనవి. అవి నష్టదాయకమైనవి. వాటిని వదలివేయాలి. అదే విధంగా భోజనభాజనాదుల విషయంలోనూ, వివాహాదుల విషయంలోనూ ఏర్పడిన విధినిషేధాలను గూడా తొలగించి వేయాలి. అన్నివృత్తులూ సమానమైనవని భావించబడాలి.

## ధర్మకర్తృత్వ సిద్ధాంతము.

ధర్మకర్తృత్వ సిద్ధాంతమంటే ఏమిటి ? అనే దానిని గురించి తెలుసుకొనే టందుకు ముందు అది ఏమికాదో తెలుసుకొందాము. ఎందువల్లనంటే ఈ విషయాన్ని గురించి అనేకమంది అనేక విధాలుగా భావిస్తున్నారు. ఈనాడు కొంతమందిచేతులలోనికి ఆస్తి

వచ్చిచేరింది. ఇంకొక వర్గంవారు ఆ ఆస్తిని లాగివేయ వలెనని ప్రయత్నిస్తుంటే, ఆ ప్రయత్నం కొనసాగకుండా ఉండడానికి ఈ సిద్ధాంతం ప్రతిపాదించ బడినదని కొంత మంది అంటున్నారు. లాగివేయ దలచుకొన్న వర్గంవారికంటే మేమే ఈఆస్తిని ప్రజల మేలుకొరకు సరిగ్గా వినియోగించగలమని ఆ ఆస్తి దగ్గరకుచేరిన వారు అంటున్నారు. మమ్మల్ని వ్యతిరేకించే వారుగానీ, సామాన్య జనంగానీ ఈ కార్యకలాపాన్ని నడపడానికి తగినంత సమర్థతకలిగి లేరనీ చేతగానివాళ్ల చేతిలో ఈఆస్తినిపెడితే మాకర్తవ్యాన్ని మేము నిర్వహించినట్లు కాదనిగూడా వారు అంటున్నారు. ఇలాంటి పిచ్చి పిచ్చి మాటలతో ఇతరవర్గాలవారి హక్కులను కుంచింప జేయడానికే ఈధర్మకర్తృత్వసిద్ధాంతం ఏర్పడిందని వ్యతిరేకవర్గాలవారు స్పష్టంగా చెప్పుతున్నారు. ఇంగ్లీషువారు స్వరాజ్య మిమ్మంటే ఇలాంటివే కుంటిసాకులు ఎన్నో చెప్పుతూ ఉండేవారు. "అధికారాన్ని ఎవరికి సమర్పించమంటారు? ప్రజలు నిరక్షరులుగా ఉన్నారు, వారిలో ఐక్యతలేదు, జాతులనీ, మతాలనీ ఎన్నో విభేదాలలో పడి కొట్టుకుంటున్నారు, వారిపేరుతో ఉద్యమాలను నడిపే నాయకులంతా ధూర్తులు, రాజ్యాధికారం కొరకు తమలో తాము దెబ్బలాడుకునేరకం, వారు తమ స్వార్థసిద్ధికై ప్రయత్నం చేస్తారు, వారు భారతదేశంలో శాంతిని స్థాపించలేరు, అందు వలన భారతదేశానికి ఇప్పట్లో స్వాతంత్ర్యం ఇవ్వడానికి వీలు లేదని వారు జవాబులు చెప్పేవారు.

కాని ఇంగ్లీషువారి పరిపాలన భారతదేశాభివృద్ధికి తోడు పడేటట్లుగా ఉండేదికాదు. అందువలన ఈ ధర్మకర్తృత్వ సిద్ధాంతమంటే ప్రజలకు వెగటుపుట్టింది. తమ అధికారాలను వదలుకోకుండా ఉండుటకు ఇవన్నీ ఏవో మిషలన్నట్లుగా తేలిపోయింది.

చట్టబద్ధులుగా ఏర్పడిన ధర్మకర్తల ప్రవర్తనగూడా ఇలాగే ఉన్నట్లు మనకు అనేకసార్లు అనుభవంలోనికి వచ్చింది. మైనారిటీ తీరక పిల్లవాడి ఆస్తికి ఎవరైనా సంరక్షకుడుగా ఏర్పాటు చేయబడితే ఆపిల్లవాడికి మెజారిటీ వచ్చినా ఈ సంరక్షక మహాశయుడు ఆ ఆస్తిని పిల్లవానికి అప్పగించడానికి తయారు కావడం లేదు. తన ఆస్తిని సంభాళించుకొనే శక్తి ఆ పిల్లవాడికి ఇంకా కలగలేదని మాటలు చెప్పుతున్నాడు. కనుక ఇలాంటి ధూర్తులనందరినీ ధర్మకర్తలంటే ఎవరు నమ్ముతారు?

ఆలాంటి అనుభవాలు ఎక్కువగా లభ్యం కావడంవలన ధర్మకర్తృత్వ సిద్ధాంతమనే పేరు వింటేనే కొంతమందికి తలనొప్పి వస్తున్నది. గాంధీ జమీందారులకూ, డబ్బున్నవారికీ మిత్రుడు గనుక, ఆ మిత్రుల చేతిలో నుండి డబ్బు పోకుండా ఉండడానికి ఈ ఎత్తు ఎత్తినాడని అభ్యుదయవాదులు అంటున్నారు.

ధనికులు ప్రజలను మోసగించే అందమైన మాయ శబ్దాలలో ఇది ఒకటి అని వారంటున్నారు.

ఎక్కువగా దానాలు చేసేవాడు ఆదర్శ ధర్మకర్త అని గాంధీజీ ఉద్దేశ్యం. ఒక లక్షాధికారి వ్యక్తిగతంగా సామాన్య జీవితాన్ని గడపుతూ, అప్పుడప్పుడు పెద్ద పెద్ద దానాలు చేస్తూ, మంచి సంస్థలను నిర్మించి, తన ఆస్తిలో నుండి కొంత భాగాన్ని ధర్మాదాయ ట్రస్టుగా ఏర్పర్చి, బీదల యెడలా, ఇంట్లోని నౌకర్ల యెడలా దయగలిగిఉండి, అతిథులకు ఆతిథ్య సత్కారాలు చేస్తూ, కష్టాలలో మిత్రులకు సహాయంచేస్తూ, ఎలాంటి దుర్గుణాలు లేకుండా ఉండి, మతం మొదలైనవాని మీద విశ్వాసం కలిగిఉంటే అతడు మంచి ధర్మకర్త అని గాంధీజీ యోగ్యతా పత్రం ఇచ్చి వేస్తారు. అతడు తన కుటుంబీకులకు ఎంత సుఖాన్ని కలుగ జేస్తున్నాడు, తన సంపాదనలో నుండి ఎంత భాగాన్ని తన కొరకు ఖర్చు పెట్టుకుంటున్నాడు, అసలు ఏ విధంగా ధన సంపాదన చేస్తున్నాడు అనే విషయాన్ని ఆయన పరికించరు అని అంటున్నారు.

కాని, గాంధీజీ చిత్రించిన ధర్మకర్తలు వీరు కారు. ట్రస్టీ శబ్దం చట్టానికి సంబంధించిన శబ్దం. చట్టం అప్పుడప్పుడు ఈశబ్దానికి కలుగజేసే అర్థాలనూ, ఏర్పాటు చేసే హద్దులనూ గురించి ఆలోచిస్తే అవన్నీ గాంధీజీ ఆశించిన ట్రస్టులకు అనువర్తించేవే. ఇవేగాక చట్టం తాలూకు హద్దులలోనికి రాకుండా నైతికమైన కొన్ని విషయాలు గూడా అనువర్తిస్తవి

1936 లో గాంధివాదము, సామ్యవాదము. అనే విషయంపై హరిజన బంధులో నేను కొన్ని వ్యాసాలను వ్రాసిఉన్నాను. గాంధీ జీ దిద్ది వాటిని పత్రికలో ప్రకటించారు. దానిలో ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని గురించి నేను వ్రాసిన వాక్యాలను చదవండి.

" వ్యక్తి గతమైన ఆస్తికీ, మోసము శోషణము అనే ప్రశ్నకూ సంబంధమున్నది. దాదాపు ఈ రెండూ ఒక్కటే నని అంగీకరించడంగూడా జరుగుతున్నది. గాంధీవాద, సమాజ వాదాలలో ఈ విషయం మీదనే తీవ్రమైన వాదోపవాదాలు జరుగుతున్నవి. నిజమేమని ఆలోచిస్తే ఈవిషయంలో గాంధీజీ సమాజవాదులకంటే గూడా తీవ్రమైన భావాలను కలిగిఉన్నారు. వారి సిద్ధాంతాలను అనుసరించి ఏ వ్యక్తీ పరిగ్రహం చేయడానికి వీలులేదు. పరిగ్రహమన్నా, సంపదఅన్నా ఆసక్తి ఉండడం చేత వ్యక్తిగత సంగ్రహం మంచిదని ఆయన సహించడం లేదు, మానవజాత్యభ్యున్నతికి వ్యక్తిగత ఆస్తి ఉండడం అవసరమని గూడా ఆయన భావించడం లేదు. వ్యక్తిగత పరిగ్రహాన్ని నిరోధించడానికి ఆయన కింతవరకు తగిన సత్యాగ్రహ మార్గ మేమీ దొరకలేదు. అన్ని పంథాల సమాజవాదులూ సమాజా భ్యున్నతికి ధన సంగ్రహం అవసరమని భావిస్తున్నారు. గాంధీజీ అందుకు అంగీకరించడం లేదు. మనుష్య జాతి పరిగ్రహాన్ని వదలిపెట్టే స్థితి అప్పుడే ఇంకా రాలేదని వాస్తవిక పరిస్థితుల

అనుభవం దృష్ట్యా గాంధీజీ భావిస్తున్నారు. కనుక అసలువారి దగ్గర నుండి ధనాన్ని లాగివేసే పరిస్థితి ప్రస్తుతం సంభవం కానందున వారిదగ్గర ఏ షరతులతో ధనాన్ని ఉండనీయాలి? వారు ఏదృష్టితో ఆధనాన్ని తమ దగ్గర పెట్టుకోవాలి,? అని ఆలోచించడం అవసరమవుతున్నది. గాంధీజీ ఉద్దేశ్యం ప్రకారం ఆ స్తి ఒక వ్యక్తి అధీనంలోనే ఉన్నా లేక కొంతమంది వ్యక్తుల సమూహం దగ్గర ఉన్నా, ఆ ఆ స్తిపై అధికారం వారికి న్యాయ బద్ధంగా లభించినా, అన్యాయంగా లభించినా, దానిని వారు తన సొంత ఉపయోగం కొరకు గాక సమాజోపయోగం కొరకు తమ దగ్గర ఉంచుకోవాలి. అంతే. వారు ఆ ఆ స్తికి ధర్మ కర్తలమని అనుకోవాలి. ఈ ధర్మకర్త శబ్దంవల్ల అనేకమైన అపవాదులు బయలు దేరినవి. గాంధీజీ ఈశబ్దం ద్వారా ఏఅర్థాన్ని వాంచి స్తున్నారో ప్రజలకు ఇంకా బాగా తెలియ లేదు .........

ఇంగ్లీషువారు భారతదేశంలో ఇంగ్లీషు ప్రభుత్వం భారతదేశం లోని జనసామాన్యం మేలుకొరకు ఉన్నదని అనేక సార్లు అన్నారు. మేము ధర్మకర్తలమని గూడా అన్నారు. కాని చెప్పినట్లుగా వారు ఆచరించలేదు. ఇలాంటి మాటలతో భారతీయులను మోసగిస్తున్నారని మనం తెలుసుకొన్నాము. అదేవిధంగా గాంధీగారు గూడా ధర్మకర్త శబ్దాన్ని ప్రయో గించడం తోనే ఇది గూడా వక్తృత్వకళకు సంబంధించిన ఒక అలంకారమని అనుకుంటున్నారు. చట్ట సమ్మతమైన ధర్మకర్తృ

త్వంలోనూ, ధర్మసమ్మతమైన ధర్మకర్తృత్వంలోనూ కొంత విభేద మున్నదని అస్పష్టంగా వారనుకొంటున్నారనుకొంటాను. కాని గాంధీగారు అలాంటి విభేదాన్ని అంగీకరించడం లేదు. ఆచరణ సాధ్యం కాని విషయాలను గాంధీజీ ఎన్నడూ ప్రబోధించనే ప్రబోధించరు. ధర్మకర్త తన జీవితానికి అవసరమైన దానిని తాను అనుభవించి మిగతా సంపదను ఇతరుల అనుమతి తోనే ఖర్చుచేయాలి. ఆ అనుమతి విధిలేక లభించినా సరే, లేక అజ్ఞానం వలన లభించినా సరే. కాని ఆ శక్తత పోయి అజ్ఞాన పరిహారం ఎక్కువైనపుడు మిగిలిన సంపదమీద వ్యక్తికి ధర్మ కర్తరూపంలోనే అధికారముంటుంది, కనుక జనసామాన్యాన్ని జ్ఞానవంతం చేయడానికి ప్రయత్నం జరగాలి. జనసామాన్యంలో బలాన్నీ—శక్తినీ—అభివృద్ధి చేయవలెనంటే అహింసాత్మక శక్తినే అహింసాత్మక బలాన్నే—అభివృద్ధి చేయాలి. అహింసాత్మక శక్తి పరిహారం జరుగకపోతే ఈనాటిదాకా బీదగా ఉన్నవాడు రేపు ఆస్తి దొరకడంతోనే ఉన్మత్తుడు కాడని ఎక్కడున్నది?''

ఆరోజుల్లో ఒక్క విషయాన్ని నేను స్పష్టపరచలేదు. అప్పటికి ఆ విషయం నాకు స్పష్టంగా అవగతమయి ఉండలేదు.

ట్రస్టు అనుకొనబడే ఆస్తికి యజమాని—హక్కుదారుడు— ఎవరు? దానిని అనుభవించేదెవరు? అసలు ట్రస్టులో ఉండే

ఆస్తి స్వరూపమేమిటి? గాంధీజీ దృష్టిలో వ్యక్తిగతమైన ఆస్తి అంటే ఏది? అది ఎంత ఉండాలి?

ఈ ప్రశ్నలకు సమాధానమివ్వడానికి ప్రయత్నిస్తాను. ట్రస్టీ సిద్ధాంతంలో వ్యక్తిగతమైన ఆస్తి అనీ తదితరమనీ వ్యత్యాసం ఉండదు. ఎవరి అధికారంలో ఉన్నా, ఎంత ఉన్నా, ఏరకంగా ఉన్నా, అంతా ట్రస్టీ ఆస్తియే. ఆ ఆస్తికి స్థూల సూక్ష్మములని గూడా భేదం లేదు. ఈ సిద్ధాంతం కేవలం ఆస్తి విషయంలోనే గాక, అధికారాలూ, పదవులూ, శారీరకశక్తి మొదలైన వాటి అన్నింటి లోనూ వర్తిస్తుంది. ఒక అనాథాశ్రమంలో ఒక కుంటివాడు ఉంటాడనుకోండి, వాడికి గుడ్డీ, చెవుడూ గూడా ఉన్నవనుకోండి. అయినా వాడి దగ్గర ఏ మాత్రం నిర్మాణాత్మక శక్తి ఉన్నా దానికి అతడు ధర్మకర్తయే అవుతాడు. సారాంశమేమంటే పిచ్చి వాడు తప్ప శక్తివంతులైనవారందరూ ధర్మకర్తలే.

అయితే వీటికి అధికారి— యజమాని— ఎవరు? గాంధీజీ "ఈశ్వరుడని" అంటున్నారు. ఈ జగత్తంతా ఈశ్వరునిదే. ఈ జగత్తులో ఉండే సజీవ నిర్జీవ, స్థూల సూక్ష్మతత్త్వాలన్నీ భగవన్నిర్మితాలే. ఉదాహరణకు చూడండి. ఒక కార్ఖానాకు షేరు హోల్డరుగానీ, డైరెక్టరుగానీ, మేనేజింగు ఏజంటుగానీ, కార్మికులుగానీ ఎవ్వరూ అధికారులుగారు. ప్రభుత్వం గూడా దానికి యజమాని కాదు. ఆ కార్ఖానాను నడిపించడానికి వారందరూ

సహాయకులు మాత్రమే. ఆ కార్ఖానాను జయప్రదంగా నడపించ డానికి వారంతా భాగస్వాములు. వారందరికీ వారి వారి అభిరుచి ననుసరించి వేరు వేరు కర్తవ్యాలు నిర్ణయించబడినవి. ప్రతివారూ బాధ్యతతో తన పనిని తాను నిర్వహించాలి. అందుకు గాను వారు ప్రతిఫలాన్ని తీసుకోవచ్చును. ఆ కార్ఖానాలో వారి ఖర్చులు పోగా మిగిలిన సంపదమీద వారిలో ఎవ్వరికీ ఎలాంటి అధికారమూ లేదు.

సమస్త జగత్తు మీదా ఈశ్వరునికి మాత్రమే అధికారం గలదు. ఏ ఒక మనుష్యుడుగానీ, లేక యావత్తు మనుష్యజాతిగానీ ఏ వస్తువునకూ యజమాని కావడానికి వీలులేదు. ఈ సిద్ధాంతాన్ని అనుసరిస్తే షేరుహోల్డరకూ తదితరులకూ బోనసు ఇవ్వడమనేది ఉండదు. భగవంతుడు మనుష్యుని ఉపభోగం కొరకు ఈ ప్రపం చాన్ని సృష్టించాడు, చరాచర ప్రకృతిని ప్రసాదించాడు అనేది అర్థం లేనిమాట. తనకు లభించిన దానిని వ్యక్తి చాలా తక్కు-వగా అనుభవించి, తాను చేసిన ప్రతి పనికీ లెక్క- చెప్పవలసి ఉంటాడు. తన కళాకౌశల్యాన్నీ— తన యోగ్యతనూ— తనశక్తినీ ఉపయోగించి కార్ఖానాకు లాభాన్ని కలుగజేసిన వ్యక్తి తన అవసరానికి కావలసిన భృతిని స్వీకరించవలసిందే. తన బుద్ధికిని తగిన లేక తను చేసిన పనిని బట్టి భృతిని స్వీకరిండానికి వీలులేదు. ఒక కుంటి చౌకీదారుడు ఒక బల్ల మీద కూర్చొని కార్ఖానా లోపలికి

వచ్చే, బయటికి పోయే సామాన్లను జాగ్రత్తగా కనిపెట్టి ఉంటాడనుకోండి. అతడికి గూడా అతని జీవిత నిర్వహణకు కావలసినంత సంపదా లభించవలసిందే. ఇంజనీయరుకూ, బలశాలియైన కార్మికునకూ అందరికీ అంతే. మేనేజింగు ఏజంటుకు ఇంకొక చోట జీవితనిర్వహణకు భృతి లభిస్తూ ఉంటే ఇక్కడ అతనికేమీ ముట్ట జెప్పకూడదు. డబ్బు రూపంలో లభించే ప్రతిఫలాన్ని బట్టి, ఏ వ్యక్తికీ విలువలు కట్టగూడదు.

భగవంతుడే ఆ ఆ స్తికి యజమాని అని అనడంవలన ప్రభుత్వంగానీ, డైరెక్టరుగానీ, కార్మికుడుగానీ ఎవరి ఇష్టం వచ్చినట్లుగా వారు ఆ ఆస్తిని నాశనం చేయడానికి వీలులేదు. మా ఆస్తిని మా ఇష్టం వచ్చినట్లుగా చేసుకొంటామని అనడానికి అవకాశం లేదు.

( విషయాంతరమైనా ఇక్కడ ఇంకొక విషయాన్ని తెలియజేయడం అనుచితం కాదనుకొంటాను. నైతిక రంగంలో కామవాంఛాతృప్తి స్త్రీ పురుషుల వ్యక్తిగతమైన విషయం అనీ చెప్పేవారి వాదాన్ని గాంధీజీ సిద్ధాంతం అంగీకరించదు. మనుష్యునికి లభించిన సర్వశక్తులూ అతనివి కావు. శరీర దార్ఢ్యం కలిగిన వ్యక్తి నేను పరిశ్రమను చేయను అని అనడానికి వీలులేదు. అదే విధంగా తన బుద్ధిగత, శరీరగత, ఇంద్రియగత శక్తులను అతడు నష్టపరిచడానికి గూడా వీలు లేదు )

అయితే ఇక ఈ ఆస్తికి యోగ్యుడైనఅధికారి ఎవరు? అని ప్రశ్న వస్తుంది. సృష్టిఅని, ఆ ప్రశ్నకు జవాబు. ఒక కార్ఖానాలోని భాగాన్ని అనుభవించే హక్కు గలిగినవాడు, ఆ కార్ఖానాను నడుపుటకు ఉపయోగపడేవాడు మాత్రమేనని అనడానికి గూడా వీలులేదు. కనుక ప్రతి వస్తువునూ అందరూ కలసి ఉపయోగించడం నేర్చుకోవాలి. అందులో మనుష్యేతర ప్రాణులు గూడాచేరుతవి.

మనుష్యుని దృష్టికి గల హద్దుల ననుసరించియే ఈ సిద్ధాంతం అమలు పరచబడుతుంది. మొదట అది స్థానిక క్షేత్రంలోనే అమలు పరచబడుతుంది. ఆ క్షేత్రంలో గూడా మనుష్యజాతి మీదనే మొదటి ప్రయోగం జరుగుతుంది. అతని దృష్టి, అతనికి గల సాధన సంపత్తి విశాలమైన కొద్దీ అతని క్షేత్రం గూడా విశాలమవుతుంది. ఆ క్షేత్రాన్ని ఎంత ఎక్కువగా విశాలంగా పెంచగలిగితే అంత విశాలంగా పెంచాలి. ప్రపంచంలోని మరింకొక భాగంలో ప్రజలకు కష్టం కలుగుతుంటే స్వావలంబన సిద్ధాంతాన్ని అనుసరించిన గ్రామంగూడా పండిన పంటనంతనూ తానే ఉపయోగించుకొనేటందుకు హక్కు కలిగిఉండదు. ఆ పీడిత ప్రజలకు ఉపయోగించే వస్తువులు ఆ గ్రామస్థుల దగ్గర ఉండి, వీరికి పనికి వచ్చేవి ఆ పీడిత ప్రజల దగ్గర లేకపోతే, లేక ఉన్నా వారికి ఇవ్వడానికి తగిన శక్తి లేకపోతే వారినుండి తమ వస్తువుల కిమ్మత్తును గూడా ఈ గ్రామస్థులు అడగడానికి వీలులేదు.

మనుష్యునికి వ్యక్తిగతమైన ఆస్తి ఎంత ఉండవచ్చును అనే ప్రశ్నకు ఇక జవాబు చెప్పడం తేలిక అనుకొంటాను. పని చేస్తే వాడికి సామాన్యనియమాల ప్రకారంగా కొంత వేతనం, ప్రతిఫలం నిశ్చితమైతే, అది అతనికి అవసరమైనంత లభించినా అతడు దానిని ఖర్చు పెట్టుకొనేటప్పుడు గూడా ఎంతో వివేకంతో ప్రవర్తించవచ్చును. అతడికి అంత వేతనం— ప్రతి ఫలం— అనవసరమైతే దానిని అవసరమైనవారికి యిచ్చి వేయవచ్చును, లేక అందరికీ ఉపయోగించే ఉమ్మడి దుకాణానికి చేర్చవచ్చును.

ఈ సిద్ధాంతాన్ని స్పష్టంగా తెలుసుకొంటే ఇటు భూములనూ, కార్ఖానాలనూ లాగివేయవలెననీ, అటు దానికి ప్రతిఫలం ఇవ్వవలెననీ అనే రెండింటినీ ఎందుకు గాంధీజీ అంగీకరించడం లేదో బోధపడుతుంది. నేటి జమీందారులూ, ధనవంతులూ ట్రస్టీ సిద్ధాంతాన్ని అంగీకరించి ధర్మకర్తలుగా తమ కర్తవ్యాన్ని నిర్వహించడానికి సిద్ధంగా ఉంటే వారి నుండి భూములనూ, కార్ఖానాలనూ లాగి వేయవలసిన అవసరముండదు. ధర్మకర్తనుతొలగిస్తే అతనికి ప్రతిఫలం ఇవ్వవలసిన అవసరం లేదు. అందువలన భూములను తీసుకొన్నందుకు ప్రతిఫలాన్ని చెల్లించవలసిన అవసరం లేనే లేదు. మేము ధర్మకర్తలుగా ఈ ఆస్తిని సంరక్షించము, మాకు ఈ ఆస్తి మీద అధికారం ఉన్నదని అంటే ఆ మాటలేమీ చెల్లవు. పైపెచ్చు అట్లాంటి

మాటలనేవారిని తొలగించి క్రొత్త వ్యవస్థను సృష్టించడం చాలా అవసరమవుతుంది. కనుక ప్రతిఫలం ఇవ్వడమన్న సమస్య లేనేలేదు.

# వికేంద్రీకరణము సామాన్య జీవితము

గాంధీజీ ఉత్పాదనకనువైన శరీర పరిశ్రమలూ, చిన్న చిన్న, స్వావలంబనసిద్ధాంతాన్ని అనుసరించే సమాజాలూ, రాజకీయం గానూ, ఆర్థికంగానూ వికేంద్రీకరణా, సామాన్య జీవిత నిర్వహణా మొదలగు విషయాలకు ఎక్కువ ప్రాధాన్యతను ఎందువల్ల ఇస్తున్నారో పాఠకులకు బోధపడియే ఉంటుందను కొంటాను.

ఈనాటి మన జీవితం అనేకమైన చిక్కులలో చిక్కుకొని ఉన్నది. అందువలన మన హృదయాలలో భూతదయ, అహింసా భావము, శాంతి, మైత్రీభావము, మొదలగువానిని అభివృద్ధి పరచుకొనవలెనని ఎంత కోరిక ఉన్నా ఎందుకో అది సమకూరడం లేదు. మానవ, మానవేతరప్రాణుల శోషణా, వినాశమూ, అత్యధికమైన పరిశ్రమ వృథా అయి పోవడం, ఆధునిక వైజ్ఞానిక పద్ధతులమీద ఎల్లప్పుడూ యుద్ధానికి సన్నద్ధులై ఉండడం మొదలైనవి ఈనాడు మన జీవితక్రియలయి పోయి నవి. మనం ఉపయోగిస్తున్న వస్తువులు ఎక్కడ నుండి వస్తున్నవో,

ఎలా వస్తున్నవో, ఎలా తయారవుతున్నవో, అవి ఎలా వితరిత మవుతున్నవో, మనుష్యుల ఆర్థిక శక్తిపై వాని తాలూకు ప్రభావం ఎలా పడుతున్నదో అసలు మనకు తెలియనే తెలియడం లేదు. జీవిత నిర్వహణావ్యవస్థ ఈనాటికంటె కొంత సరళమై పోతే వ్యర్థమైన ఈవినాశమూ, వ్యయమూ చాలా వరకు తగ్గిపోతవి. వికేంద్రీకరణం వలన తేలికగా తయారు చేయడానికి వీలైన వస్తువులు అనేక మున్నవి. పండ్లపొడిని ప్రతి గ్రామంలోనూ తయారు చేసుకొనవచ్చును గదా? కాగితాలనూ, సిరానూ ఎక్కడ బడితే అక్కడనే తయారు చేసుకొనవచ్చును. రాటాలూ, మగ్గాలూ అలాంటివే. ఇంకా అవసరమైన ఇతర మైన వస్తువులు జిల్లాలలో తయారుచేయబడవచ్చును. సాధారణ పరిస్థితిలో ఏగ్రామమూ, భోజనమూ, గుడ్డలూ, ఇళ్లూ నిర్మించు కొనడానికి కావలసిన సాధనాల విషయంలో ఇతర గ్రామాలమీద ఆధారపడగూడదు. కాని పరిస్థితులు అలా లేవు. బొంబాయిలో స్వదేశవ్రతావలంబకులు కలకత్తా పళ్లపొడి, కేరళ దేశపుసబ్బు, ఆంధ్రదేశపు సిరా, రాజస్థానపు చేతి కాగితం, టిటాఘుర్ మిల్లు కాగితం, మద్రాసు, లేక బంగాళాప్రాంతపు తోలు సామానులూ కొంటున్నారు. బొంబాయి పళ్లపొడి కలకత్తాలో అమ్మబడితే బంగాళాదేశపు సబ్బు కేరళదేశంలో చలామణీ అవుతున్నది. నిష్కారణంగా రాకపోక సాధనాల కయ్యే ఖర్చులతో వస్తువు లన్నీ నాశనమయి పోతున్నవి.

వికేంద్రితమైన ఉత్పాదనలో వస్తువులను, ఉత్పత్తి చేసే వారూ, ఒకచోటికి చేర్చేవారూ, ఇటు ఉపయోగించేవారూ ఒకరినొకరు గుర్తించుకొని ఉంటారు. ఎవరి జీవితం ఎలా జరుగు తున్నదో ఇద్దరూ తెలుసుకొని ఉంటారు. కనుక రాజనైతిక వ్యవస్థ వికేంద్రితమై నిజమైన ప్రతినిధులు ఎన్నుకొనబడితే జాగ్రదవస్థలో ఉండే ప్రజాతంత్ర విధానమునకు గాను ఉపయోగించే ప్రణాళికలను తయారు చేయడం, వాటిని అమలు పరచడం చాలా తేలిక అవుతుంది లోటుపాట్లు గానీ తప్పులు గానీ కనపడితే వెంటనే సర్దుకోడానికి వీలుంటుంది. ఎక్కువ నష్టం కలగడానికి వీలుండదు. హింస లేకుండా, ఫలానా చెడు పనిని చేయకుండా ఈపనిని చేయడం అసంభవమని తెలియడం తోనే దానిని చేయడమా మాని వేయడమా అని ఆలోచించ డానికి వెంటనే అవకాశం కలుగుతుంది. చేయడానికి నిశ్చ యించు కొంటే జాగ్రత్తగా తెలిసి చేయడం జరుగుతుంది. ఉదా హరణకు చూడండి, లివరుమందులు, టీకాలు, మొత్తని చెప్పులూ, చేతి సంచులూ. మొదలైనవానిని ఉపయోగించడం, పందులు, కోతులు మొదలైన వానిని చంపడం అడవి ఆవుల సమస్య, గోవులను, గేదెలను చంపడం, పనికిరాని పశువులను చంపడం, వనస్పతి నెయ్యిలాంటి అనేక విషయాల లో ఎంత హింస అనివార్యమో, దానిలో మనకున్న బాధ్యత ఎంతో మనకు తెలియడం లేదు. జరిగే హింస మనకు

తెలియకుండా ఎక్కడో జరుగుతున్నది. ఒకచోట హింసవలన లభించిన ప్రయోజనాన్ని అనుభవిస్తూ హింసను నిషేధిస్తున్నాము. ఇంకొక చోట హింసను పెంచుతున్నాము. కేంద్రీకృత పరిశ్రమలలో తయారైన వస్తువులను ఉపయోగించే వారికిఆవస్తువులు ఎక్కడనుండి అందమైన పెట్టెలలో పెట్టబడి వస్తున్నవో తెలియడం లేదు. డిజిటిస్ అనే మందును వనస్పతి వలన తయారవుతున్నదిగదా అని భావించి హృదయ దౌర్బల్యరోగానికి వాడుతున్నారు. కాని ఆమందును సీసాలలో నింపేటప్పుడు మనుష్య శరీరానికి అపకారం చేయకుండా ఉండే నిమిత్తం తగినంత మాత్రలను తయారుచేయడానికి గినీపిగ్ను (పందిని) చంపుతున్నారని తెలుసుకోడం లేదు. అహింసా భక్తునికి గూడా ఈవిషయం తెలియదు. డిజిటిస్ ఎలా తయారవుతున్నదో అసలు అతనికి తెలియదు.

ఇదే విధంగా కేంద్రీకృత వ్యాపారం ద్వారా మనం కోతులను విదేశాలకు ఎగుమతి చేస్తున్నాము. ఈ కోతులు మన భూములను పాడుచేస్తున్నా వాటిని గుండు వేసి చంపితే మనం సహించము. కాని ఆ కోతులనే విదేశాలకు పంపుతూ ఉంటే మన కేమీ చీమ కుట్టినట్లు అనిపించడంలేదు. అమెరికా వారు ఈ కోతులనన్నింటినీ పెంచడానికి హనుమంతుని భక్తులా? ఈ కోతులు వైజ్ఞానిక ప్రయోగాల కొరకై ఎంతో బాధల

పాలవుతున్నవి. మనకు ఆ మాట అసలు తోచడమే లేదు. ఆ దృశ్యాలనన్నింటినీ మనం కళ్లతో చూస్తే తుపాకితో కోతులను చంపనైనా చంపుతాము గాని అమెరికాకు పంపము. పట్టణాలలో పాలు కావలసివస్తే పాలిచ్చే గొల్లలు పశువులకు ఎలాంటి యమ యాతనను కలుగజేస్తున్నారో మనకు తెలియడంలేదు.

ఈ విధమైన సామాన్య జీవితమూ, సాధారణమైన రాజకీయ సాంఘిక వ్యవస్థా రెండూ అహింసకసమాజ నిర్మాణానికి ఎక్కువగా అనుకూలమయిన పరిస్థితులను ఏర్పాటు చేయగలవు. కేంద్రీకృతమైన, పెద్ద ఎత్తున జరుపబడే ఉత్పాదనలో హింస జరగడం అనివార్య మవుతుంది. ఎందువల్లనంటే ఆ ఉత్పాదనను సంగఠిత పరుచుటకు, రక్షించుటకు వ్యయదాయకమయిన రాజకీయ తంత్రములూ, దేశపు రాబడిలో నుండి ఎక్కువ భాగాన్ని మింగివేసే యుద్ధసామగ్రి అవసరమవుతుంది. అందువలన అనేకమైన ఆర్థిక సమస్యలు ఉత్పన్నం కావడం, ఆ సమస్యలను ఎదుర్కొన లేక, నిపుణులయిన ఆర్థిక శాస్త్ర విశారదులు కూడ తల్లక్రిందులు కావడం జరుగుతున్నది. పెద్ద పెద్ద యంత్రాలు అభివృద్ధిలోనికి వచ్చి, తదనుగుణ్యమయిన జీవిత వ్యవస్థ ఏర్పడుటతోనే ఆవిరి పెట్రోలు, విద్యుచ్ఛక్తి యంత్రాలు, యంత్రపరికరాలు నియంత్రితమవుతవి. అంతే కాదు. మనుష్యుడుకూడా యంత్రంవలే నియంత్రణ క్రిందికి వచ్చివేస్తాడు. దానికి ఫలితంగా అతనికి ఉన్న

స్వాతంత్ర్యం అడ్డగించబడుతుంది. అతనికి వున్న వ్యక్తి స్వాతంత్ర్యం అణచివేయబడుతుంది. చివర చివరకు మనం ఏ స్థితికిలోనికి చేరతామంటే మనం తినే తిండీ, కట్టుకొనే గుడ్డలూ, నివసించే ఇళ్లూ, చేసేవృత్తులూ మొదలైనవన్నీ కేంద్ర ప్రభుత్వం ద్వారా నిర్ణయింపబడి మనముందుకు తీసుకొనరాబడతవి. కేంద్ర ప్రభుత్వంవారిచ్చిన ఆదేశాన్ని వచ్చినట్లు మనం అంగీకరించ వలసివస్తుంది.

సామాన్య జీవిత క్రమాన్ని అనుసరించినంత మాత్రం చేత హింస, అన్యాయాలు. కష్టాలు, తొలగిపోతవా అంటే జవాబు చెప్పటం కష్టమే. పూర్తిగా తొలగిపోవు. కాని దానిలో మనుష్యునికి సంపూర్ణమయిన స్వాతంత్ర్యమూ, సద్భావమూ, శాంతీ లభించగలవు. హింసాహింసలు ఆధ్యాత్మికంగా, నైతికంగా, మానవుడు పొందిన వికాసానికి అనురూపంగా ఉంటే, గుణాలు, ఒక కేమూసలో పోసినట్లుగా వుండే జీవిత విధానాన్ని అనుసరించినంత మాత్రంచేత ఉత్పన్నమయ్యేవీ, నశించేవీ కావు. అహింస, సత్యము ఇవి దైవీ సంపదకు సంబంధించిన గుణాలు. సత్యము, దయ, క్షమ, ఉదారత, ప్రయత్నశీలత మొదలగు గుణాలు లేనిది అహింస ఒక్కటే సిద్ధంగా లభించదు. మంచి చెడు వివేచన లేనిది అహింస నిలవదు. రాగద్వేష భరితుడు అహింసావలంబకుడు కాలేడు. కనుక ఈ గుణాలన్నీ పరస్పర సహా

కారంతో అభివృద్ధిని పొందేవే. గుణం దృష్టితో ఆలోచించి నప్పుడు గ్రామాలలో అత్యాచారాలు చేసే కరణం మున్సి ఫులూ, వర్తకులూ, నాజీజర్మనీలో యహూదులను ఒక గదిలో ఉంచి విషవాయు ప్రయోగంతోవారి నందరిని చంపివేసిన హంత కులూ, పెద్ద పెద్ద యంత్రాలయాధిపతులు ఏర్పాటుచేసుకొన్న చిన్న చిన్న సంఘాలూ,( సిండికేట్లు ) చీకటి బజారులో తిను బండా రాలలో రాళ్లూ రప్పలూ కలిపే మహాశయులకంటే తక్కువ వారు కారు. అయినా వీరు చేసే హింస వ్యాపకత్వాన్నీ, పరి ణామ భేదాన్నీ దృష్టిలో వుంచుకొని, ఎక్కువ తక్కువగా పరిగణింప బడవచ్చును. సామాన్య జీవితంలో ఆటంబాంబులతో పట్టణాలను నాశనం జేసి వేలకు వేల ప్రాణులను నాశనంచేసే కసాయి దుకాణాలకు మాత్రం స్థానం వుండదు.

జటిలంగాకాక సామాన్యమైన జీవిత వ్యవస్థ ఏర్పడితే లోటుపాట్లు యెందుకు జరుగుతున్నవో తెలుసుకొని వాటిని తొలగించుకోడానికి అవకాశం ఉంటుంది.

అందరి జీవితపు విలువలను ఒక్కటిగా లెక్క గడితే బాగుండదా అని ఒక ప్రశ్న రావచ్చును. దానిని వ్యావహారిక జీవితంలో అమలు పరచటం సంభవంకాదు. ఒక చిన్న గ్రామం లో కూడా వేరు వేరు జీవితపువిలువలు గలిగిన ( స్టాండర్డు ) వ్యక్తులు ఉంటూనే ఉంటారు. గాంధీజీ ఆశించినట్లుగా వ్యక్తి

స్వాతంత్ర్యానికి విలువ పెరిగి మానవునికి సమస్త స్వేచ్ఛలు లభించినప్పుడు జీవితపు విలువలలో వ్యత్యాసం ఉండటానికి అవకాశం ఎక్కువ లభిస్తుంది.

అయినా గాంధీజీ ఆశించిన వ్యవస్థలో యీ నాడున్నంత జీవితపువిలువల భేదం ఉండదు. ధనికవాదం అమలులో ఉన్నా సంపదకలిగిన వాడు ఆ సంపదను తన యిష్టం వచ్చినట్లుగా ఉపయోగించుకోగలిసినా, గ్రామాలలో ఉండే కోటీశ్వరుడు బొంబాయిలో తన సోదరునికున్నంత విశాలమయిన భవనాన్ని కలిగిఉండడు. గ్రామాలలో ఉండే వర్తకులు ఆ గ్రామంలో ఉండే జనాన్ని ఎరిగియే ఉంటారు. కనుక ఆ కోటీశ్వరునికీ, ఆ వర్తకులకూ ఆ గ్రామంలో నివసించే జనానికీ అవినాభావ సంబంధం ఉంటూనే ఉంటుంది. అందరూ కలసిమెలసి ఉంటారు. ఒకరి జీవిత విధానాలతో ఇంకొకరు పరస్పరం పరిచయం కలిగి ఉంటారు. బొంబాయిలో ఉండే కోటీశ్వరునికి పక్క యింట్లో వుండే వ్యక్తిగూడా అపరిచితుడుగానే ఉంటాడు. గ్రామాలలో బీదలు మట్టి కుండలనూ, కోటీశ్వరుడు ఇత్తడి బిందెలనూ, కొన్ని కొన్ని సందర్భాలలో వెండి పాత్రలనూ ఉపయోగిస్తే ఉపయోగించవచ్చును. పల్లెటూరి కోటీశ్వరుడు దైవ పూజ కొరకు సామాన్యంగా వెండి పాత్రలను ఉపయోగిస్తాడు. కనుక సారాంశమేమంటే పట్టణాలలో ఉన్నంత ధనిక బీద వ్యత్యాసం గ్రామా

లలో ఉండదు. పెద్ద పెద్ద బ్రహ్మాండమయిన బల్లలూ, విలువ గలిగిన పింగాణీపళ్లాలూ, వెండిముళ్లూ, అందమయిన పూలూ, చిత్రపటాలూ, అత్తరు ఘుమఘుమాయింపులూ కలిగి, ఎంతో ఆకర్షణీయంగా కన్పించే నగరనివాసి అయిన కోటీశ్వరుని భోజన శాలకూ, ఆ భవనానికి సంబంధించిన ఆవరణలోనే ఎదో ఒక మూల ఆ యింటి నౌకరులే నివసించే రెండు మూడు చీకటి కొట్లుగల నౌకర్ల వంటియింటికి మధ్య ఉన్నంత భేదం గ్రామీణ వ్యవస్థలో ఉంటుందా?

బజారులలో తిరిగి చిల్లర వస్తువుల నమ్ముకొనే బీద వానికీ, చీకటి కొట్లోనే ఉన్న నౌకరుకూ మధ్య ఎంతో విభేదం మనం చూస్తున్నాము. ఎక్కడనో క్రింద అధఃపతితులుగా పడిపోయి ఉన్న పాకీవాళ్ల దుస్థితి మరీ హీనంగా ఉన్నది.

గ్రామాలలో ఉండే సేటు గారి భార్యా, పిల్లలూ శుభ్రమైన గుడ్డలు ధరించవచ్చును. వారుపయోగించే రాటము వగయిరా వస్తువులు ఖరీదు కలవైయుండవచ్చును. దీపావళి, దసరా మొదలయిన పండగ దినాలలో వారు ఎక్కువ అలంకరించుకొని తిరగవచ్చును. అయినా బీదయింటి గృహిణుల వలెనే యింటి పనులను నిర్వహించుకొనడానికీ, ఇంటి సమస్యలను పరిష్కరించుకొనడానికీ వారు కష్టించటం మనం చూస్తూనే ఉన్నాము. ధనవంతుల యింటి బిడ్డలయినా వారు సామాన్యజనంతో కలిసి

మెలసి ఉండటం మన మెరుగుదుము. సుఖ దుఃఖాదులలో పరస్పర సానుభూతితో వారు పాల్గొంటుంటారు. పట్టణాల పరిస్థితి అలా లేదు. కోటీశ్వరుల వర్గం వేరు. మధ్యమవర్గం వేరు. క్రిందివారి వర్గం వేరు. ఈ క్రింది వర్గాల వారు కనీసం మధ్యమ వర్గంతో కూడా కలవలేక పోతున్నారు. క్రింది వర్గాలవారు ఎలాంటి సమస్యలను ఎదుర్కొంటున్నారో, ఎటువంటి కష్టాలలో తమ జీవితాలను గడుపుతున్నారో ఉన్నత వర్గానికి చెందిన కోటీశ్వరులు గమనించటం లేదు.

చిన్న చిన్న వర్గాలకూ, వృత్తులకూ చెందినవారు పరస్పరం కలుసుకొంటూ ఉంటే, వారి జీవిత విధానాలు ఒకరి కళ్లముందు ఇంకొకరివి పడుతూ ఉంటే తెలియకుండానే ధనవంతుల జీవితంలో ఆత్మనిగ్రహభావం ఏర్పడి తీరుతుంది. ఒక చిన్న గ్రామంలో, చిన్న సమాజంలో నివసించే కోటీశ్వరుడు తన కళ్లయెదుట ఇతరులు బాధపడుతూ ఉంటే చూస్తూ ఊరుకోలేదు. ఇలాంటి ఉన్నత భావం ఏర్పడి, ఆభావ వికాసానికి మనందోహదం చేస్తే ధర్మకర్తృత్వ భావనకు అది ఎంతో సహకారి అవుతుంది.

సారాంశ మేమంటే ధర్మ కర్తృత్వ సిద్ధాంతం విఫలమై, వ్యక్తిగతమైన ఆస్తి ఎలా ఉన్నది అలాగే ఉండి పోయినా, సామాన్యమైన, ఆడంబర రహితమైన జీవిత విధానాన్ని మనం అలవరచుకొంటే దానివలన హింస తగ్గి పోవడానికీ, సమాజంలో ఉన్న వైషమ్యాలను తగ్గించి వేయడానికీ, ఆర్థిక కలహాలను అణచి వేయడానికీ ఎక్కువ అనుకూలత ఏర్పడుతుంది.

# ఉపసంహారము

గాంధీవాద, మార్క్సువాదాలలోని ముఖ్య సిద్ధాంతాల విచారణ పూర్తి అయినది. జీవితాన్నీ, జీవితసమస్యలనూపరి కించే విధానాలలోనే గాంధీజీదృష్టికీ మార్క్సువాద దృష్టికీ విభేద మున్నది హింసావర్జిత సామ్యవాదమూ, ఈశ్వరసహిత సామ్య వాదమూ అనే చిన్న చిన్న సూత్రాలతో ఈ విభేదం సమన్వయ మయ్యేది కాదు. గాంధీవాదానికి ధ్యేయం వర్గరహిత సమాజ వాద రాజ్యస్థాపన అనిగానీ "ధర్మాశ్రితమైన అరాజకత్వము గల అనగా వ్యవస్థితమైన రాజ్యయంత్రం లేకపోయినా సువ్య వస్థ కలిగిన సమాజనిర్మాణమని గానీ, లేక కేంద్రీకృతమైన, రాజ నైతిక, సామాజిక, పారిశ్రామిక, సాంస్కృతిక సంస్థలను విసర్జిం చడమని గానీ అనడం సరిగాదు.

సరియైన భాషలో చెప్పవలెనంటే గాంధీవాదం ఒకా నొక ఆదర్శం వైపునకు సాగిపోయే ఒక విశిష్టమైన పద్ధతి అన వచ్చును. గాంధీజీ మాటి మాటికీ ఇచ్చిన ఉదాహరణను ఉప యోగిస్తే ఇది ఒక ఆదర్శ భూమితి బిందువు. దాని హృదయం లో (అస్పష్టంగానైనా) ఏదో ఒక కల్పన ఉంటుంది. దానిని ఎంత సూక్ష్మమైన ముల్లుతోనైనా చూపించడం కష్టం. లేకపోతే ఉత్తుంగ హిమాలయ శృంగంతో దానిని పోల్చవచ్చును. దూరా న్నుండి చూస్తే దానిని అధిరోహించడం కష్టమని మనకు

తోచదు. అధిరోహించడం ప్రారంభిస్తే ఎంత దూరం ఎక్కినా చివరి శృంగం ఇంకా మనకు దూరంగానే ఉంటుంది. కనుక ఇది చాలా కాలం వరకు జీవితంలో అనుసరించవలసిన, చాలా కాలం పట్టే విధానం అయినా దీనిలో ఉన్న విశేషమేమంటే ఆ శిఖరానికి ఒక్క వ్యక్తి అయినా, ఒంటరిగానైనా చేరి ప్రపంచానికి మేలును సమకూర్చగలడు. సత్యాహింసలు, ధనం, జీవితసుఖ సాధనాలలో సమాన భావము, రాజ్యంలో నియంత్రిణ లేకపోవడం, వికేంద్రీకరణం, సంయమము, శాంతి, సద్భావము, మైత్రి, యుద్ధవిముక్తి, చట్టాలనుండి రక్షణ, సువ్యవస్థితంగా సమాజం ఉన్నా గూడా అధికమైన వ్యక్తి స్వాతంత్ర్యం, మొదలైనవన్నీ ఈ ఆదర్శ విధానంలోని అనేక రేఖలు. దీనిలో దేనినీ ప్రత్యేకంగా వేరుగా సిద్ధింపజేసుకోవడం సంభవం కాదు. వీనిలో ఏ రెండింటిని మాత్రమో మనం సిద్ధింపజేసుకుందామని ప్రయత్నం చేస్తే అది వ్యర్థ ప్రయత్నమయిపోతుంది. చివరకు చెడు పరిణామాలకు గూడా దారి తీస్తుంది. ఒకమూసలో కరిగిపోయడానికీ, లేక ఒక శాసనం ద్వారా సాధించడానికీ గూడా ఇవి లొంగేవి కావు. జీవితమంతా పట్టణంలోనే గడపిన ఒక కార్యకర్తను గురించి చెప్పుతూ గాంధీజీ "అతడు గ్రామీణ మనస్సు గలవాడు" అన్నారు. అతని మెదడు ఎప్పుడూ వస్తువులను తయారు చేయడానికి తగిన తేలిక వసతులను కల్పించడానికి కావలసిన ఉపాయాలను గ్రామీణ పద్ధతిలో ఆలోచిస్తూఉంటుంది. అందు

వలన అతని ఆలోచనల బలంతో స్వావలంబన సిద్ధాంతాన్ని అనుస రించే, స్థానికంగా లభ్యమయ్యే సాధనాలతో, సామాన్యమైన వస్తువులను ఒక గ్రామంలో ఉండియే సాధించవచ్చుననీ, అందుకు తగిన మనస్సు కలవాడు ఆ కార్యకర్త అనీ గాంధీజీ అభిప్రాయం. కవివరుడు రవీంద్రనాథ ఠాకురు గూడా గ్రామీణ భారత దేశానికి ఒక సందేశాన్ని వినిపించారు. ఆ సందేశంలో గ్రామ జీవిత సౌందర్యమూ, కళా, ఆనంద నిర్మాణమూ మొదలైన వానికి ప్రాధాన్యత ఉంటే గాంధిజీసందేశంలో పరిశ్రమా, శుభ్రతా, ఆరోగ్యమూ, సదాచార నిర్మాణమూ మొదలైన వానికి ప్రాధాన్యత ఏర్పడింది. గాంధీజీ రవీంద్రుని సందేశాన్ని తెలుసుకొని దానిని అంగీకరించినవారే. గ్రామ జీవితమంటే కళా విహీనమైన, సౌందర్యరహితమైన జీవితమని గాంధీజీ అభి ప్రాయం కాదు. కష్టాలనూ, దుఃఖ దారిద్ర్యాలనూ, అన్యాయా లనూ సహించి ఆత్మగౌరవాన్ని వదలిపెట్టడాన్ని గాంధీజీ ఏ మాత్రమూ అంగీకరించేవారు కారు. సౌందర్యాదులన్నీ ప్రార్థన, సంగీతము, నృత్యము, వృత్తిపరికరాలు మొదలగు అన్నింటిలో ఉండవలెనని గాంధీజీ ఆశించేవారు.

గాంధీజీ ఉపదేశించిన జీవిత సిద్ధాంతాల విషయంలో గూడా అనేకమైన విచిత్రమైన మాటలు దేశంలో వ్యాపించి ఉన్నవి. ఒక వైపు గాంధీజీ, తరతరాలుగా హిందూ ధర్మంలో ప్రబలంగా ఉన్న వైరాగ్యాది భావాల మూర్తి భవించిన

స్వరూపమనీ, ఆయన ఉపదేశించిన అహింస జైన వైష్ణవ సంప్రదాయగతమైనదనీ భావించడం జరుగుతున్నది. ఆయన ఉపదేశించిన సమ్మతకు అవమానాలను సహించడమనీ, ఆత్మవిలోపనానికి ప్రతీకారం చేయకుండా చెడుకు వశం కావడమనీ అర్థం చెప్పబడుతున్నది. రెండో వైపు పిరికితనంకంటే హింసయే శ్రేష్ఠమనీ ఆయన అన్న మాటకు యుద్ధాలకూ, హింసకూ ఆయన అనుకూలుడని అర్థం చెప్పబడుతున్నది.

నా ఉద్దేశ్యంలో ఇవిఅన్నీ గాంధీజీని అర్థం చేసుకోక చెప్పే మాటలు.

వ్యక్తిజీవితంలో కానీయండి, ఒక సంఘ జీవితంలో కానీయండి, వాటికి పూర్వాపర సంబంధం ఉన్నా లేకపోయినా ఒక ఆదర్శ స్థితిని పొందడానికి సతత ప్రయత్నమూ, ఆ ప్రయత్నానికి సంబంధించిన వ్యాకులతా ఉండాలి. ఆ ఆదర్శస్థితి లభిస్తే భౌతిక ప్రపంచంలో దాని రూపం ఎలా ఉంటుందో, ఏ పద్ధతిలో ఆ స్థితిని చేరడానికి మధ్య మధ్య ఎలాంటి మజిలీలను దాటవలసిఉంటుందో, ఆ ప్రయత్నంలో జరిగే తప్పులనూ, పొరపాట్లనూ ఎలా సరి దిద్దుకోనవలసి ఉంటుందో ఇవన్నీ ఎవ్వరికీ తెలియడం లేదు. వ్యక్తి జీవితంలోనూ, సమాజ జీవితంలోనూ కలుగవలసిన భవిష్యద్వికాస స్వరూపమూ, ప్రోస్వరూపమ్మూ, ఎలా ఉంటుందో అది గూడా

తెలియదు. కనుక "ఇదే సత్యమనీ, దీనిలో పొరపాటు ఏమీ లేదనీ ఎవ్వరూ అనగూడదు. మనుష్యుని బుద్ధికి హద్దు లున్నవని తెలుసుకోవాలి. జ్ఞానిగూడా ఒక సత్యశోధకుడే. అతని పరిశోధన గాఢాంధకార పూరితమైన రాత్రియందు, ఘోరారణ్యం మధ్యలోనుండి దోవతెలుసుకొని ప్రయాణం చేసినట్లుంటుంది. మధ్య మధ్యలో మెరుపు మెరిసి ఒక అడుగు దోవను మనకు చూపించి తిరిగి అదృశ్యమై పోతూ ఉంటుంది. తీవ్ర పరిశోధనచేసేవాడు ఎల్లప్పుడూ ఈ సత్యాన్ని దృష్టిలో పెట్టుకొని అన్వేషణ ప్రారంభించాలి. మానవబుద్ధికి గల ఈ హద్దును గాంధీజీ గుర్తించారు. ఆయన కార్డినల్ న్యూమాన్ రచించిన ఒక గీతాన్ని మాటి మాటికీ చదివి వినిపిస్తూ ఉండేవారు— ఆ గీతంలో— "నాకు ఒక్క అడుగు చాలు" అని ఉండేది. ఆచార వ్యవహారాలలో ఎంత సత్యమువున్నా, కొంత పొరపాటు గూడా ఉండవచ్చునని ప్రతి వాడూ భావించడం అవసరమని అయన ఉపదేశించి ఉన్నారు. పొరపాట్లు కంటికి కనపడడం లేదు, కనుక నేను చెప్పిందే ఉచితము అనుకోగూడదు: అందుకని తన కర్తవ్యమార్గాన్ని తాను వదలగూడదు. తన మాటను విశ్వసించని వారినందరినీ బెదరించి భయపెట్టగూడదు. అభిప్రాయ భేదం ఉన్నప్పుడు సంఘర్షణ ఏర్పడుతుంది. కనుక ప్రతివ్యక్తీ అహింసా పూర్వకంగా వ్యవహరించాలి. లక్ష్యమెంతపవిత్రమో, సాధనాలు గూడా అంత పవిత్రంగా ఉంటే ఎవ్వరికీ ఎలాంటి బాధా

ఉండదు. దానివలన నిజమైన ప్రజాతంత్ర ప్రధాన శాసనవ్యవస్థ గూడా ఏర్పడడానికి వీలుంటుంది. తనమార్గమందు తనకు నమ్మక మున్నప్పుడు, ఆ మార్గాన్ని ప్రచారంలోనికి తీసుకొని రావ డానికి ప్రయత్నించవలసిందే. కాని హింసాత్మక సాధనాల ద్వారా ఇతరులను భయపెట్టి ఆ పనిని చేయగూడదు. సాధన శుద్ధి విషయంలో నమ్మకం లేనివారు సాధనశుద్ధికి ప్రాధాన్యత నిచ్చేవారిని మోసగించవచ్చును. అందుకు వారు సిద్ధంగా ఉండాలి. ప్రతిపక్షంవారికి గూడా సాధన శుద్ధియందునమ్మక ముంటే శాంతంగానే పని జరుగుతుంది. ప్రతిపక్షీ అలాంటి నమ్మకం గలవాడు కాకపోతే సత్యాగ్రహం వరకు పోవలసి వస్తుంది. సత్యాగ్రహ పరిణామం హృదయ పరివర్తనం వరకు పోకపోయినా ప్రవృత్తిలో కొంత మార్పును తెచ్చినా చాలును. దానితో సంధికి అవకాశం ఏర్పడుతుంది. పూర్ణ హృదయ పరి వర్తనానికి ఇది ఒక మజిలీ అవుతుంది. ప్రతిపక్షీ మరీ పట్టుదల గలవాడయితే సత్యాగ్రహికి సంపూర్ణ ఆత్మవిలోపనం అవసర మవుతుంది. ఒకొక్కప్పుడు ఎదిరి పక్షం వారు గూడా సత్యా గ్రహులై మొదటి పక్షంలోని వారు అవలంబించిన విధానం సత్యాగ్రహంకాదనీ దురాగ్రహమనీ అని గూడా అనవచ్చును. అప్పుడు సత్యాగ్రహాన్ని అవలంబిస్తున్నామనే ఇరు పక్షాల వారి మధ్య కలహం ప్రారంభమవుతుంది. ఇది సామాన్యంగా జరగ దనుకోండి, అసాధారణ పరిస్థితులలో ఏమైనా జరగవచ్చును.

హింసాత్మక విప్లవంలో మార్పు తొందరగా వచ్చినట్లు కనపడుతుంది. నిజానికి ఎంత విశ్వాసం పొందడానికి ప్రజలు తగి ఉంటారో అంతే విశ్వాసం కలుగుతుంది. స్థిరమైన మార్పు అహింస ద్వారానే లభ్యం కాగలదు. దానికి మధ్యలో కొన్ని మజిలీలు ఉండవచ్చును. దానిలో సిద్ధాంతంతో సమన్వయం చేసుకోవడమనే ఆభాస ఉండవచ్చును. మొదటి సత్యాగ్రహి రెండో సత్యాగ్రహిచేసే వాదంలో గల సత్యాన్ని స్వీకరిస్తే వెంటనే రాజీ కుదిరిపోతుంది. విరోధుల జీవితంలో తొందరలో కలిగే మార్పులవలన కలిగే కష్టాలను తగ్గించే ఉద్దేశ్యంతో అన్ని అవకాశాలనూ కలుగజేసి, చివరిమెట్టువరకు పోవడానికి వీలును కలుగజేస్తే అది మధ్యమజిలీ అవుతుంది.

ఈపుస్తకాన్ని పూర్తిచేసేముందు రెండు మాటలను స్పష్ట పరచ దలచుకొన్నాను. ఈనాడు సామ్యవాదానికి వ్యతిరేకంగా చేయబడుతున్న ప్రచారాన్ని చూస్తే ఒక గ్రామంలో జరిగిన ఒక ఘటన నాకు జ్ఞప్తికి వస్తున్నది. అర్ధరాత్రి సమయంలో తోడేళ్ల గుంపొకటి గ్రామంమీదకు వచ్చి పడుతూ ఉంటే దానిని చూచి గ్రామస్థులంతా అరవడం ప్రారంభించారు. ఆ అరుపును విని ఆడవాళ్లూ, పిల్లలూ, తలుపులు వేసుకొని ఇళ్లలో ఒక మూల కూర్చున్నారు. ఆవులు, ఎద్దులు మొదలైన వానిని సురక్షిత స్థానాలకు చేర్చి మగవాళ్లు లాఠీలూ, గొడ్డళ్లూ తీసుకొని బయలు దేరారు. కొంతమంది గడ్డిని తగలబెట్టి వెలుతురు సృష్టించారు. మొదటి అల్లరి గ్రామస్థులను హెచ్చరించడానికి చేయబడింది. తోడేళ్లను భయపెట్టడానికి తదితరమైన పనులన్నీ చేయబడినవి. ఈనాడు ప్రజాతంత్ర వాదులూ, ఫాసిస్టు దేశాల

వారూ సామ్యవాదానికి వ్యతిరేకంగా చేస్తున్న హంగామా అంతా ఇలాగే ఉన్నది.

అమెరికాలాంటి దేశాలవారు తమ దగ్గర నున్న మారణాయుధాలతో సమాజవాదాన్ని నశింపజేయాలని చూస్తున్నారు. ఆర్థిక దిగ్బంధనాలతో సమాజవాద ప్రచారాన్ని అరికట్టగలమని అభిప్రాయ పడుతున్నారు. ఆపనినే చేయడానికి భారతదేశంలో మేము గాంధీజీ ఉపదేశించిన మార్గాన్ని అనుసరించమని చెప్పుతున్నాము. గాంధీజీని తమ జీవితంలో అనుసరించడం మానివేసి గాంధీజంమీద అతిశ్రద్ధ ఉన్నట్లుగా ప్రవర్తిస్తున్నాము. సామాన్యజనాన్ని మనవైపుకు ఆకర్షించుకోడానికి మార్క్సు వాదమూ, గాంధీవాదమూ ఒక్కటేననీ, ఏవో కొద్ది భేదాలు ఉన్నవనీ మాటలు చెప్పుతున్నాము. ఇక మన రాజ్యాంగ యంత్రం సమాజవాదులనూ వారు చేసే అత్యాచారాలనూ అణచి వేయడానికి తీవ్రమైన ప్రయత్నాన్ని చేస్తున్నది.

కాని ఈఉపాయాల వలన ఏమీ ప్రయోజనం లేదని నా నిశ్చితాభిప్రాయం. ఇలాంటి ఉపాయాలను అనుసరిస్తున్న సమాజవాద వ్యతిరేకులు చివరకు ఎగతాళి పాలవుతారనినా నిశ్చితాభిప్రాయం. సమాజవాదాన్ని అణచి వేయడానికి మనం ఎంతగా ప్రయత్నిస్తామో అది అంతగా అభివృద్ధి పొందుతుంది. ఆటంబాంబులనూ, హైడ్రోజన్ బాంబులనూ తయారు చేసీ, తమ స్వార్థసిద్ధికి కొన్ని దేశాలకు ధన సహాయం చేసి సమాజవాదాన్ని ఆపడానికి ప్రయత్నం చేస్తే అది జరిగేపని కాదు. గాంధీవాదనినాదాలను చేసి పెద్ద కంఠంతో అరచినా లేక

సమాజవాదులను జైళ్లకు పంపించి, వారి మీద తుపాకులను ప్రయోగించి సమాజవాదాన్ని ఆపజూచినా ఆపడం సాధ్యంకాదు: రాజకీయ పక్షాల వారంతా దండశక్తిని అంతిమ శక్తి అని విశ్వసిస్తున్నారు. కొద్ది కాలంవరకు ఆ దండశక్తి ఉపయోగించినా, ఫాసిస్టు ప్రభుత్వాన్ని నిర్మించినా దండశక్తి మీదనే ఎక్కువ కాలం జీవించలేము. గాంధీజీ ఉపదేశించిన మార్గాన్ని మనోవాక్కాయ కర్మలా అనుసరించడం జరగకపోతే భారతదేశంలో సమాజవాదం వచ్చి తీరుతుంది. అది రావడం తప్పని సరి అయిపోతుంది. కారణమేమంటే అర్ధ జాగ్రుతమై ఉండి ప్రజాతంత్ర రహస్య వేత్తలైన నాయకులు లేని సామాన్య జనం ప్రజాతంత్రం పేరటా, సునియంత్రిత మైన వికాసం పేరటా జరుగుతున్న అవ్యవస్థనూ, గుడ్డితనాన్నీ ఎదుర్కొనడానికి ఇంకొకమార్గం లేదు.

గాంధీజీమార్గానికీ, మార్క్సు విధానానికీ చాలా భేదం ఉన్నది. ఆరెంటింటికీ ఉన్న భేదం కంటే పూంజీవాద, జాతివాద, సామ్రాజ్య విధానాలకూ గాంధీవాదానికీ ఎక్కువ విభేదం ఉన్నది వాడున్న పద్ధతిలోనే ధనం పేరటా, జాతి పేరటా హెచ్చు తగ్గు భేదాలూ, అధికారాలూ ఉండి, ఆ అధికారాలను ఆవర్గాల వారు వదలిపెట్టకపోతే, తమసంపదను బాధ్యత గలిగిన నమ్మకస్తులైన ట్రస్టీలపరం చేయకపోతే, ఉన్నత వర్గాలు నిమ్న వర్గాలు అనే భేదభావాలను వదలిపెట్టకపోతే, సామాన్య జనంతో కలసి మెలసి ఉండకపోతే గాంధీజీలాంటి అహింసావలంబకుడైన మహానాయకుడు లేనప్పుడు సమాజవాదం దానితో బాటు హింసా వచ్చి తీరుతవి. ఆస్థితిలో గాంధీవాదం సమాజవాదానికి పూర్వావస్థ అని అనేవారి మాటలే సత్యమై పోతవి.

ఈమహాసంఘర్షణలో నుండి తప్పుకోడానికి ఒక్కటే ఉపాయ మున్నది. మనజీవిత విధానాలు మారి మనంనిరుద్యోగాన్నీ,ఆకలినీ పోగొట్టాలి. జాతిగత వర్గ గత భేదభావాలను మరచిపోవాలి. అంటరాని వారు, తాకరానివారు అనేపిచ్చిపిచ్చి వ్యవహారాలన్నీ సమసి పోవాలి. ప్రాంతీయతా భావాలూ, మత మౌఢ్యాలూ నశించి పోవాలి. జాతీయతలో స్వార్థమూ, హింసా ప్రవృత్తీ సామ్రాజ్య విస్తరణ కాంక్షా ఉండగూడదు. ప్రభుత్వంవారు అనుసరిస్తున్న శాసన విధానాలలో నైతికంగా అనేకమైన మార్పులు రావాలి. ప్రజాతంత్రం పేరట ప్రస్తుతమున్న ఆడం బరమంతా పోయి నిజమైన ప్రజాతంత్రం ఏర్పడాలి. ప్రభుత్వో ద్యోగాధికారులలో ఈనాడున్న దర్పమూ, అహంకారమూ పోయి, వారిలో కర్తవ్యనిష్ఠ ఏర్పడాలి. ఇవన్నీ జరిగినా వెంటనే గాంధీజీ ఆశించిన స్థితిని మనం పొందలేము. అయినా ఆ స్థితికి చేరుకోడానికి ఇవన్నీ మెట్లుగా ఉపకరించగలవు. ఈ మెట్లద్వారా నెమ్మది నెమ్మదిగా మనం పైకి ఎక్కడం నేర్చుకోకపోతే సమాజ వాదపు వెల్లువను ఆపలేము. ఏభక్తుడో భగవంతుని ప్రార్థించి ఈ వెల్లువను రాకుండాచేసే రోజులుగూడా ఇవికావు. ఆ మహాప్రవాహం రానేవస్తుంది. మహావేగంతో వస్తుంది. అడ్డు వచ్చిన వాటి నన్నింటినీ కూకటి వ్రేళ్లతో పెళ్లగించి వేస్తుంది. సమాజంలో ఉన్న మురికిని నాశనం చేయడమేగాక అనేక మంది నిర్దోషులను గూడా హతమారుస్తుంది.

ఇప్పటికీ ఇంకా సమయం మించిపోలేదు.ధనస్వాములు,అధికారులు సుఖ విలాసాలను వదలిపెట్టి, తమ సుఖంలో శ్రమ జీవులకుగూడా భాగాన్నిచ్చి వారితో సమాన ఫాయీలో వ్యవరిస్తే శాంతికిస్థాన మేర్పడుతుంది.భగవంతుడు మనకందరికీసద్బుద్ధిని ప్రసాదించుగాక.

పరిశిష్టము ౧

# గాంధీవాదము, సమాజవాదము

ఈ విషయాన్ని గురించి విస్తృతంగా చర్చించవలసినదని మిత్రులు చాలా మంది కోరుతున్నారు. కాని నాకు అంతగా మనసొరించ లేదు. అందువలన అనేకసార్లు ఆ కోరే మిత్రులను నిరుత్సాహ పరచడానికి ప్రయత్నం చేశాను. శాస్త్రార్థం చేయడమనేది మనకొక వ్యసనమయి పోయింది. రోగమయి పోయింది. వాదవివాదం నడిపించే నిషాలో ఈ వాద వివాదాలకు పరిణామం ఏమవుతుందనే విషయాన్ని గూడా మరచి పోతున్నాము. ఇక చర్చనీయాంశాలు ఎలా ఉన్నవంటే ప్రపంచం ఆఖరు వరకు చర్చించినా ఏకవాక్యత ఏర్పడేటట్లు లేనేలేదు.

కొన్ని అంశాలలో అసలు ఈ చర్చల విషయాలే అనిశ్చితంగా ఉన్నవి. గాంధీ వాదాన్ని గురించి ఆలోచిద్దాము. గాంధీజీ ఏమంటు న్నారు?

"గాంధీవాదమనే వస్తువు లేనేలేదు. ఏ సంప్రదాయాన్నీ నేను సృష్టించి వదలిపెట్టదలచుకోలేదు, నేను ఏదో కొత్త తత్వాన్ని, కొత్త సిద్ధాంతాన్ని వెదకిపట్టుకొన్నానని అనుకోడంలేదు. శాశ్వత సత్యాలను నిత్యజీవితంతో, నిత్య ప్రశ్నలతో కలపడానికి ప్రయత్నం చేశాను......... నేను పడిన అభిప్రాయాలూ, నేను చేసుకొన్న నిర్ణయాలూ, అవే చివరివి కావు. రేపు నేను వాటిని మార్చుకోవచ్చును. ప్రపంచానికి నేనేదీ కొత్తగా నేర్పదలచుకోలేదు. సత్యాహింసలు అనాదికాలం నుండి అమలు లో ఉన్నవే. నా చేతనైనంత వరకు వాటిని నానిత్య జీవితంలో ఉప యోగించడానికి ప్రయత్నం చేశాను. ఆ ప్రయత్నంలో నేను ఎన్నో పొర పాట్లు చేశాను. ఆ పొరపాట్ల వలన అనేక విషయాలను నేర్చుకొన్నాను గూడా. అసలు నేను సత్యవాదినే, కాని అంహింసకుణ్ని కాదు.........

సత్యోపాసన చేయగా చేయగా చివరకు ఈ అహింస నాకు లభించింది......

"నా తత్వజ్ఞానం— అంత పెద్ద శబ్దాన్ని ఉపయోగించడం యుక్తమైతే— నేను పైన చెప్పినదే. మీరు దీనిని గాంధీవాద మనకండి. ఇందులో వాదమేమీ లేదు" (హరిజనబంధు 29-3-36)

ఎవరి పేరు మీద వాదాన్ని ప్రచలితం చేయదలచుకొన్నామో ఆయన స్వయంగా ఇలా చెప్పుతూ ఉంటే ఆయన పేరుమీద పని చేసేవారు ఇంకొక వాదాన్ని అనుసరించే వారితో వాదోపవాదంలోనికి దిగితే అది ఎంత అనుచితంగా ఉంటుంది!

సరే, ఇక సమాజవాదాన్ని గురించి ఆలోచిద్దామా అంటే దానికి గూడా అందరూ అంగీకరించిన రూపమేదీ ఏర్పడినట్లు లేదు. అది ఒక తత్వ దర్శనమని అంటున్నారు. ఆ తత్వదర్శనం ఇంకా బాల్యావస్థలోనే ఉన్నది. అది గూడా ఒక తత్వదర్శన మనుకోడం వలన మానవ జీవితంతో సంబంధం కలిగిన ధార్మిక, నైతిక, రాజనైతిక, సామాజిక ప్రవృత్తులనన్నింటిని గురించీ ఆలోచించే ప్రయత్నం జరిగింది. జవాహర్‌లాల్ జీ ఏమంటున్నారో చూడండి:—

"జీవితంతోటీ జీవిత సమస్యలతోటీ సంబంధం కలిగిన ఒక విశిష్ట మనః ప్రవృత్తి ఈ వాదం వెనుక నున్నది. కేవల తర్కసమ్మతమైన న్యాయం కంటే దీనిలో విశేషమున్నది. కాని ఇదే విధంగా వంశ పారంపర్యంగా వచ్చే ధర్మమూ, చదువూ, భూత, వర్తమానకాలాల పరిస్థితుల సూక్ష్మ సంస్కారాలూ పొందదగిన వాని వలన ఉత్పన్నమయ్యే మనః ప్రవృత్తులతో కూడిన జీవితం తాలూకు సమస్యలను గురించి ఆలోచించే విభిన్నమైన దృష్టికోణాలుగ్గూడా ఉన్నవి"

(జవాహర్‌లాల్ ఆత్మకథ)

సమాజవాదం బాల్యావస్థలో ఉండడం వలన ప్రతి విషయం మీదా వేరువేరు సమాజవాదులలో అభిప్రాయ భేదాలు కలగడం స్వాభావికమే. యూరపులో సమాజవాదులలో అనేక రకాల మంది బయలు దేరారు. భారత దేశంలో గూడా రెండు మూడు రకాల సమాజవాదులు ఏర్పడ్డారు. ఒకే పంథాను అనుసరించే వారిలో గూడా చిన్న పెద్ద అభిప్రాయ భేదాలు రావడం గూడా సంభవమే. జవాహర్‌లాల్ ఉదాహరణను చూడండి. 1936 అక్టోబర్ 7 వ తేదీన ప్రేమబహాన్ కంటక్ పేర ఆయన వ్రాసిన ఉత్తరం ఒకటి బాంబే క్రానికల్ పత్రికలో ప్రకటించబడినది.

"వివాహానికీ, స్త్రీ పురుష సంబంధానికీ, సమాజవాదులకూ సంబంధమేమిటి? విశాలమైన అర్థంలో సమాజవాదానికి జీవితంలోని అన్ని భాగాలతోనూ సంబంధం ఉన్నా, సామాన్యంగా ఒక రకమైన ఆర్థిక వ్యవస్థకు సమాజవాదమని అర్థం. సమాజవాదాన్ని గురించి నేను ఎప్పుడు మాట్లాడినా ఆర్థిక సిద్ధాంతాన్ని దృష్టిలో పెట్టుకొని మాత్రమే మాట్లాడుతూ ఉంటాను. కనుక మతమనీ వివాహమనీ రకరకాలుగా సమాజవాదాన్ని గురించి మాట్లాడే మాటలన్నీ సారహీనమైనవి."

చాలా మంది సమాజవాదుల అభిప్రాయం ఇలా లేదు. కనుక సగం తెలిసిన సమాజవాదాన్ని దృష్టిలో పెట్టుకొని మాట్లాడినా ప్రయోజనం లేదు. సగం సగం జ్ఞానంతో వాదవివాదం చేయడం మొదలు పెడితే రెండు పక్షాలు ఏర్పడడమే తప్ప భావస్పష్టీకరణం జరుగదు. ఆ వాదంలో ఏవో రెండో మూడో బలహీనమైన విషయాలు దొరికితే వాటిని దృష్టిలో పెట్టుకొని తగాదాలు ప్రారంభమవుతవి. ఇక అసలు ఆ సిద్ధాంతా..

లను ఇరుపక్షాలలో ఎవ్వరూ అమలు జరపడానికి తయారుగా లేనప్పుడు ఈ వివాదాలవలన ప్రయోజనం గూడా ఏమీ లేకుండా పోతుంది. పై పెచ్చు ఈ రెండు సిద్ధాంతాలనూ అణచి వేయడానికి పూనుకొన్న వారికి సహాయంచేసినట్లవుతుంది. అణచివేయదలచుకొన్నవారు ముందే అన్ని విధాలా సంఘటితులై కూర్చుంటారు. జనసామాన్య క్షేమాన్ని గాక తమ క్షేమాన్ని మాత్రమే తాము కోరేవారు కావడం వలన వారిసంఖ్య తక్కువగా ఉండి వారి దగ్గర సాధనాలు ఎక్కువగా ఉండడంవలన వారి పక్షం చాలా బలంగా గూడా ఉంటుంది. రాజ్యశక్తి గూడా వారికి సహాయం చేస్తుంది. తత్ఫలితంగా ముందు ఒక పక్షాన్నీ తరువాత రెండవ పక్షాన్నీ అణచివేయడం ప్రారంభమవుతుంది. తెలిసీ తెలియక ఆవేశ పూరితంగా చర్చలు జరిపినప్పుడు ఒకరికంటే ఇంకొకరు మాటల్లో మించి పోదామని ప్రయత్నం చేయడం, దానికి ఫలితంగా విరోధాలు పెరగడం గూడా జరుగుతుంది. ఆ కారణం వలన ఒక పక్షాన్ని అణచివేస్తుంటే రెండో పక్షం మాట్లాడక ఊరుకొంటుంది. చివరకు రెండూ అణచివేయ బడతవి.

దేశహితాన్ని దృష్టిలో పెట్టుకొని మన భావాలను స్పష్టంగా వ్యక్తీకరించడం పనికిరాదని నా ఉద్దేశ్యం కాదు. విస్పష్టంగా ఆలోచించవలసిన సమస్యలు మన దేశంలో చాలా ఉన్నవి. ఎంతో ఆలోచించినాగూడా ఒక నిర్ణయానికి రావడానికి వీలులేని సమస్యలు గూడా కొన్ని ఉన్నవి. అలాంటప్పుడు విస్పష్టత రావడం సంభవంకాదు. కారణమేమంటే జీవిత వ్యవహార ప్రధానాలైన సమస్యలను గురించి స్పష్టంగా ఆలోచించడానికి కొన్ని విషయాలు స్థూలంగానైనా వారి దృష్టిలోనికి రావాలి. అది జరగ నంతవరకూ వారు ఆ విషయాలను గురించి ఆలోచించలేరు. తర్కించుకొని కొంత ఊహించడం సంభవించినా అది సరిపోదు, కనుక ఇలాటి సమస్యలు చర్చలవల్ల తేలవు.

ఈ దృష్టితో దేశసమస్యలను మనం తాత్కాలికములైనా అనివార్య ములనీ, దూరగతములనీ రెండు విధాలుగా విభజించుకొంటే మన దేశాన్ని స్వాతంత్ర్యం చేసుకోడానికి ఈ క్రింది విషయాలు అవసరమవుతవి. వీటి విషయంలో మన మనస్సులలో ఎలాంటి అసందిగ్ధతా ఉండకూడదు.

(1) దేశసేవ కొరకు ధన, మాన, ప్రాణ, శరీరాలను అర్పించే స్త్రీ పురుషులు వేల సంఖ్యలో ఉత్పన్నులు కావాలి.

(2) వారిలో సత్శీలమూ, లక్ష్య శుద్ధీ ఉండాలి. లేనిది ప్రయోజ నంలేదు.

(3) ఆత్మసుఖ పరాయణులైన నవయువకులు, తమలో ఉండే ఇంద్రియాసక్తిని దమింపజేసి, ఇంద్రియనిగ్రహానికీ, ఆత్మసంయమ నానికీ ప్రయత్నంచేయాలి. అలా చేయని వారిలో సత్శీలమూ, లక్ష్యశుద్ధీ ఏర్పడడం కష్టం. ఈ రోజున అవి ఏర్పడ్డట్లు భాసించి నా రేపటికి నిలవవు.

(4) స్వరాజ్యం లభించడానికి పూర్వం అనగా ఈ రోజు దేశ సేవకు సంబంధించిన వివిధ క్షేత్రాలలో పనిజేసే వారందరూ నెమ్మది నెమ్మదిగా జీవిత పర్యంతమూ సేవచేసేవారుగా మారాలి. ఆ సేవ కులు సంపన్న వర్గంలో నుండియో లేక బీద మధ్యమ వర్గంలో నుండియో రావాలి. వారందరూ సాదా జీవితాన్ని గడపుతూ శారీరక దృష్టిలో శ్రమయుక్తమైన జీవితాన్ని గడపాలి. మన నవయువకులూ, నవయువతీ మణులూ అందుకు తయారు కాక పోతే మన లక్ష్యం మనకు ఎన్నటికీలభించదు. సాదా జీవితమూ, శ్రమయుక్త జీవితమూ అనే దానిమీద అభిప్రాయ భేదాలు ఉండడానికికూడా వీలులేదు. అది చాలా ముఖ్యమైన విషయము.

ఈ మాటలు చాలా మందికి నచ్చక పోవచ్చును. కాని వారు ఏ వాదాన్ని అవలంబించేవారైనా ఈ సూత్రాన్ని అంగీకరించనిదే ప్రయోజనం లేదు. అది ఆధ్యాత్మిక తత్వజ్ఞానం కానీయండి, భౌతిక తత్వజ్ఞానం కానీయండి, ఏదైనా సరే, ఇంద్రియ నిగ్రహాదుల విషయంలో దానికి ఆసక్తి లేకపోతే, అది ఇంద్రియభోగ పరాయణత్వాన్ని ఎకువగా ప్రేరేపిస్తే స్వాతంత్ర్యం మనకు సంప్రాప్తంకాదు. ఇది ఒకనిశ్చితమైన సిద్ధాంతము. దీనిని మీరు తొందరగా అర్థంచేసికొన్నా ఆలస్యంగా అర్థంచేసికొన్నా మొత్తం మీద అర్థంచేసుకోవలసిందే. తొందరగా అర్థం చేసుకొంటే మేలుఉంటుంది.

( హరిజన సేవక్ 16-1-1937 )

## 2

గాంధీజీ మార్గాలు ఉత్కృష్టమైనవని భావించే వారికి రెండు మాటలు చెప్తాను.

గాంధీజీ భావాలలో—పద్ధతులలో—కొన్ని అచలమైనవి ఉన్నవి. గాంధీజీ మార్గాన్ని అనుసరించ దలచు కొన్నవారు ఆ పద్ధతులను అనుసరించి తీరాలి.

జీవిత సమస్యలనన్నింటినీ సత్యము, అహింస, సేవల ద్వారానే పరిష్కరించుకోవాలి.

“సత్యం” లో ఈ క్రింది విషయాలుంటవి. పట్టుదల లేకుండా సత్యాన్ని అంగీకరించడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండాలి. అసత్య మార్గంలో మనం ఎంత ముందుకు సాగి పోయినాసరే, వెనకకు తిరగడానికి సిద్ధంగా ఉండాలి. అందుకు సిగ్గు పడగూడదు. భయపడగూడదు. సత్యమని నమ్మినదాని కొరకై సర్వస్వాన్నీ సమర్పించడానికి సిద్ధంగా ఉండాలి.

హింస అనగా అధర్మాన్ని—పశుబలంతో గాక ఆత్మ బలంతో ఎదుర్కోవాలి. అహింస క్రియా రహితమైన అభావాత్మకమనోవృత్తి కాదనీ, ప్రవాహానికి ఎదురుగా నడిచే ఒకానొక క్రియాత్మక, భావనా ప్రధాన ప్రవృత్తిఅనీ గాంధీగారు అనేక సార్లు చెప్పి ఉన్నారు. ప్రపంచం లో పురాతన కాలంనుండి హింస ఉపయోగింప బడుతూనే ఉన్నది. బుద్ధినీ విజ్ఞానాన్నీ ఆశ్రయించి హింసాపద్ధతులను పరిపక్వం చేయడానికి ఎంతో కాలంనుండి హింసా శాస్త్రం తయారు చేయబడుతున్నది గూడాను. ఎదుటివారికంటే ఎక్కువ హింసాత్మక సాధనాలు తమ దగ్గర కలవారు భౌతిక లక్ష్యాన్ని సంపాదించడంగూడా తరచు చూస్తూనే ఉన్నాము. ఇది కేవలం అధర్మానికీ, అన్యాయానికీ వ్యతిరేకంగా మాత్రమే ఉపయోగింప బడుతుందని గూడా లేదు. ఈ విధానంలో బలమున్న వానికే జయం లభి స్తుంది. అతని పక్షం అన్యాయ యుక్తమైనదైనాసరే, ఎదుటివాడు బలవంతు డైతే వాడే జయిస్తాడు. ఇటలీ అబిసీనియా యుద్ధాన్ని మొన్న మొన్ననే చూచి ఉన్నాము. కనుక ఆధ్యాత్మిక దృష్టితో గాక వ్యావహారి దృష్టితో చూచినా హింసాసాధనంకంటే మరింకొక మంచి సాధనాన్ని వెదకడం అవసరమవుతుంది. విపక్షులను దండించిగాక, తాను కష్టాలను సహించి ఎదుటి వారి మనస్సును జయించే శక్తి ఇంకా వికసితం కాలేదు. గురుత్వా కర్షణ సిద్ధాంతాన్ని ప్రపంచానికి న్యూటన్ మహాశయుడు ప్రసాదించాడని వైజ్ఞానికు లంటున్నారు. దాని కర్థం ఆశక్తిని న్యూటన్ నిర్మించాడని కాదు గదా !! గురుత్వాకర్షణ న్యూటన్‌కు ముందే దేశంలో ఉండేది. ప్రజలు దాని ఉపయోగాన్ని పొందుతూ ఉండేవారుగూడా, కాని యథాశాస్త్రీయంగా, ఆ సిద్ధాంతం ప్రజలకు తెలియలేదు. అంతే. న్యూటన్ ఆరహస్యాన్ని బయట పెట్టడంతో ఇంకా అనేక కార్యపద్ధతులు ఏర్పడడానికి అవకాశం కలిగింది. అహింసను గాంధీజీ కనిపెట్టినారని అన్నా అలాగే ఉంటుంది. అహింస, లేక ప్రేమ అనే క్రొత్త వస్తువు ఇదివరకు

ప్రపంచంలో లేనిదీ, కొత్తగా కనిపెట్టబడినదీ కాదు. ఈవస్తువు ఆది కాలం నుండి ప్రపంచంలో ఉన్నదే. కొంతమంది ఈ వస్తువును ఉపయోగించి, దీని మహిమను ఎకువగా కొనియాడి ఉన్నారు. హింసవలె ఈ అహింసను గూడా అనేక రకాలుగా ఉపయోగించడానికి వీలున్నదనీ, ఇది ఒక బలవత్తరమైన శక్తి అనీ, దీని గర్భంలో అనేక శక్తులు ఇమిడి ఉన్నవనీ గుర్తించి గాంధీజీ ఈ విధానాన్ని తన జీవితంలో అమలు పరచడానికి ప్రయత్నం ప్రారంభించారు. హింసా క్షేత్రంలో టాంకులూ, విమానాలూ, విషవాయువులూ, బాంబులూ మొదలైన అనేక ఆయుధాలూ, అందుకు సహాయంగా, అంచగొండితనమూ, సి. ఐ. డి. నియామకమూ, అసత్యపు ప్రచారాలూ లాంటి అనేకమైన ఉపకరణాలు ఎంతో తెలివితో ఎంతో కాలం నుండి అనేక మంది బుద్ధిమంతుల సహాయంతో కనిపెట్టబడ్డవి. అందుకు ఎన్నో యుగాల పరిశ్రమా, అంతులేని డబ్బూ, అపారమైన శక్తీ ఖర్చుపెట్టబడినవి. అహింసను గురించి గూడా పరిశోధన జరగవలెనంటే అంత ప్రయత్నమూ జరగాలి. కనుక గాంధీ మార్గానుయాయులందరూ తమ జీవితాలలో అహింసను ఉపయోగించి, అందులో ప్రసుప్తంగా ఉన్న శక్తులనన్నింటినీ బహిర్గతం చేయాలి. స్వార్థ విముక్తమైన ప్రేమ అహింసకు అవసరము.

(హరిజన సేవక్ 22-5-1937)

3

గాంధీజీ విధానంలోని మూడో తత్వం సేవ. వాస్తవానికి ఇది వేరైన ఇంకొక అంగము గాదు. సత్యాహింసలను ఒకూచోట ఉపయోగించినప్పుడే ఇది ఉత్పన్నమవుతున్నది. వ్యావహారిక దృష్టిలో దీనికి అర్థమేమంటే జనసామాన్యానికి ప్రత్యక్షంగా సేవచేయకుండా సత్యము, అహింస, అపరిగ్రహము లాంటి విషయాలపై బ్రహ్మాండమైన ఉపన్యాసాలను ఇస్తే

ప్రయోజనం లేదు. వ్యాసాలు వ్రాయడం, ఉపన్యాసాలివ్వడం మొదలైన వన్నీ యంత్రాలతో సమానం. వాస్తవానికి యంత్రాలు దోష విహీనాలే— వాటిని ఎలా ఉపయోగించుకొంటే అలాంటి ఫలితాన్నిస్తవి. ప్రస్తుతం అహింసకులకంటే హింసకులే వాటిని ఎక్కువగా ఉపయోగించు కొంటున్నారు. కనుక మనం ఉపయోగించేసాధనాలు గూడా పవిత్రంగా ఉండాలి. జనసామాన్యానికి సేవజేయడం అలాంటి ఒక సాధనం.

సమాజంలో వ్యాపించి ఉన్న చిక్కు సమస్యలను విడదీయడానికి గాంధీజీ ఉపదేశించిన సాధనాలను గురించి తెలుసుకొన్నాము. బలవంతులు బలహీనులను ఏ విధంగా శోషింపజేస్తున్నారో గ్రహించి వెంటనే దానిని తొలగించివేయవలెనని సమాజవాదులు వలెనే గాంధీజీ గూడా ఆశిస్తున్నారు ఇంతేకాదు. గాంధీజీ ధనవంతులు, అధికారులు చేస్తూ ఉన్న శోషణ క్రియను మాత్రమేగాక బుద్ధిమంతులు తమ బుద్ధి సహాయంతో తెలివి తక్కువవారిని మోసగించి పొందుతున్న ప్రయోజనాలను గూడా ఆపి వేయువలెనని కోరుతున్నారు. ప్రపంచంలో ఎక్కడ శోషణ ఏ విధంగా జరుగుతున్నా సత్యాగ్రహపు ఉపాయాలతో వెంటనే దానిని ఆపివేయవలెనని గాంధీజీ ఆశిస్తున్నారు.

శోషణనూ, మోసాన్నీ ఆపడమనే ప్రశ్నకూ, వ్యక్తిగత సంపత్తికీ సంబంధముంటున్నది. పై రెండూ ఒక్కటేనని సామాన్యంగా భావించబడుతూ ఉంటుంది. గాంధీవాద సమాజవాదాలలో సామాన్యంగా ఈ విషయంమీదనే ఎక్కువ తీవ్రమైన చర్చలు జరుగుతుంటవి. నిజమేమని ఆలోచిస్తే గాంధీజీ భావాలు సామ్యవాదులకంటే గూడా ఈవిషయంలో ఎక్కువ తీవ్రంగా ఉన్నవి. గాంధీసిద్ధాంతాల ప్రకారం "పరిగ్రహాము" అనేది ఏ వ్యక్తిదగ్గరా ఉండగూడదు. వ్యక్తిగత సంపద్పరిగ్రహామును ఆయన అంగీకరిస్తున్నారంటే అది ఆయనకు ఇష్టమని అభిప్రాయంకాదు. మనుష్య

జాతి ఉత్కర్షకు అది అవసరమని గూడా ఆయన భావించడంలేదు. వ్యక్తిగత పరిగ్రహాన్ని నశింపజేయడానికి సత్యాగ్రహ మార్గానికి సంబంధించిన ఉపాయం ఆయనకు ఇంకా లభించలేదు. అన్ని పంథాలకు చెందిన సమాజవాదులూ మనుష్యజాతి సుఖ సౌభాగ్యాల కొరకు ధన పరిగ్రహణము అవసరమనే భావిస్తున్నారు. గాంధీజీ దానిని సిద్ధాంతరూపంలో స్వీకరించడం లేదు. నేటి భోజనానికి నేడూ రేపటి భోజనానికి రేపూ చెమటోడ్చి కష్టించవలెననే సిద్ధాంతంపై సమాజవాదులకు విశ్వాసం లేదు. గాంధీజీకి ఉన్నది. అది ఆదర్శానికి సంబంధించిన విషయమే. వ్యావహారిక దృష్టిలో ఈ ఆదర్శాన్ని వెంటనే సాధించడం సాధ్యం కాదని గాంధీజీ భావిస్తున్నారు. పోతే డబ్బున్నవారు ఏ దృష్టితో దానిని తమ దగ్గర అట్టి పెట్టుకోవాలి? అనేది ఒక పెద్ద సమస్య. సంపద ఒకరి దగ్గర ఉన్నా లేక కొంత మంది వ్యక్తులతో కలసిన ఒక సంఘం దగ్గర ఉన్నా, సంపద వారి దగ్గరకు మంచి మార్గంలో చేరినా, చెడు మార్గంలో చేరినా వారు దానిని తమ ఉపయోగానికి గాక సమాజం తరఫున సమాజోపయోగానికి మాత్రమే వినియోగించాలి. ఆ సంపదకు వారు ధర్మకర్తలు మాత్రమే. ఈ ధర్మకర్తృత్వ శబ్దం మూలంగా దేశంలో కావలసినంత పొరపాటు అభిప్రాయం పెంపొందింది. దానికి కారణం ఈ శబ్దప్రయోగం ద్వారా గాంధీజీ ఏ భావాన్ని గ్రహిస్తున్నారో అది ప్రజలకు ఇంకా బాగా అర్థం కాకపోవడమే. గాంధీజీ ప్రయోగించే శబ్దాలను గూడా రాజకీయార్థంలో తీసుకోవడం జరుగుతున్నది. ఇంగ్లీషువారు చాలా సార్లు మేము భారతదేశంలో భారతీయుల అభివృద్ధి కొరకు ధర్మకర్తలుగా శాసనం చేస్తున్నామని అని ఉన్నారు. కాని అందుకు వారు వ్యతిరేకంగా వ్యవహరించారు. గాంధీజీ విషయంలో గూడా ఇలాంటి సందేహం కలగడానికి అవకాశం ఏర్పడింది. గాంధీ ధనవంతుల పక్షపాతి అని అనడం అనేకసార్లు జరుగుతున్నది. గుండ్రబల్ల సమావేశంలో హరిజనులను హిందువుల నుండి వేరుచేస్తే గాంధీజీ తన

## ( 11 )

ప్రాణాలను సైతము బలిగా వదలు తానన్నారు. అప్పుడెవ్వరూ ఆ మాటను లెక్క చేయలేదు. ఇది గూడా వక్తృత్వకళలోని ఒక అలంకారమనుకొన్నారు. చివరకు గాంధీజీ అన్న ఆ మాటలు సత్యమైనవి. సంపద గలవారు ఆ సంపదకు ట్రస్టీలు మాత్రమే నంటే అదిగూడా వక్తృత్వకళకు సంబంధించిన ఒక అలంకారమని అనుకుంటున్నారు. శాసనసిద్ధమైన ధర్మకర్తృత్వంలోనూ, ధర్మసిద్ధమైన ధర్మకర్తృత్వంలోనూ భేదమున్నదని గూడా ఆక్షేపణ చేసేవారు భావిస్తున్నారు. ఈ ధర్మకర్తలు ఆ సంపదను ప్రజల మేలుకుగాక స్వంతానికి వాడుకొన్నా ఫరవాలేదులే అని ఆక్షేపణకర్తల అభిప్రాయం. గాంధీజీ భావం అదికాదు. ఆచరణలో పెట్టడానికి వీలులేని సాధనాలను ఆయన జనసామాన్యం ముందు పెట్టనే పెట్టరు. తన జీవిత నిర్వహణకు కావలసినంత తాను గ్రహించి మిగతా దానిని ఇతరుల అనుమతితో వ్యయపరచవలెను. ఆ అనుమతి బలహీనత వలన లభించినా, అజ్ఞానం వలన లభించినా మొత్తంమీద అనుమతి లభించవలసిందే. దౌర్బల్యం పోయి, జ్ఞానసిద్ధి కలిగినప్పుడు మిగిలిన సంపదమీద ధర్మకర్తగానే అధికారం కలిగిఉండడం సంభవిస్తుంది, కనుక ఈ నాడు అవసరమైన విషయం ఏమిటయ్యా అంటే బలహీనతను పోగొట్టి జ్ఞానాభివృద్ధికి పాటుబడాలి. జనసామాన్యంలోనుండి బలహీనతను అహింసామార్గం ద్వారానే తొలగించగలము. ఈ నాడు బీదగా ఉండి రేపు డబ్బు రావడంతోనే ఈ బీద గూడా ధనవంతులవలె ఉన్మత్తుడు కాకూడదు: హింసకుల కంటే అహింసకులను తయారు చేయడం తేలిక అని గాంధీజీ ఉద్దేశ్యము. గాంధీజీ, వారి అనుచరులూ ఈ అహింసను అమలు చేసి చూస్తున్నారు, గనుక ఈ చర్చను ఇంతతోనే వదలడం మంచిది.

(హరిజనసేవక్ 29-5-1937)

## 4

ఇంత వ్రాసిన తరువాత పైన వ్రాయబడిన దానిని దృష్టిలో నుంచుకొని గాంధీజీ ప్రస్తుతం అనుసరిస్తున్న విధానాలను వివరించడం ఉపయోగకర మనుకొంటాను. కాంగ్రెసులోనుండి వారు తప్పుకోడంతోనే సంతృప్తిపడి ఊరుకోలేదు. మగన్‌వాడిలో కూర్చొని గ్రామ పరిశ్రమలను ప్రోత్సహించడంతోనే సంతృప్తి చెందలేదు. చివరకు ఆయన టెలిగ్రాం ఆఫీసుగానీ, పోస్టాఫీసుగానీ లేని, బురదతో కూడుకొన్న సేగాంవ్‌కు వెళ్ళి కూర్చున్నారు. ప్రభుత్వాన్నీ, కాంగ్రెసునూ, పండితులనూ భయపెడుతున్న భీకర దేశసమస్యలను, పరిష్కరించే అహింసాత్మకమైన ఉపాయాలను ఆలోచించడం ఆరంభించారు. గాంధీజీ కొంత విశ్రాంతి తీసుకొంటున్నారు అని అనుకొని కొంతమంది తమలో తాము సంతృప్తిపడినా ఆయన అలా విశ్రాంతిని తీసుకొనే వ్యక్తి కారు. గ్రామీణ ప్రజానీకంతో సంబంధాన్ని పెంచుకొని ఈ సమస్యలను అహింసాత్మక విధానంతో పరిష్కరించే ప్రయత్నాన్ని ఆలోచిస్తున్నారు. తనచుట్టూ ఆయన గ్రామీణహరిజనసోదరులను చేర్చుకొన్నారు. వారిని ప్రోత్సహించి గాంధీజీ భూమిలోనుండి ధాన్యాన్ని ఉత్పన్నం చేయగలిగితే, మంచి పాలనూ, బెల్లాన్నీ తమకు తాము ఉత్పత్తి చేసుకొనే స్థితిలోనికి వారిని తీసుకొని రాగలిగితే, వారి గ్రామాలలో నుండే మురికిని పోగొట్టి వారిని ఆరోగ్యవంతులనుగా చేయగలిగితే సేగాంవ్‌లోని మనుష్యమాత్రునిలో సుప్తంగా ఉన్న శక్తులు బయటికి ప్రకాశంలోనికి రావా ? ఈ గ్రామీణులు యావద్భారతదేశ దృష్టినీ తమవైపుకు ఆకర్షింప జేసుకోగలుగుతారంటే అదేమీ అసంభవమైన విషయం కాదు. కాని అందుకు తగినకృషి జరగాలి. ఆవిషయం గాంధీజీకి తెలుసును. ఈశ్వరునికి అసంభవమనేది ఏదీ లేదు, గనుక మనుష్యులు అసంభవ మనుకొన్నవన్నీ సంభవం కాగలవని గాంధీజీ పూర్ణ విశ్వాసం. సత్యాహింసల స్వరూపమైన— ప్రేమమయమైన— భగవత్స్వరూపమునందు గాంధీజీకి సంపూర్ణమైన విశ్వాసమున్నది.

గాంధీజీ అవలంబించే కార్యపద్ధతిలో గల ఇంకొక విషయాన్ని తెలియజేసి ఈ వ్యాసాన్ని పూర్తి చేస్తాను. మానవసమూహాన్ని ఒక చోటికి చేర్చడంలో, ఉద్యమం లేవదీయడంలో గాంధీజీ పరిణత ప్రజ్ఞ కలవారు. ఆయన ఏ ఉద్యమాన్ని ప్రారంభించినా ప్రపంచదృష్టిని ఆకర్షించడం జరిగింది. ఆయన ఎన్ని ఉద్యమాలను ప్రారంభించినా వాటిలో ఒకటి విశేషముండేది. ఆ విశేషాన్ని మనం మరవగూడదు. ఆ విశేషమేమంటే జనాన్ని నడిపించడానికి అనువైన మార్గం తనకు దొరకనంత కాలమూ, ఎంత అన్యాయం జరుగుతున్నా సరే, ఆ అన్యాయాన్ని గురించి తనకు ఎంత తీవ్రమైన అభిప్రాయం ఉన్నా జనాన్ని మాత్రం ఆయన ఉత్తేజితులనుగా చేయరు. పత్రికలలో నాలుగు తడవలు ప్రకటింపబడి నీటి బుడగలులాగా క్షణంలో నశించిపోయే ఉద్యమాలను గురించి అసలు ఆయన ఆలోచించరు. ప్రజలభావాలను ఉత్తేజితంచేసి, అందుకు అవసరమైన కార్యక్రమాన్ని ఆయన ప్రజల ముందు పెట్టారంటే దాని వెనుక ఏదో మహత్తరమైన సత్యం నిండిఉన్నట్లూ, ఆ సత్యసిద్ధికై ఆయన ముందుకు సాగడానికి నిశ్చయించుకొన్నట్లూ మనం భావించవలసిందే. సంపూర్ణమైన శక్తి తనకు లభించనంత వరకూ ఆయన మౌనంగానే ఉంటారు. మిగతా మిత్రుల నందరినీ మౌనంగా ఉండమని చెప్తారు. అలాంటిస్థితిలో ఆయనను గురించి అనేకమంది తప్పుడు అభిప్రాయం పడడంగూడా సంభవించినా అందుకు ఆయన లెక్కచేయరు. అలాంటిది అనేకసార్లు జరిగింది.

శ్రద్ధతో కార్యరతులు కాదలచుకున్న గాంధీజీఅనుయాయులకు ఈ సామగ్రిచాలును. ఈనాడు దేశం ముందు అనేకమైన భయంకర సమస్యలున్నవి. ముందు ఉండగలవు. మనలో బుద్ధిమంతులూ విద్వాంసులూ అయిన వారు కొందరు ప్రత్యక్షానుశీలనం జరిపించి నిష్ణాతులు కావాలి. ఆ నిష్ణాతులు వాదవివాదాలలో దిగక, " ఒకటిఅడుగు ముందుకు వెళ్ళినా చాలు " అనే పద్ధతిలో కార్యక్రమాన్ని నడిపించాలి. అదిగాక ఏసమస్యను

గురించి అయినా వెంటనే ఒక అభిప్రాయానికి వస్తే అతని బుద్ధివికాసం ఆగిపోతుంది. ఈనాడు మనం ఏసమస్యలకు పరిష్కారమార్గాన్ని కనిపెట్టలేమో వాటిని గురించి వెంటనే ఒక అభిప్రాయానికి రాగూడదు.

గాంధీజీ విధానాలూ, వారి నిర్మాణ కార్యక్రమమూ చాలా మంది బుద్ధిమంతులకు ఈనాడు నచ్చడం లేదు. వారికి ఈ కార్యక్రమాలలో ఉత్సాహమేమీ కనపడడం లేదు. కాని అందుకు మనం చేయగలిగింది గూడా ఏమీ లేదు. ఈవిషయమై వాద వివాదాలు జరిపి ప్రయోజనం లేదు. ఎవరి భావాలు వారివి. మనకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నారని కోపగించుకుంటే ప్రయోజనమేమీ లేదు. భావ వ్యక్తీకరణానికి అందరికీ స్వాతంత్ర్యముండాలి. అవతలివారు గాంధీజీ సిద్ధాంతాలను ఖండించినా అందుకు మనం కోపగించ కూడదు. ప్రత్యక్ష ప్రమాణాలతో సత్యాన్నీ, అహింసామయ ప్రవృత్తుల పరిణామాలనూ అనుభవంలో చూపిస్తే వారు మన మార్గానికి వస్తారు.

గాంధీజీ కోరికకు వ్యతిరేకంగా గూడా గాంధీవాద శబ్దాన్ని ప్రచారంలోనికి తీసుకొని రావలెనని భావిస్తే అది ఒక కార్యపద్ధతిని సూచించే శబ్దమనీ, ఒకానొక వ్యక్తిచే ప్రతిపాదింపబడిన సాంఘిక వ్యవస్థా నిర్మాణ సూచక శబ్దం కాదనీ గుర్తులో ఉంచుకోవాలి.

( హరిజనసేవక్ 5-6-1937 )

---

పరిశిష్టం ౨

# గాంధీజీ సామ్యవాదము

కొంతమంది సామ్యవాదావలంబకులైన మిత్రులతో సంభాషిస్తూ గాంధీజీ నేనే సరియైన సమాజవాదినని అనేకసార్లు అన్నారు. ఇద్దరి ధ్యేయమూ ఒకటే. కాని కార్య పద్ధతులు వేరువేరుగా ఉన్నవి. సాంఘిక వ్యవస్థను హింస, అసత్యముల ద్వారా మార్చడంలో గాంధీజీకి విశ్వాసంలేదు. దాని వలన భారతదేశంలోని కోట్లకొలది వ్యక్తులకు ప్రయోజనం కలగదని ఆయన అభిప్రాయం. ఆగాఖాన్ భవనంలో డెటిన్యూగా ఉన్నప్పుడు గాంధీజీ సామ్యవాద సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. ఆయన ప్రతివిషయాన్ని గురించీ శాస్త్రీయదృష్టితో ఆలోచిస్తారు. అక్కడక్కడ మిత్రుల వలన విన్నమాటలతో ఆయనకు సంతృప్తి కలగక మార్క్సు వ్రాసిన కాపిటల్ నూ, స్టాలిన్, లెనిన్, ఏంగిల్సు మొదలగువారు వ్రాసిన చాలా పుస్తకాలను గూడా చదివారు. ఇవన్నీ చదివిన మీదట తాను ఊహిస్తున్న సామ్యవాదమే నిజంగా దేశానికి ఉపయోగిస్తుందని ఆయన నిశ్చయించుకున్నారు. అవసరాన్ని బట్టి వేతనం, శక్తిని బట్టి పని అనేసిద్ధాంతాన్ని ఆయన అనుసరించవలెనని కోరుతున్నారు. హిందూదేశపు ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని తాను ఊహిస్తున్న సామ్యవాద స్వరూపాన్ని తన ఆశ్రమంలో అమలులోనికితీసుకొని రావలెనని ఆయన ప్రయత్నం చేస్తున్నారు. అక్కడఉన్న గ్రామీణుల అనుమతితోనే ఆశ్రమవాసులు అక్కడ ఉంటున్నారు. ఒకసారి గ్రామంలోని ఒక తగాదాకోరు ఆశ్రమ వృక్షాలను కట్టెపుల్లలకు గాను నరికివేశాడు. అందు కతనికి హక్కులేదు. ఇంకొకడు ప్రతిఫలాన్ని తాను తీసుకొని గూడా తన పొలంలోనుండి ఆశ్రమానికి పోయేమార్గాన్ని అడ్డగించి

వేశాడు. అయినా అందుకు వ్యతిరేకంగా చట్టసమ్మతమైన ఏ వ్యవహారమూ నడిపింప బడలేదు. ఆశ్రమవాసులు గ్రామీణ ప్రజానీకానికి సహాయం చేయడానికి మాత్రమే అక్కడ ఉన్నారని మాత్రం విజ్ఞప్తి చేయ బడింది. గ్రామ వాసులకు ఆశ్రమం అక్కడ ఉండడం ఇష్టం లేకపోతే ఇంకొక చోటికి పోతామని చెప్పడంగూడా జరిగింది. చివరకు ఆగ్రామస్థులే ఆ తగాదా దారులను సరియైన మార్గానికి తీసుకొని వచ్చారు. సబర్మతీ ఆశ్రమంలో కొంతమంది తల్లులు తమ పిల్లల పోషణ భారాన్ని ఇకొక తల్లికి అప్ప గించి ఇతరతల్లుల పిల్లలను తాము పోషించారు. స్త్రీల విషయంలో అది ఒక మహావిప్లవం అనుకోవచ్చును. ఒకసారి ఒక మిత్రుడు తాలిమీ సంఘ హాస్టలులో భోజనంచేసి "గాంధిజీ దీనినే "రసోడా" అంటు న్నారు. దీనినే కమ్యూనిస్టులు కమ్యూన్ అంటున్నారు. కమ్యూన్ అంటే ఏదో కొత్తదనం మనకు కనబడుతున్నదని" అన్నాడు. ఎడిసన్ సృష్టించిన ఒక పాత్ర ఏనాటకంలోని ప్రతిపంక్తినీ నేను తెలుసుకొన గలుగు తున్నానో అది దుఃఖాంతనాటకం ఎలా కాగలుగుతుంది? అని ఆశ్చర్యాన్ని ప్రకటించలేదా ?

## ఆర్థిక సమానత్వమంటే అర్థమేమిటి?

మద్రాసులో జరిగిన నిర్మాణ కార్యసేవకుల సమావేశంలో ఒకరు "మీ ఉద్దేశ్యంలో ఆర్థిక సమానత్వ మంటే అర్థమేమిటి ? మీరు ధర్మ కర్తృత్వ మంటారు, దేనిని ?" అని గాంధీజీని ప్రశ్నించారు,

ఆర్థిక సమానత్వ మంటే అందరికీ ఒకే రకంగా డబ్బివ్వడమని అర్థం కాదు. ప్రతి స్త్రీకీ, పురుషునికీ అతనికి అవసరమైనంత డబ్బు లభించాలి. ఉదాహరణకు చూడండి. చలికాలంలో నాకు ఉన్ని దుప్పటి అవసరం కనూ గాంధీకి ఉన్ని దుప్పటి అవసరంలేదు. నాకు మేకపాలు, కమలా ఫలాలు, ఇంకొన్ని ఫలాలూ అవసరం. సామాన్యమైన ఏభోజనం

పెట్టినా కనూ గాంధీకి సరిపోతుంది. నాకు కనూను చూస్తే ఈర్ష్య అనుకోండి, కాని దానివలన ప్రయోజన మేమున్నది ? కనూ నవయువకుడు. నేను 76 సంవత్సరాల వయస్సుగల ముసలివాణ్ణి. కనూ తినేభోజనం కంటే నేను తినే భోజనానికి ఖరీదెక్కువ. దానికర్థం మా ఇద్దరిలో ఆర్థిక అసమానత్వం ఉన్నదనా? ఏనుగకు చీమకంటే వెయ్యి రెట్లు ఎక్కువ ఆహారం కావాలి. దానిని అసమానత్వం అనరు. కనుక ఆర్థిక సమానత్వ మంటే ప్రతి వానికీ అతని అవసరానికి సరిపోయినంత దొరకడమని అర్థం. మార్క్స్ చెప్పింది కూడా అంతే. ఒంటరిగా ఉన్న ఒకడు, భార్యా, నలుగురు పిల్లలూ ఉన్న వాడు అడిగినంత అడిగితే అది ఆర్థిక సమానత్వ సిద్ధాంతాన్ని భగ్నం చేయడమవుతుంది.

ధనవంతుని అవసరాలు బీదవాని కంటే ఎక్కువనీ చెప్పకూడదు. అది సారహీనమైన తర్కం. ఈ నాడున్న బీదలు, ధనవంతులు అనే విభేదాన్ని తలచుకొంటే నాకు చాలా బాధ కలుగుతున్నది. విదేశస్థులూ, పట్టణాలలో ఉన్న మన నాగరికులూ బీదలను పీల్చి పిప్పి చేస్తున్నారు. గ్రామస్థులు పంట పండిస్తున్నారు. వారికి తిండిలేదు. పాలను సమృద్ధిగా తయారు చేస్తున్నారు. వారి పిల్లలకు పాలు లేవు. ఇది ఎంత లజ్జాకరమైన విషయమో ఆలోచించండి. ప్రతి వాడికీ పుష్టికరమైన ఆహారమూ, నివాసానికి మంచి ఇల్లూ, పిల్లలకు చదువు వసతీ, మందూ మాకులూ లభించాలి" అని గాంధీజీ అన్నారు. గాంధీజీ ఊహించిన ఆర్థిక సమానత్వం ఇదే. అవసరమైన దాని కంటే ఏ వస్తువును ఎక్కువగా దగ్గర పెట్టుకొన్నా వారు కాదనరు. కాని బీదలు కూడా తినగా మిగిలితే ఆ పని చేయవచ్చును. కాని ముందు చేయవలసిన పనిని ముందు చేయాలి.

## ధర్మకర్తృత్వము

"ఈనాటి ధనవంతులు వర్గసంఘర్షణనో, లేక స్వేచ్ఛగా ధర్మకర్తృత్వ

సిద్ధాంతాన్ని అవలంబించి అనుసరించాలి. తమ ఆస్తిని వారు రక్షించుకొనవచ్చును. ఎవరినీ పీల్చి పిప్పి చేయకుండా స్వార్థం కొరకుగాక, దేశం కొరకు వారు తమ బుద్ధిని ఉపయోగించి ధనాన్ని సమకూర్చవచ్చును. వారు చేసే సేవనూ, వారి బుద్ధిబలాన్నీ అనుసరించి ప్రభుత్వం వారికి కమీషన్ గూడా ఇవ్వవచ్చును. వారి పిల్లలు గూడా అదే విధంగా బుద్ధి కుశలత కలవారైతే వారు గూడా ఆ సంపదకు రక్షకులు కావచ్చును." చివరకు గాంధీగారేమన్నారో చూడండి—

"రేపు భారతదేశం స్వతంత్రమైతే ధనవంతులందరికీ ధర్మకర్తలు కావడానికి అవకాశమిస్తాము. వారిమీద బలవంతంగా శాసనాలను రుద్దము. వ్యవస్థ క్రిందనుండి ప్రారంభమవుతుంది. ధర్మకర్తృత్వ సిద్ధాంతంలోని రహస్యం ప్రజలకందరికీ బాగా తెలిస్తే— అందుకు అవసరమైన వాతావరణం దేశంలో ఏర్పడితే— ప్రజలు స్వయంగానే గ్రామ పంచాయతుల ద్వారా అందుకనుగుణ్యమైన శాసనాలను నిర్మించుకొంటారు. అందరూ దానిని సంతోషంతో అంగీకరిస్తారు. పై నుండి నెత్తిమీద ఏ వస్తువునైనా రుద్దితే అది జడమై పోతుంది, భారరూపమవుతుంది"

## అయితే భేదమేమిటి?

ప్రశ్న— ఆర్థిక సమానత్వసిద్ధికిగాను మీ మార్గానికీ, సమాజవాదుల మార్గానికీ గల భేదమేమిటి?

జవాబు— సామ్యవాదులూ, సమాజవాదులూ చెప్పేదేమిటంటే ఆర్థిక సమానత్వ స్థాపనకుగాను వారు ప్రస్తుతం ఏమీ చేయలేరు. ఎక్కువగా ప్రచారంచేసి ముందు ప్రజలలో వర్గ వైషమ్యభావాన్ని పెంపొందిస్తారు. దాని సహాయంతో ప్రభుత్వాన్ని వశపరుచుకొని చివరకు ఆర్థిక సమాన

తను స్థాపిస్తారు. నా ఉద్దేశ్యం ప్రకారం ప్రభుత్వం ప్రజలమీద బలవంతంగా దేనినీ రుద్దదు. ప్రజల కోరికలను ప్రభుత్వం మన్నిస్తుంది. నేను ద్వేషంతో గాక, ప్రేమశక్తిమీద ఆధారపడి జనసామాన్యానికి నా భావాలను నచ్చ జెప్పుతాను. సమాజం నా ఉద్దేశ్యంతో ఏకీభవించి పని చేస్తుందా చేయదా అని గాక చెప్పిన సిద్ధాంతాల ప్రకారం ముందు నేను నడవడానికి ప్రయత్నం చేస్తాను. నా దగ్గర 50 మోటర్ల సంగతి అలా అట్టి పెట్టి, చివరకు పది ఎకరాల పొలం ఉన్నా నేను ఆర్థిక సమానత్వాన్ని బోధించలేను. అందుకు ముందు నేను బీదతనాన్ని స్వీకరించాలి. గడచిన ఏభై సంవత్సరాల నుండి నేను ఆ పనినే చేయడానికి ప్రయత్నం చేస్తున్నాను. అందువల్లనే నన్ను నేను కమ్యూనిష్టుని చెప్పుకుంటున్నాను. ధనవంతులిచ్చిన మోటర్లను నేను ఉపయోగిస్తున్న మాట నిజమే. కాని నేను వానికి లోబడి లేను. ప్రజాహితానికి నేను చేసేపని వ్యతిరేకమైనదని తోస్తే వెంటనే మోటర్లను ఉపయోగించడం మానివేస్తాను.

## అమలులోనికి వచ్చే అహింస

ప్రశ్న — బీదలయెడ ధనవంతులకు తమ కర్తవ్య భావాన్ని తెలియజేయడానికి సత్యాగ్రహానికున్న స్థానమేమిటి?

జవాబు— విదేశీ ప్రభుత్వం విషయంలో ఉన్న స్థానమే. సత్యాగ్రహాన్ని ప్రతిచోటా ఉపయోగించవచ్చును. కుటుంబంలో గూడా దానిని ఉపయోగించవచ్చును. ఒక జమీందారు రైతులను పీల్చుకొని తింటున్నాడనుకొండి. ఏమయ్యా! ఇది ఏమి పని? అని అడిగితే నా భార్యకు ఇంత కావాలి, నా పిల్లలకు ఇంత కావాలి అని అంటాడనుకోండి, అప్పుడేమి చేయాలి? ముందు భార్యా పిల్లలకు నచ్చ జెప్పి వారి చేతనే ఇది పనికిరాదని జమీందారుకు చెప్పించాలి. అయినా ఆ జమీందారు వినడు అనుకోండి. ఒకవేళ అతని భార్యా పిల్లలు మన

మాటను వినరనుకోండి. అప్పుడు రైతులు సత్యాగ్రహం మొదలు బెట్టి, ఆ భూములను సాగుచేయడం మానివేయాలి. కొత్త రైతులను ఆజమీందారు సృష్టిస్తాడనుకోండి. ఆ రైతులకు వద్దని మనవి చేయాలి. ఆ రైతులు గూడా వినరనుకోండి. ఈ లోగా సత్యాగ్రహంవలన అవసరమైన వాతావరణం ఏర్పడుతుంది. ప్రజాభిప్రాయం అనుకూలంగా మారి— వాతావరణంలో మార్పు రావడంతోనే ఈ సత్యాగ్రహాయుధం అమోఘంగా పనిజేస్తుంది. హింస ఇలాంటి స్థితిని కలుగనీయదు. సమాజంలో నిజమైన విప్లవమార్గాన్ని అనుశోధిస్తుంది.

సత్యాగ్రహం జయం పొందవలెనంటే ఈ క్రింది విషయాలు అవసరం. [1] సత్యాగ్రహి తన విరోధిని ఎప్పుడూ ద్వేషించకూడదు. [2] సత్యాగ్రహిచేసేవాదం సత్యం మీద ఆధారపడి ఉండాలి. [3] సత్యాగ్రహి తన సిద్ధాంతాలకొరకు చివరివరకూ కష్టాలు సహించడానికి సిద్ధంగా ఉండాలి.

( హరిజన సేవక్ **31-3-1946** )

పరిశిష్టము 3

# నేనూ సమాజవాదినే

( 1946 లో అమెరికా వార్తాహరుడు లూయీఫిషర్ గాంధీ గారిని పంచగనిలో కలుసుకొన్నాడు. వారిద్దరూ కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీ, సమాజవాదము, అహింస లాంటి అనేక విషయాలపై మాట్లాడుకొన్నారు. ఆ నాటి సమాజవాద వివరాలకు సంబంధించిన ప్యారేలాల్ రిపోర్టును క్రింద పొందు పరుస్తున్నాను )

గాంధీజీ—— సమాజవాద మిత్రులు చేస్తున్న త్యాగాన్నీ, చూపిస్తున్న ఆత్మ సంయమ భావాన్నీ ఎక్కువగా గౌరవిస్తున్నాను. కాని వారి పంథాకూ నా పంథాకూ చాలా భేదం ఉన్నది. సమాజవాదులకు హింస మీద నమ్మకమున్నది. నాకు అహింస మీద నమ్మకమున్నది.
దీనితో సంభాషణ క్రమం మారినది. మధ్యలో మీలాగానే వారు గూడా సమాజవాదులు అని లూయీఫిషర్ అన్నాడు.

గాంధీజీ—— నిజమైన సమాజవాదిని నేనే. వారు కాదు. వారిలో చాలా మంది పుట్టక పూర్వమే నేను సమాజవాదిని. జోహాన్స్‌బర్గ్‌లో అతని కంటే నేనే పెద్ద సమాజవాదినని ఒక సమాజవాదిని అంగీకరింప జేశాను. ఆ మాట ఇప్పుడు చెప్పితే ఏమీ ప్రయోజనం లేదు. వారి సమాజవాదం నశించి పోయినా నేను సమాజవాదినే అవుతాను.

"సమాజవాదమంటే మీ అభిప్రాయం ఏమిటి ?"

"నా సమాజవాదానికి అర్థం సర్వోదయం. నేను మూగవారినీ గుడ్డివారినీ, చెవిటివారినీ నశింపజేసి పైకి రావలెనని కోరడం లేదు. వారి సమాజవాదంలో బహుశా దీనికి స్థానముండదు. భౌతికాభివృద్ధియే వారి

లక్ష్యము. ఉదాహరణకు చూడండి. ప్రతి నగర నివాసికీ ఒక్కొక్క కారును ఇవ్వవలెనని అమెరికా లక్ష్యం. కాని నా కోరిక అది కాదు. నేను నా సంపూర్ణ వ్యక్తిత్వ వికాసం కొరకు స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాను. ఆకాశంలో మిణుకు మిణుకుమనే నక్షత్రాల వరకు చేరే మార్గాన్ని నిర్మించడానికి తగిన స్వాతంత్ర్యం నాకు కావాలి. అలాంటి పనిని నేను చేస్తానని దానికి అర్థం కాదు. వారి సమాజవాదంలో వ్యక్తిగత స్వాతంత్ర్యం లేదు. చివరకు వారి శరీరం మీద గూడా వారికి అధికారం ఉండదు."

"అవును. కాని సమాజవాదం అనేక రకాలుగా ఉన్నది. ప్రతి వస్తువు మీదా స్టేటుకు అధికారముంటుందని సమాజవాదం అభిప్రాయం కాదు. కాని ప్రస్తుతం రష్యాలో అనుకోడం అలా లేదనుకోండి, అక్కడ మీశరీరం మీద గూడా మీకు హక్కులేదు. ఏ తప్పుచేయకుండానే మీరు ఏనిమిషంలోనైనా ప్రభుత్వ నిర్బంధానికి గురి కావచ్చును. వారు ఎక్కడికి బడితే అక్కడికి మిమ్మల్ని పంపగలరు"

"మీ సమాజవాదంలో మీ పిల్లల మీద స్టేటుకు అధికారం ఉండదా? స్టేటు ఇష్టం వచ్చినట్లుగా మీ పిల్లలకు చదువు చెప్పించదా?"

"అన్ని రాజ్యాలూ అంతే చేస్తున్నవి. అమెరికా గూడా అంతే"

"అయితే రష్యాకూ అమెరికాకూ భేదం లేదన్న మాట"

"మీరు నియంతృత్వాన్ని వ్యతిరేకిస్తున్నారు"

"సమాజవాదం నియంతృత్వ ప్రధానం లేక సోమరిపోతుల శాస్త్రం. నన్ను నేను కమ్యూనిస్టునని చెప్పుకుంటున్నాను గూడా"

"అట్లా అనకండి. కమ్యూనిస్టునని చెప్పుకోవడం మీకు ప్రమాదకరం. మీరు కోరే దానినే, జయప్రకాశ్ నారాయణ్ కోరే దానినే, నేనూ

కోరుతున్నాను. అది స్వతంత్ర భారతం. కాని కమ్యూనిస్టులు కోరేది అది గాదు. తమ శరీరాన్నీ, మనస్సునూ గూడా బానిసత్వంలో ఇరికించవలెనని వారు కోరుతున్నారు"

"మార్క్సు విషయంలో గూడా మీ అభిప్రాయం ఇదేనా ?"

"కమ్యూనిస్టులు తమ ఇచ్ఛానుసారంగా మార్క్సు సూత్రాలను మార్చి అర్థం చెప్పకొన్నారు."

"లెనిన్ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి ?"

"లెనిన్ అసలు ఈపనిని ప్రారంభించాడు, స్టాలిన్ దానిని పూర్తి చేశాడు. కమ్యూనిస్టులు కాంగ్రెసులో చేరినా తమ స్వార్థసిద్ధికొరకే"

"సమాజవాదులు అలాగే అంటున్నారు. నా సామ్యవాదం సమాజ వాదం కంటే ఎక్కువ భిన్నమైనది కాదు. అది రెండింటినీ కలుపుతున్నది. ప్రకృతి సిద్ధమైన సమాజవాద పరిణామమే సామ్యవాదము"

"అవును, నిజమే. ఒకప్పుడు ఈ రెండింటినీ వేరు చేయడం కష్టంగా ఉండేది. ఇప్పుడది అంత కష్టం గాదు"

"అయితే మీరు స్టాలిన్ మార్కు సామ్యవాదాన్ని అభిలషించడం లేదా ?"

"హిందూ దేశంలోకమ్యూనిస్టులు స్టాలిన్ మార్కు సమాజవాదాన్ని స్థాపించవలెనని కోరుతున్నారు. అందుకు మీ పేరును ఉపయోగించు కొంటున్నారు."

అందులో వారు సఫలులు కాలేరు.

(హరిజన సేవక్ 4-8-46)

---

పరిశిష్టము ౪

# ప్రకృతివాదము, ఆత్మవాదము

ఆత్మవాదులూ, భౌతికవాదులూ ఇద్దరూ ఒకే తత్వాన్ని అంగీకరిస్తున్నారు. వారు వాడే భాషగూడా ఒకటిగానే ఉంటున్నది. ఆత్మవాది చైతన్యమంటే భౌతికవాది దానినే ప్రకృతి అంటాడు. ఇద్దరికీ మధ్య పరిభాషను చెప్పుకోడంలో తప్ప ఇంకేమీ భేదం లేదని పాఠకులనుకోవచ్చును. డైలెక్టికల్ మెథడ్స్, ఫిలసాఫికల్ మెటీరియలిజం అనే భౌతిక దర్శన గ్రంథాలలో స్టాలిన్ వాడిన లక్షణాలన్నీ ప్రకృతి అనే శబ్దానికి బదులు చైతన్యం అని వాడితే గాంధీవాదానికి కూడా సరిపోతవి.

స్టాలిన్ ఏమని వ్రాశాడో చూడండి—

(1) మార్క్సు న్యాయ శాస్త్రానికి ఇవి ముఖ్య సూత్రాలు.

(క) ఈ న్యాయశాస్త్రం ప్రకృతికి సంబంధించిన ఒక పరస్పర సంకలితమైన, ఒక చోటికి చేరిన ఏకత్వం లాగా కనపడుతున్నది. దానిలో అన్ని వస్తువులూ, ఘటనలూ, పరస్పర సంకలితాలుగా, అన్యోన్యాశ్రయం కలవిగా, ఒకదాని ప్రభావం ఇంకొకదానిమీద పడేటట్లు చేసేవిగా కనపడుతున్నవి.

కనుక ఈ శాస్త్ర ప్రకారం ప్రకృతిలోని ఏ ఘటననూ ప్రక్కన ఉన్న ఘటనలనుండి వేరుపరచి మాట్లాడడానికి వీలు లేదు. పరిసర పరిస్థితుల అనుబంధంలో నుండి విడదీసి ఘటనలను అవలోకించడం ప్రారంభిస్తే ప్రయోజనం ఉండదు. పరస్పర సంబంధాన్ని గుర్తిస్తూ అధ్యయనం చేసిన నాడే ప్రకృతి రహస్యాన్ని మనం తెలుసుకోగలుగుతాము.

(ఖ) ప్రకృతి స్థిరంగా గతిహీనంగా పడి ఉండేదికాదు. అది ప్రగతి పరివర్తనాలు లేనిదికాదు. అది ఎప్పుడూ కొత్తరూపాలను గ్రహిస్తూ ఉంటుంది. వికాసాన్ని పొందుతూ ఉంటుంది. దీనిలో ప్రతిక్షణమూ కొంత నూతనసృష్టీ, కొంత విసర్జనా, కొంత నాశనమూ జరుగుతూనే ఉంటుంది.

(గ) కళ్ళకు కనిపించని అత్యల్పమైన సంఖ్యాత్మక పరివర్తనలద్వారా గుణాత్మకమైన మార్పులు జరుగుతుంటవి. ఈ గుణాత్మక పరివర్తనాలు నెమ్మది నెమ్మదిగా గాక తొందర తొందరగా ఒకటేసారిగా ఒక స్థితినుండి ఇంకొక స్థితిలోనికి దూకుతుంటవి. ఆ మార్పులు హఠాత్తుగా జరగవు. కళ్లకు కనిపించనంత సూక్ష్మమైన క్రమసంఖ్యాత్మక పరివర్తన సమూహాల పరిణామ స్వరూపంగా ఏర్పడుతున్నవి.

వికాసస్థితి ఎప్పుడూ వర్తులాకారంగా ఉండదు. అంటే జరిగినదే జరుగుతూ ఉండదు. ఈ స్థితి ఎప్పుడూ ఉన్నత దిశకు అగ్రసర మవుతుంది. ఒక గుణాత్మక స్థితినుండి ఇంకొక గుణాత్మక స్థితికి పరివర్తిత మవుతుంది.

(ఘ) ప్రకృతిగతమైన వస్తువులలోనూ, ఘటనలలోనూ అంతరికమైన విరోధం ఉండడం స్వభావసిద్ధం. ఎందువల్లనంటే వాటికి వామ, దక్షిణ గతులుంటవి. భూత భవిష్యత్కాలాలుంటవి. అన్నింటిలో సృష్టి, లయా లుంటవి. వామ దక్షిణ గతులమధ్యా, భూత భవిష్యత్తులమధ్యా, నశించే వికసించే వస్తువుల మధ్యా కలిగే సంఘర్షణలోనుండియే సంఖ్యాత్మక ( రూపాత్మక ) గుణాత్మక పరివర్తనం జరుగుతుంది.

పైనచెప్పిన మాటలనన్నింటినీ ప్రకృతిని తీసివేసి ఆత్మ అనే శబ్దాన్ని చేరిస్తే ఆత్మవాదిగూడా అంగీకరిస్తాడు. కాని ఈ క్రింది విషయంలో ఇద్దరికీ కావలసినంత అభిప్రాయ భేదమున్నది.

"క్రింది స్థితినుండి పై స్థితికి జరిగే మార్పు ఘటనల సమన్వయంతో గాక ఘటనలకుగల స్వాభావికమైన సంఘర్షణలకు ఫలితంగా ఏర్పడుతుంది. విరోధకమైన గుణాలు కారణంగా ఒకదానికింకొకటి వేరైన ప్రవృత్తుల సంఘర్షణకు పరిణామమే. పరివర్తన."

ఈ మాట అనడంలో ప్రకృతివాది తనకు తెలిసినదానికంటే ఎక్కువ మాట్లాడుతున్నాడని నా అభిప్రాయం. ఈ సంఘర్షణ వెనుక గూడా "సమన్వయం" ఉన్నదా లేదా అని అడిగితే గట్టిగా అతడు లేదని చెప్ప లేడు. మగ్గంలోని నూలు కండెలు ఒకటి అటూ ఒకటి ఇటూ పోయినా గుడ్డ నేయబడుతుంది. ఈ సంఘర్షణా, సమన్వయాలు అలాగే ఉంటవి. ప్రపంచంలోని ప్రవత్తులన్నింటికీ వెనుక సమన్వయభావం లేకపోతే పక్ష విపక్షాలకు పర్యవసానంగా ఒక సమాధానాన్ని — తీర్పును— తీసుకొని రావడం అసంభవమవుతుంది.